# శ్రీవిద్యా హృదయము

(యోగినీ హృదయమునకు తెలుగు వ్యాఖ్య)

గ్రంధకర్త :

సువర్ణఘంటాకంకణ

శ్రీవిద్యా రత్నాకర, శ్రీవిద్యా విశారద

శ్రీ క్రోవి పార్థసారథి

ప్రతులకు

శివకామేశ్వరి గ్రంథమాల

41-22/4-36, భ్రమరాంబాపురం,

విజయవాడ - 520 013. ఫోన్ : 522824

# శ్రీవిద్యా హృదయము

గ్రంథకర్త :

**శ్రీ క్రోవి పార్థసారథి**

23-11/1-10/2, దేవీ నిలయం,
ఓగిరాలవారి వీథి,
సత్యనారాయణపురం,
విజయవాడ - 520 011.
ఫోన్ : 530672



టైటిల్ డిజైన్ : పి. రాము

**వెల : రూ. 75-00**

ప్రతులకు :

**శివకామేశ్వరి గ్రంథమాల**

41-22/4-36, భ్రమరాంబాపురం
కృష్ణలంక, విజయవాడ - 520 013.
ఫోన్ : 522824

ముద్రణ :
**నిర్మలా ఆఫ్‌సెట్ ప్రింటర్స్**
గాంధీ నగర్ విజయవాడ - 3.
ఫోన్ : 574828

# ప్రణతులు

ఇది అద్వైత సిద్ధాంత ప్రతిపాదిత శ్రీవిద్యా గ్రంథము. నిరాకారుడు, నిర్గుణ స్వరూపుడు అయిన పరబ్రహ్మ జగత్తులో శ్రీవిద్యా వ్యాప్తి కోసము, భక్తులైన సాధకుల కోర్కెలు తీర్చటం కోసము 'యోగినీ హృదయా'న్ని పరమేశ్వరికి ఉపదేశిస్తాడు. ఇక్కడ యోగిని అంటే సాక్షాత్తూ ఆ పరమేశ్వరియే. ఆ యోగినీ హృదయానికి నేను వ్రాసిన తెలుగు వ్యాఖ్యయే 'శ్రీవిద్యా హృదయము'.

ఇది మొత్తం మూడు భాగాలుగా ఉంటుంది. 1. చక్ర సంకేతము 2. మంత్ర సంకేతము 3. పూజా సంకేతము.

మొదటి భాగంలో శ్రీచక్రం అంటే ఏమిటి ? దాని ప్రాముఖ్యత ఏమిటి ? చక్రోత్పత్తి ఎలా జరిగింది ? సృష్టి చక్రము, స్థితి చక్రము, సంహార చక్రముల వివరాలు, చక్రంలోని వివిధ ఆవరణలు, వాటిలోని దేవతలు, శరీరంలో శ్రీచక్ర భావన, బిందువు, అర్ధ చంద్రము, రోధిని, నాదము, నాదాన్తము, శక్తి, వ్యాపిక, సుమన, ఉన్మన, శ్రీచక్ర పూజకు అధికారులెవరు ? లింగ స్వరూపాలు, కామకళా స్వరూపము, కామేశ్వరి ఆయుధాలు, తురీయ బిందు స్వరూపము, ముద్రలు వాటి వివరణ, నవయోనులు, సమిష్టి చక్రభావన, శ్రీచక్ర పూజా ఫలం వివరించబడ్డాయి.

రెండవ భాగంలో పంచదశీ మహామంత్రము, మంత్రార్థాలు, శివశక్తుల స్వరూపము, మంత్ర జగత్తుల ఐక్యము, పరదేవత అవయవత్వము, పంచభూతమయత్వము, హకారాదుల భూత గుణత్వము, షట్త్రింశతత్వాలు, శబ్దపంచకత్వము, స్పర్శ చతుష్టయము, రూపత్రయము, రసద్వయము, గంధము, పంచదశికి సర్వమంత్ర సమన్వయత్వము, భావార్థము, సంప్రదాయార్థము, నిగర్భార్థము, కౌళికార్థము, సర్వరహస్యార్థము, మహాతత్వార్థములు వివరించబడ్డాయి.

మూడవ భాగంలో నిత్యపూజ, నైమిత్తిక పూజ, శ్రీచక్రార్చన, గణేశన్యాసము, రాశిన్యాసము, గ్రహన్యాసము, యోగినీ న్యాసము, నక్షత్ర న్యాసము, పీఠ న్యాసము, శ్రీచక్ర సృష్టి న్యాసము, లయన్యాసము, కలశస్థాపన, సామాన్యార్ఘ్య పాత్ర, విశేషార్ఘ్యపాత్ర, గురుపంక్తి పూజ, మూడు రకాల హోమాలు, నవావరణ పూజ, బ్రాహ్మి మొదలైన యోగినుల పూజ, చక్రేశ్వరి అర్చన, కాలవిషువము, తత్త్వ విషువము, నైమిత్తి కార్చన, కులాచారము, గురుపూజ, దేవీధ్యానము, ఉద్వాసన, బలి, శ్రీచక్ర, పరమేశ్వరి పూజా ఫలములు వివరించబడ్డాయి.

ఆస్తికులు, ప్రత్యేకించి పరమేశ్వరి భక్తులకు, దేవీ ఉపాసకులకు ఇది అత్యంత ప్రామాణికమైన గ్రంథము. శ్రీవిద్యోపాసకులందరూ చదివి తీరవలసిన గ్రంథమిది. ఈ గ్రంథ రచనలో నాకు అన్ని విధాలా తన సహకారమందించి నన్ను ప్రోత్సహించిన నా అర్ధాంగి శ్రీమతి రమాదేవికి కృతజ్ఞతలు.

ఈ గ్రంథానికి శ్రీముఖములు పంపిన పీఠాధిపతులందరకూ నా పాదాభివందనాలు తెలియచేస్తున్నాను.

సామాన్య మానవుడికి కూడా అర్థం కావాలనే తలంపుతో వ్రాసిన ఈ గ్రంథాన్ని సాధకులూ, పరమేశ్వరి భక్తులూ, పండితులూ అందరూ ఆదరిస్తారని ఆశిస్తూ .....

ప్రమాథినామ సంవత్సర
మార్గశిర శుద్ధ పంచమి
13-12-1999

బుధజన విధేయుడు
క్రోవి పార్థసారథి

Phone : 2707 (Tenkasi)




HIS HOLINESS JAGADGURU

**SRI SIVA CHIDANANDA BHARATHI SWAMI**

Sri Siddheswari Peetadhipati

Courtallam - 627 801.

(Via) Tenkasi - Tirunelveli Dist. --- South India

With Narayanasmritis


# అభినందన

5-5-1997

దేవీ పూజలో కౌళ, సమయ మతములు, శ్రీ చక్రాంతర్గత రహస్యములు. భిన్న సంప్రదాయములలో పంచదశీ మహామంత్రము, షట్చక్రభేదనదేవి సాక్షాత్కారము, మొదలైన విషయములు పామరులకు కూడా అర్థమయ్యే రీతిలో శ్రీ క్రోవి పార్థ సారధిగారు వ్రాసిన

## "శ్రీ విద్యాదర్శనము"

గ్రంథా విష్కరణ సమయమున వారిని అభినందిస్తూ కుర్తాళం సిద్ధేశ్వరీ పీఠ మహా సంస్థానామోదమున గ్రంథకర్తను

## శ్రీ విద్యారత్నాకర

అను బిరుద రాజముతో సన్మానించడమయినది.

ఇతి నారాయణస్మృతిః

[signature]



13-12-1999న శ్రీవిద్యా మహాయజ్ఞము ముగింపుసభ మరియు
శ్రీవిద్యా హృదయము, శ్రీవిద్యా పంచదశి, శ్రీవిద్యా మహాయంత్రము గ్రంథముల
ఆవిష్కరణ సందర్భమున శ్రీ క్రోవి పార్థసారథిగార్కి జరిగిన కనకాభిషేక మహోత్సవం



13-12-99న "శ్రీవిద్యా హృదయము" గ్రంథావిష్కరణ చేస్తున్న పరమహంస పరివ్రాజకాచార్య శ్రీశ్రీశ్రీ చిదానంద భారతీస్వామి, భువనేశ్వరీ పీఠం, గన్నవరం.

# श्री श्री जगद्गुरु शङ्कराचार्य महासंस्थानम्
## दक्षिणाम्नाय श्री शारदापीठम् शृङ्गेरी

*PRIVATE SECRETARY*
To His Holiness
Sri Jagadguru Shankaracharya
Dakshinamnaya
Sri Sharada Peetham
SRINGERI – 577 139 (Karnataka)



Camp : శృంగేరి
Ref : DA/3759
Date : 29-12-99

శ్రీ [illegible] పార్థసారధి గారికి నమస్కారములు.

మీరు 5-11-99 న వ్రాసిన పత్రము దానితో పంపిన 'శ్రీ విద్యా[illegible]దండకము' ([illegible] దండకమునకు తెలుగు వ్యాఖ్య) పుస్తకము అందినది శ్రీ చరణాల సన్నిధిన సమర్పించితిని.

మీ యీ వ్యాఖ్యానము [illegible] ఉన్నదని మరింకను [illegible] ఉన్నదని యీ శ్రీ చరణాలు సెలవిచ్చినారు.

శ్రీ చరణాల [illegible] [illegible] శ్రీ [illegible] మీకు తెలుపుచున్నాను.

ఇట్లు,
[signature]



Phone: 22707 (04633)

HIS HOLINESS JAGADGURU

**SRI SIVA CHIDANANDA BHARATHI SWAMI**

SRI SIDDHESWARI PEETADHIPATI

**COURTALLAM - 627 802**

(Via) Tenkasi — Tirunelveli Dist. — South India.

With Narayanasmritis

Date 23-11-99

## శ్రీముఖం

చిరంజీవి శ్రీ పార్థసారథిని చిరాయువుగా దీవించి, నారాయణ స్మరణలతో వ్రాయునది. మీరు యోగినీ హృదయమునకు 'శ్రీవిద్యా హృదయము" అను శీర్షికతో అనువదించిన చిత్తు ప్రతిని పరిశీలించడమైనది. మీరు మూల గ్రంథములో వ్రాసిన అంశములన్నియు చక్కని తర్జుమాతో మీ వ్యాఖ్యనుజతపరచి పూర్తిజేసిన కృషి అభినందనీయము. మూల గ్రంథకర్త పొందుపరచిన అంశములను యధాతథముగా అనువదించుటలో మీ భాషాజ్ఞానము, అనువాదపటిమ, శ్రీవిద్యోపాసనలో గల అభినివేశము ముప్పేట సహకరించుటచే పఠితలు అతి సులువుగా అర్థము చేసికొను రీతి గ్రంధమును అందించినారు. మేము మీ పూర్వ గ్రంథా విష్కరణ సభలలో భాషణ చేసినప్పుడు 'శ్రీచక్రము' పై అన్ని దృకోణరీముల నుండి పూజించుటకు, అర్థముచేసికొనుటకు సమగ్ర గ్రంథ రచన చేయమని సూచించిన విధమును గురు ఆదేశముగా భావించి మీరు ఈ గ్రంధ రచనలో ధన్యత పొందినారు. మీ కృషికి శ్రీచక్రాధిష్ఠాన దేవత లలితా పరాభట్టారిక అనుగ్రహము మీపైన, మీ కుటుంబసభ్యులపైన వర్షించుగాక!

కుర్తాళ పీఠ అధిష్ఠాన దేవత శ్రీరాజరాజేశ్వరి అమ్మవారి అనుగ్రహము మీ అందరి పై ప్రసరించులాగున ప్రార్థించడమైనది.

ఇతి నారాయణ స్మృతి

శ్రీ శివచిదానంద భారతీస్వామి

Phone : 823332

SRI SRI SRI SWAMY SWAROOPANANDENDRA SARASWATI
(Peetadhipathi)




# SRI SARADA PEETHAM


C/o. ADISANKARA TRUST (Regd. 74/97)
Upanishad Vihar, Sramshakthi Nagar
Chinnamushidivada, Pendurti-531 173, Visakhapatnam. (A.P.)


---

శివుడు పార్వతికి ఉపదేశించిన విద్య శ్రీవిద్య. శ్రీవిద్య పరమాత్మ బ్రహ్మజ్ఞానాన్ని ప్రభోదిస్తుంది. మోక్షైక లక్ష్యమైన శ్రీవిద్యకు ఉపాసనకు విశిష్ట ప్రధాన్యం ఉంది. సాధకులు ఈ విశిష్టతను అర్థం చేసుకునేందుకు అనువుగా గ్రంధకర్త సులభశైలిలో "యోగినీ హృదయం"ను ఆంధ్రీకరించినారు. శ్రీవిద్యను తాముగా అద్యయనం చేయగోరే సాధకులకు, పరిశోధకులకు ఈ గ్రంథం ఉపయుక్తము. గ్రంధకర్త అనువాదముతోపాటుగా అనేక విషయములు క్రోడీకరించిన వివరణాత్మకంగా వివిధ శీర్షికల క్రింద పొందుపరిచారు. ఇందువలన పాఠకులకు పునశ్ మననం సులభం అవుతుంది. శ్లోకాలకు ప్రతిపదార్ధ తాత్పర్యములను కూడా చేర్చినట్లయితే మరింత మనోహరంగా ఉండేది.

శారదామాత కృపకు పాత్రులయిన చిరంజీవులు శ్రీక్రోవిపార్థసారథిగారు ముమ్ముందు ఇటువంటి గ్రంధాలెన్నింటినో పాఠకులకు అందించాలని వారికి, వారి కుటుంబీకులకు సదా ఆయురారోగ్య ఐశ్వర్యములను శ్రీ శారదాదేవి ప్రసాదించాలని ఆశీర్వదిస్తు.......

నారాయణ స్మృతులతో

---

# విషయ సూచిక

ఓం శ్రీ పరమాత్మనే నమః

# శ్రీ విద్యా హృదయం

## 1. చక్ర సంకేతము

### భైరవీ భైరవుల సంవాదము

సృష్టి ఆరంభంలో, కృతయుగానికి ముందు నిరాకారుడు, నిర్గుణ స్వరూపుడు అయిన పరబ్రహ్మ పూర్ణ బిందువుగా ఉండేవాడు. అటువంటి స్థితిలో పరమాత్మ సృష్టి చెయ్యాలని సంకల్పించి తనను తాను రెండు భాగాలుగా విభజించుకున్నాడు. ఆ భాగాలే 1) ప్రకాశాంశ 2) విమర్శాంశ. ప్రకాశాంశ పరమేశ్వరుడు కాగా విమర్శాంశ పరమేశ్వరి. ప్రకాశాంశ సత్వగుణ ప్రధానమైనది. విమర్శాంశ తమోగుణ ప్రధానమైనది. ప్రకాశాంశ శుక్లబిందువు. విమర్శాంశ రక్తబిందువు. వీరే శివశక్తులు. కామేశ్వరీ కామేశ్వరులు. పరమేశ్వరుని స్వరూపమే పరమేశ్వరి. ఆయన బింబము అయితే ఆమె ప్రతిబింబము. ఇంకా చెప్పాలంటే జగత్తులోని సాధకులను, భక్తులను ఉద్ధరించటం కోసం నిరాకారుడైన పరమాత్మ ఒక రూపాన్ని ధరించాడు. అదే పరమేశ్వరి. అందుచేతనే పరమేశ్వరుడికి ఆకారం లేదు కాని పరమేశ్వరికి ఆకారం చెప్పబడింది. పరమేశ్వరి మాయా స్వరూపిణి. ఆవిడ వల్లనే మాయా మోహితమైన ఈ చరాచర జగత్తు అంతా సృష్టించబడింది. సృష్టి స్థితి లయాలకు, త్రిగుణాలకూ, మాయకూ, అతీతుడు ఆ పరమేశ్వరుడు ఒక్కడే.

పరమేశ్వరి సృష్టికార్యక్రమం ప్రారంభించింది. అవ్యక్తము నుంచి వ్యక్తము, వ్యక్తమునుంచి అహంకారము ఉద్భవించినాయి. దాని నుంచి సృష్టికి అవసరమైన పంచభూతాలు, తన్మాత్రలు, ఇంద్రియాలు ఉద్భవించినాయి.

**శ్రీ దేవ్యువాచ :**

*దేవదేవ మహాదేవ పరిపూర్ణ ప్రథామయ ।*
*వామకేశ్వర తంత్రే ఽస్మిన్ ఆజ్ఞాతార్థా స్త్వనేకశః* 1
*తాంస్తానర్థానశేషేణ వక్తుమరసి భైరవ ।*

చరాచర జగత్తులోని ప్రతి వస్తువూ పరమేశ్వరుని స్వరూపమే. ప్రాణమున్నవి, ప్రాణములేనివి, చలనమున్నవి, చలనములేనివి, అన్నీ ఆయన ప్రతి రూపాలే. వీటిలో ఏ ఒక్కటీ కూడా స్వేచ్ఛగా ప్రకాశించదు. పరమేశ్వరుని అనుజ్ఞతోనే సృష్టి జరుగుతున్నది. పరమేశ్వరుని అనుజ్ఞలేకపోయినట్లైతే పంచ భూతాలు కూడా పేరుకు మాత్రమే మిగులుతాయి. వాటి లక్షణాలను కోల్పోతాయి. ఈ రకంగా సృష్టి యావత్తూ పరమేశ్వరమయం అయి ఉన్నది.

యోగినీ హృదయము అనే ఈ గ్రంథానికి పూర్వ భాగము 'వామకేశ్వరతంత్రము'. అందులో బహిర్యాగము అంటే కామ్యసిద్ధి కోసం చేసేటటువంటి పూజా విధానం పూర్తిగా వివరించబడింది. కాని అంతర్యాగము గురించి చెప్పబడలేదు. అంతర్యాగము తెలియకుండా సాధకుడికి మోక్షము సిద్ధించదు. వామకేశ్వర తంత్రంలో చెప్పబడని విషయాలు ఇప్పుడు ఇక్కడ చెప్పబడుతున్నాయి. కౌళాచారంలో శివ శక్తులను భైరవుడు, భైరవి అంటారు. భైరవి భైరవునితో అంటోంది. ఓ భైరవా! సర్వ జగత్తునూ శాసించేవాడవు నువ్వు. సృష్టి స్థితి లయకారకుడవు. నీవే పరమేశ్వరుడవు. కాబట్టి నీవు గురు రూపం పొంది, నన్ను శిష్యురాలిగా స్వీకరించి ఆత్మ రహస్యాన్ని వివరించవలసినది' అని భైరవి వేడుకుంటున్నది.

సృష్టిలో మొదటగా (ఆహారము) అన్నం ఉద్భవించింది. ఆ తరువాతే ప్రాణులు సృష్టించబడ్డాయి. ఈ రకంగా చరాచరజగత్తు సృష్టించబడింది. ఈ సృష్టికి మూలకారణం పరమేశ్వరి. ఆమెకు జరామరణాలు లేవు. పాప పుణ్యాలు ఆమెను అంటవు. ఆమెతో సమానమైనవారు కాని, ఆమెకన్న అధికులుగాని ఇంకొకరు లేరు. ఆమెకు లింగభేదం లేదు. భక్తుల కోర్కెలు తీర్చటానికి ఆమె వివిధ రూపాలలో వారికి దర్శనమిస్తుంటుంది. సాధకుల అర్హతలను బట్టి వారికి ఉత్తమగతులు ప్రసాదిస్తుంది. ఈశ్వరులకు ఈశ్వరి కాబట్టి పరమేశ్వరి. సర్వులకు ఈశ్వరి కాబట్టి సర్వేశ్వరి. పరమేశ్వరునికి ప్రతిరూపమైనది, భక్తుల కోర్కెలను సులభంగా తీర్చేది, తనను నమ్మినవారిని సదా కాచి రక్షించేది అయిన ఆ పరమేశ్వరికి వినమ్రుడనై నమస్కరించి పరమేశ్వర స్వరూపమైన నాగురు పరంపరకు నీరాజనాలర్పించి హైందవ ధర్మ పరిరక్షణ కోసం ఏర్పాటయిన శృంగేరీ, కంచి, పుష్పగిరి, కుర్తాళం పీఠాధిపతులు, భగవత్స్వరూపులు అయిన ఆ మహానీయుల దివ్యపాదారవిందములకు ప్రణమిల్లి, గణపతి సచ్చిదానందస్వామి, స్వామి వాసుదేవానందగిరి వారల అశీస్సులతో హరితస గోత్రీకుడనైన క్రోవిపార్థసారథి అను నేను యోగినీహృదయము

అనే ఈ గ్రంథాన్ని తెలుగులో సామాన్యుడికి కూడా అర్థమయ్యేటట్లుగా సులభశైలిలో వ్రాయటానికి ఉపక్రమిస్తున్నాను. పండితులు, సాధకులు, దేవీ భక్తులు అందరూ నా యీ సాహసాన్ని మన్నించి నన్ను ఆశీర్వదింతురుగాక.

మానవ శరీరంలో షట్చక్రాలున్నాయి. సాధకులు వారి వారి అర్హతలను బట్టి పరమేశ్వరిని ఈ చక్రాలలో ఆరాధిస్తుంటారు. కౌళాచారులు ఆధార, స్వాధిష్ఠానాలలో దేవిని ఉపాసిస్తే సమయాచారులు మణిపూరం దగ్గర నుంచే దేవిని ఉపాసిస్తారు. ఆధార స్వాధిష్ఠానాలు అంధకార బంధురాలు. అక్కడ కౌళులకు మాత్రమే అధికారమున్నది. ఈ ప్రదేశంలో శివశక్తులను భైరవుడు, భైరవి అని పిలుస్తారు.

*జపాకుసుమసంకాసౌ మధుఘూర్ణితలోచనౌ ।*
*జగతః పితరౌవందే భైరవీ భైరవాత్మకౌ ॥*

మధుపానముతో మత్తెక్కి, మంకెన్న పూలవలె ఎర్రని కనులు గలిగి, ఈ జగత్తుకే తల్లితండ్రులైనటువంటి భైరవీ భైరవులకు నమస్కరిస్తున్నాను.

యోగిని హృదయంలోని మొదటి శ్లోకంలో భైరవి భైరవుణ్ణి అడుగుతున్నది అని చెప్పబడింది. కాబట్టి ఇది కౌళాచారులకు ప్రామాణిక గ్రంథము అని తెలుస్తోంది. కాగా సమయాచారులకు ప్రామాణిక గ్రంథము 'కామకలావిలాసము'. దీనికి నేను వ్రాసిన వ్యాఖ్యానమే 'శ్రీవిద్యా సర్వస్వము'

చరాచర జగత్తు అంతా సృష్టించబడింది. ఈ జగత్తులోని భక్తులను సాధకులను ఉద్ధరించగోరినవాడైన పరమేశ్వరుడు శ్రీవిద్యను ఈ లోకంలో ప్రచారం చెయ్యాలనే సంకల్పంతో తాను పరమేశ్వరికి ఉపదేశిస్తున్నాడు. అంటే తాను గురువుగా మారి, పరమేశ్వరిని శిష్యురాలిగా చేసి లోకంలోని సాధకులకు శ్రీవిద్యను వివరిస్తున్నాడు.

ఏ విద్య అయినా సరే గురుముఖతః నేర్చుకోవాలి. కాబట్టి శ్రీవిద్యకు ఆది గురువు పరమేశ్వరుడు. మొదటి శిష్యుడు లేక శిష్యురాలు పరమేశ్వరి. వీరిద్దరూ ఒక్కటే. వీరిలో ఎవరూ ఎక్కువ కాదు, ఎవరూ తక్కువ కాదు. పరమేశ్వరుని ప్రతిరూపమే పరమేశ్వరి. అయినప్పటికీ సాధకుల కోసమని, శివుడు శక్తితో చెబుతున్నట్లుగా చెప్పి మనకు తెలియచేయటం జరుగుతోంది. ఈ రకంగా పరమేశ్వరుని దగ్గర తెలుసుకున్న శ్రీవిద్యను మొదటగా శివపార్వతులకు ఉపదేశించింది. ఆ తరువాత ఓఘత్రయము ద్వారా ఆ విద్య మనకు సంక్రమించింది.

లోకంలో జనులందరూ ముముక్షువులు కాదు. వారి కర్మ ఫలాన్ననుసరించి చాలా మంది ఐహిక లంపటంలోనే కొట్టుమిట్టాడుతూ ఉంటారు. అటువంటి వారి కామ్యసిద్ధికి వామకేశ్వర తంత్రము చెప్పబడింది. కాగా .....

***అర్చనం ద్వివిధం చైవ వామ దక్షిణ బేధతః***
***వామేన వా దక్షిణేన పూజనంతు యధారుచిః***

పరమేశ్వరిని ఏ విధంగా పూజించాలి ? అనే ప్రశ్న వచ్చినప్పుడు వామాచారము, దక్షిణాచారము అని రెండు రకాల ఆచారాలున్నాయి. వాటిలో ఏ విధంగానైనా పరమేశ్వరిని అర్చించవచ్చు అని చెప్పబడింది.

కౌళాచారులు మోక్షాన్ని కోరినప్పుడు, వారికి యంత్ర, మంత్ర, పూజావిధానాలు, అది కూడా అంతర్యాగము యోగినీ హృదయంలో వివరించబడుతోంది. ఆ విధమైన అంతః పూజను వివరించమని భైరవి అడుగుతోంది.

**శ్రీ భైరవ ఉవాచ :**

*శ్రుణుదేవి మహాగుహ్యం యోగినీ హృదయం పరమ్ ॥* 2
*తత్ ప్రీత్యాకథయామ్యద్య గోపనీయం విశేషతః ।*
*కర్ణాత్కర్ణోపదేశేన సంప్రాప్త మవనీతలం ॥* 3

భైరవి అడిగిన దానికి భైరవుడు సమాధానమిస్తున్నాడు. ఓ దేవీ ! 'ఉత్తర చతుశ్శతి' అనబడే ఈ గ్రంథానికి యోగినీ హృదయము అనే పేరు ఏ విధంగా వచ్చినదో వినవలసినది. యోగము అంటే పరశివ సామరస్య రూపమైన అంతర్ముఖత్వము ఈ గ్రంథంలో ఉన్నది కనుక యోగిని అనబడుచున్నది. అటువంటి యోగిని యొక్క హృదయము. యోగినీ అంటే త్రిపుర సుందరీ యొక్క, హృత్ అంటే చిత్తమును పొందుచున్నది కాబట్టి 'యోగినీ హృదయము'.

హృద్గతమైన సామరస్యము వలన కలిగేది ఆనంద రహస్యము. అది అతిగుహ్యామైనది. లేక అతిరహస్యమైనది. సాధకులకు అనుభవైక వేద్యము. నువ్వు నా శిష్యురాలవు కాబట్టి నీ యందుగల వాత్సల్యముతో ఆ విషయములను నీకు చెబుతున్నాను. ఇవి ఇంతవరకూ ఎక్కడా ఎవరితోనూ చెప్పబడి ఉండలేదు. కాబట్టి వీటిని అతి రహస్యముగా ఉంచాల్సింది. ఈ విషయాలు ఒకరినుంచి ఒకరికి ఉపదేశము చెయ్యటం ద్వారానే భూలోకంలోకి వెళ్ళాలి.

ఇక్కడ యోగిని అంటే ఆ పరమేశ్వరియే అని చెప్పబడింది. కాబట్టి యోగినీ హృదయము అంటే ఆ పరమేశ్వరి హృదయమందలి రహస్యాలే. అంటే అన్నీ ఆమెకు తెలిసిన విషయాలే. అయినప్పటికీ తాను తెలుసుకోవాలనే కోరికతో ఆమె అడుగుతున్నది. ఈ విషయాలన్నీ కూడా కర్ణాత్కర్ణోపదేశము వల్లనే తెలియబడుచున్నాయి. అంటే గురువు దగ్గర శిష్యులు చెప్పుకుంటున్నారు. ఈ విధంగా గురుపరంపరవల్ల విద్య విస్తరిస్తోంది. అంతేకాని కేవలము పుస్తకాలు చదవటం వల్ల కాదు. తాను తెలుసుకున్న ఈ విద్యను పరమేశ్వరి ముందుగా శివ పార్వతులకుపదేశించింది. ఆ తరువాత వారు లక్ష్మీ నారాయణులకు, వారిచే వాణీ హిరణ్యగర్భులకు ఉపదేశింపబడింది. వారి నుండి ఇంద్రాది దేవతలకు, సనకసనందనాధి సిద్ధులకు, విద్యారణ్యులు, శంకరులవంటి మానవులకు సంప్రాప్తించింది. వీరినే ఓఘత్రయము అంటారు.

దివ్యౌఘులు - ఇంద్రాది దేవతలు.
సిద్ధౌఘులు - సనకసనందనాది మహర్షులు.
మానవౌఘులు - విద్యారణ్యులు, శంకర భగవత్పాదులు వంటి వారు.

ఈ రకంగా గురుపరంపరగా శ్రీవిద్య మనదాకా వచ్చింది.

## శ్రీవిద్యకు అర్హులు

*నదేయం పరశిష్యేభ్యోనాస్తికేభ్యోనచేశ్వరి ।*
*న శుశ్రూషాలసానాం చ నైవానర్థ ప్రదాయినాం ॥* 4

శ్రీవిద్యారహస్యము ఎవరికి చెప్పాలి? ఎవరికి చెప్పకూడదు ? అంటే ఈ విద్యను తెలుసుకొనటానికి అనధికారులెవరు ? అనే విషయం ఇక్కడ వివరించబడుతోంది.

పరశిష్యులకు, నాస్తికులకు, గురుశుశ్రూష చేయనివారికి, గురువుకు ధనము ఇవ్వలేని వారికి శ్రీవిద్యా రహస్యములు చెప్పకూడదు. పరశిష్యులు అనగా శ్రీవిద్య గాకుండా ఇతర రకాలైనటువంటి (గాణాపత్యము, సౌరము, వైష్ణవము మొదలైనవి) విద్యలలో పూర్ణ దీక్ష కలవారు.

నాస్తికులు -వేదాలను ప్రమాణంగా అంగీకరించనివారు. భగవంతుడు లేడు అనేవారు.

గురుశుశ్రూష చేయనివారు - గురువు నందు భక్తి, గౌరవము, నమ్మకము లేనటువంటివారు. ఆయనకు సేవ చేయనివారు, వీరెవరికీ శ్రీవిద్యను ఉపదేశించకూడదు.

పరమేశ్వరి మీద నమ్మకంగలవారికి, ఆస్తికులకు, గురువును గౌరవించేవారికి మాత్రమే శ్రీవిద్యను ఉపదేశించాలి.

కొంతమంది మిడిమిడి జ్ఞానంతో శ్రీవిద్యా రహస్యాలకు విపరీతార్థాలు చెప్పి, మూలానికి వ్యతిరేకంగా వ్యాఖ్యలు చేస్తుంటారు. వీరు కూడా శ్రీవిద్యకు అనర్హులే.

శ్రీ విద్యకు కొత్త వ్యాఖ్యానాలు చేసి ప్రాచీన వ్యాఖ్యానాలను దూషించేవారు కూడా శ్రీవిద్యకు అనర్హులే.

జన్మతః ఐశ్వర్యవంతులై ఉండి, బాహ్యాశుశ్రూష చేయలేరు. కాని శ్రీవిద్యా రహస్యములు తెలుసుకోవాలనే జిజ్ఞాస ఉండి, ఉపాసన యందు ఆసక్తికలవారు గురువుకు పారితోషికముగా ధనమిచ్చి ఈ విద్యను పొందవచ్చును. ధనము తీసుకుని శ్రీవిద్యను ఉపదేశించవచ్చు అంటే గురువు లోభి అనీ, ధనం మీద వ్యామోహం కలవాడనీ కాదు.

పండితుడు దరిద్రుడుగా ఉంటాడనేది లోక ప్రసిద్ధం. విద్యార్థులు కూడా గురువుతో పాటే దేశాల వెంబడి తిరుగుతూ విద్యాభ్యాసం చేస్తుంటారు. మరి ఇంటి దగ్గర గురువుగారి కుటుంబం బ్రతకాలి కదా. అందుకని గురువుకు శుశ్రూషచేస్తూ దేశాలవెంబడి తిరగలేనివాళ్ళు గురువుకు ధనమిచ్చి శ్రీవిద్యను అభ్యసించవచ్చు. ఇది శాస్త్ర సమ్మతము.

ఇక సాధకులు రెండు రకాలుగా విభజించబడుతున్నారు. 1) ఆస్తికులు 2) నాస్తికులు.

నాస్తికులకు శ్రీవిద్యనుపాసించే అధికారం ఎప్పుడూ లేదు. ఇక ఆస్తికులు వారి వారి అర్హతలను బట్టి శ్రీవిద్యను ఉపాసించగలుగుతారు.

***గురుశుశ్రూష యావిద్యా, పుష్కలేన ధనేనవా।***
***అథవా విద్యయా విద్యా చతుర్థోనోప లభ్యతే॥***

విద్యను నేర్చుకొనటానికి మూడు మార్గాలు చెప్పబడ్డాయి. 1) గురువు శుశ్రూష చేసి 2) తగినంత ధనమిచ్చి 3) తనకు వచ్చిన విద్యను గురువుకు చెప్పి అతని నుండి విద్యను స్వీకరించటము. అంతేకాని నాల్గవ పద్ధతి లేదు. అయితే శ్రీవిద్యోపాసనలో మొదటి రెండు పద్ధతులే ఆచరణీయములు. మూడవ పద్ధతి నిషిద్ధము. కాబట్టి శ్రీవిద్య నేర్చుకోదలచినవాడు శుశ్రూష చేసిగాని, గురువుకు తగినంత ధనమిచ్చిగాని నేర్చుకోవాలి. ఇంక ఏ విధంగానూ శ్రీవిద్యను నేర్వరాదు.

## శ్రీవిద్యాపరుల అర్హతలు

> **పరీక్షితాయ దాతవ్యం వత్సరార్ధోషితాయ చ ।**
> **ఏతజ్ఞాత్వా వరారోహే సద్యః ఖేచరతాం వ్రజేత్ ॥ 5**

శ్రీవిద్యను గురువు నుండి స్వీకరించే ముందు ఒక సంవత్సర కాలం దాకా గురు, శిష్యులు ఇద్దరూ ఒకరినొకరు పరీక్షించుకోవాలి. పరీక్ష ఇద్దరికీ సమానమే. శిష్యుని యోగ్యతను గురువు పరిశీలించినట్లే, గురువు సామర్థ్యాన్ని శిష్యుడు పరీక్షించవచ్చు. గురువు దగ్గర శిష్యుడు ఖేచరత్వం పొందటానికి ప్రయత్నించాలి. ఖేచరత్వం అంటే ఆకాశగమనము. ఆకాశము అంటే ఇక్కడ దహరాకాశము. అదే హృదయాకాశము. హృదయాకాశము నందు తిరగటమంటే బ్రహ్మైక్య భావన. దీని వలన జీవన్ముక్తి లభిస్తుంది. పరదేవత యొక్క రహస్యము తెలిసికొన్నట్లైతే ఖేచరత్వము త్వరగా సిద్ధిస్తుంది.

శ్రీవిద్యను చెప్పమని వచ్చిన శిష్యుని మొదటగా అతని గుణగణాలు, గతంలో ఎక్కడైనా ఉపదేశం పొందాడా ? మొదలైన విషయాలు ఒక సంవత్సరంపాటు పరీక్ష చేసి, తరువాత సంప్రదాయంలో ప్రవేశపెట్టాలి. ఆ తరువాత షడామ్నాయాలు, వాటిలోని పూర్ణదీక్షలూ ఉపదేశించాలి. తరువాత పరదేవతా స్వరూపాన్ని తెలియచెయ్యాలి. ఇదంతా కర్ణాత్కర్ణోపదేశం ద్వారానే జరగాలి.

శాస్త్రము చెప్పటానికి ముందు 1) విషయము 2) ప్రయోజనము 3) సంబంధము చెప్పాలి. ఇక్కడ సంకేతత్రయ జ్ఞానమే విషయము. సంకేతత్రయము అంటే 1) చక్ర సంకేతము 2) మంత్ర సంకేతము 3) పూజా సంకేతము. శాస్త్రము తెలుసుకోవటం వలన ప్రయోజనము ఖేచరత్వము. ప్రతిపాద్య, ప్రతిపాదక భావమే సంబంధము.

ఇంతవరకు యోగిని అంటే ఎవరు ? యోగినీ హృదయం ఏమిటి ? శ్రీవిద్యను తెలుసుకొనటానికి అర్హులెవరు ? విద్య ఏ రకంగా నేర్చుకోవాలి ? గురుశిష్యులు ఏ విధంగా ఉండాలి ? మొదలైన విషయాలను చెప్పి ఇక శాస్త్రమును వివరిస్తున్నారు.

**సంకేతత్రయము**

> **చక్రసంకేతకో మంత్రపూజాసంకేతకౌ తథా ।**
> **త్రివిధ స్త్రిపురా దేవ్యాః సంకేతః పరమేశ్వరి ॥ 6**

*యావదేత న్నజానాతి సంకేతత్రయ ముత్తమమ్ ।*
*న తావ త్త్రిపురాచక్రే పరమాజ్ఞా ధరో భవేత్ ॥* 7

సంకేతము అంటే గుర్తు. ఇక్కడ శివశక్తులకు సంకేతము మూడు విధాలుగా చెప్పబడుతోంది. 1) శ్రీచక్రము నందు 2) మంత్రము నందు 3) అర్చనా విశేషము లందు. ఈ సంకేతములు అంత తేలికగా తెలియవు. శివశక్తుల విహారభూమి మూడు రకాలుగా ఉన్నది.

1) బిందువు నుండి భూపురం వరకు గల శ్రీచక్రంలో సర్వానందమయమైన బిందు చక్రము.

2) పంచదశీ మహామంత్రము (కాది విద్య)లోని మూడవ బీజమైన కామకళా బీజము ఈ కారము

3) స సాధనార్చన (మకార పంచకముతో కూడినది)తో చివరి సాధన (మైధునము)

ఈ మూడు సంకేతములు తెలియటంచేత మనోవాక్కాయకర్మ రూపమైనటువంటి త్రికరణైక్యము సంభవిస్తుంది. మనసులో చక్రాన్ని భావన చేస్తూ, వాక్కుతో మంత్రోచ్చారణ చేస్తూ, కాయముతో అర్చన చేసినట్లైతే త్రికరణైక్యము అవుతుంది. ఈ విధంగా చేసినవాడు ఖేచరత్వము పొందుతాడు. ఈ విషయం తెలిసినంత మాత్రం చేతనే జీవన్ముక్తి కలుగుతుంది.

పరమేశ్వరి సంవిద్రూపిణి. అనగా తనకంటే వేరు కానట్టి జ్ఞాన రూపము. సంవిద్రూపిణి అయిన ఆ పరదేవత శ్రీచక్ర రూపం ధరించింది. పరమేశ్వరి నిగ్రహానుగ్రహముల సామర్థ్యము గలది. సర్వలోకాలయందు ఎదురులేనిది. అదే పరమేశ్వరుని స్వరూపం. పరమేశ్వరుడు పరమాజ్ఞాధరుడు. ఎవరైతే సంకేతత్రయమును తెలుసుకోడో వాడు ఖేచరత్వము పొందలేడు.

ఈ విధంగా సంకేతత్రయమును చెప్పి ఇక చక్ర సంకేతమును వివరిస్తున్నాను.

## శ్రీచక్రావతరణ

*తచ్ఛక్తి పంచకం సృష్ట్యాలయేనాగ్ని చతుష్టయమ్ ।*
*పంచశక్తి చతుర్వహ్ని సంయోగాచ్చక్ర సంభవః ॥* 8
*ఏతచ్చక్రావతారస్తు కథయామి తవానఘే ।*

పాపరహితమైన ఓ దేవీ ! శ్రీచక్రము అవతరించిన విధానము వివరిస్తున్నాను. శ్రీచక్రంలో మొత్తం తొమ్మిది కోణాలు ఉన్నాయి. అందులో అభిముఖంగా ఉండే ఐదు కోణాలు సృష్టిరూపమైనటువంటి శక్తి కోణాలు. అలాగే వెనుక వైపుకు ఉన్న నాలుగు కోణాలు సంహార రూపమైన శివ కోణాలు. శివ, శక్తి కోణముల సంయోగము వలననే అష్టదళము, షోడశదళము, భూపురములతో కూడిన శ్రీచక్రము ఏర్పడినది.

**యదాసా పరమాశక్తిః స్వేచ్ఛయా విశ్వరూపిణీ** **9**

**స్ఫురత్తా మాత్మనః పశ్యేత్తథా చక్రస్య సంభవః ।**

విశ్వరూపిణి అయిన ఆ పరాశక్తి శ్వేచ్ఛగా తనను తాను చూసినప్పుడు శ్రీచక్రము ఉద్భవించింది.

ప్రళయం సంభవించినప్పుడు జగత్తులోని జీవరాసి అంతా నాశనమయిపోతుంది. ఈ జీవులలో అన్నీ ముక్తిని పొందవు. కొన్నిటికి ప్రారబ్ద కర్మ ఇంకా ఉంటుంది. అటువంటి జీవులు తమ ప్రారబ్ద విశేషములతో కలిసి మాయలో కలిసిపోతాయి. ఆ మాయ చిచ్ఛక్తిగా మారి బ్రహ్మానందమనుభవిస్తూ మిగిలిన జీవులతో కలిసి పరబ్రహ్మయందు సామరస్యము పొందుతుంది. అటువంటి పరిస్థితిలో పరబ్రహ్మ పూర్ణబిందు రూపుడై ఉంటాడు. అట్టి పరబ్రహ్మకు మళ్ళీ సృష్టి చెయ్యాలనే కోరిక కలిగింది.

పరబ్రహ్మ స్వయం ప్రకాశము గలవాడు. జ్ఞాన స్వరూపుడు. ఇచ్ఛారహితుడు. అతడు తనయందు కలిసిపోయి అవిభక్తముగా అంటే విడదీయటానికి వీలు లేకుండా ఉన్నటువంటి విమర్శశక్తి అంశతో, అంటే మాయతోనూ, ప్రళయకాలంలో తనలో కలిసిపోయిన, ఇంకా ప్రారబ్దము తీరనటువంటి జీవుల కోరికల వల్ల, మళ్ళీ సృష్టి చెయ్యాలనే కోరిక గలవాడవుతున్నాడు. అప్పుడు తననుండి విమర్శాంశను బయటకు పంపాడు. ఆ తరువాత 'స్ఫురణ' తో సృష్టి జరుగుతోంది. శివాది పృథ్వి పర్యంతము గల ముప్పై ఆరు తత్త్వముల మయమైనది, తనయందు ఇంత వరకు అవిభక్తముగా ఉన్నటువంటిది అయిన విమర్శాంశ మయమైన క్రియాశక్తిని పరబ్రహ్మ ఒకసారి వీక్షించటమే స్ఫురణ అనబడుతుంది. అంటే మాయ జ్ఞానశక్తితో కలిసినట్లైతే సృష్టి జరుగుతుంది. ఈ కాలములోనే ముప్పైఆరు తత్త్వాలతో కూడిన జగత్తు, దానితో పాటుగా శ్రీచక్రము ఉద్భవించాయి. జగత్తుకూ శ్రీచక్రానికీ ఒకే రూపము. ఇక్కడ ప్రకాశాంశ సృష్టి కార్యంలో పాలుపంచుకోదు. కేవలం చూస్తూ ఉంటుంది. లోకాలను ప్రకాశవంతం చేస్తూ ఉంటుంది.

*న తస్యకార్యంకరణశ్చ విద్యతే*

*న తత్సమశ్చాభ్యధికశ్చ దృశ్యతే ।*

*పరాఽస్యశక్తి ర్వివిధైవ శ్రూయతే*

*స్వాభావికీ జ్ఞానబల క్రియాచ ॥*

పరబ్రహ్మకు చెయ్యవలసిన పనీ లేదు. చెయ్యటమనేదీ లేదు. ఆయనకు సమానమైన వారు గానీ అధికులుగానీ లేరు. పరాశక్తియే 'ప్రసిద్ధా' 'విశ్వరూపిణీ' అని వివిధ పేర్లతో పిలువబడుతూ తన సహజ స్వభావమైన ఇచ్ఛా జ్ఞాన క్రియాశక్తులతో జగత్తును సృష్టిస్తున్నది.

## శూన్యాకారము

*శూన్యాకారాద్విసర్గాంత్తా ద్బిందోః ప్రస్పన్ద సంవిదః* **10**

*ప్రకాశ పరమార్థత్వాత్ స్ఫురత్తా లహరీ యుతాత్ ।*

*ప్రసృతం విశ్వలహరీ స్థానం మాతృ త్రయాత్మకమ్ ॥* **11**

*బైందవం చక్రమేతస్య త్రిరూపత్వం పునర్భవేత్ ।*

*ధర్మా ధర్మౌ తథాత్మానో మాతృమేయో తథాప్రమా ॥* **12**

శివాదిక్షితి పర్యంతము ముప్పై ఆరు తత్త్వాలున్నాయి. వాటిలో మొదటిది శివతత్త్వము. శూన్యాకారము. ఈ తత్త్వాలను సూచించే అకారాది క్షకారాంత వర్ణములలో మొదటిది అకారము. పరమశివ సంకేతము కాబట్టి అకారము కూడా శూన్యాకారమే. అకారము నుంచే మిగిలిన అచ్చులన్నీ ఉద్భవించినాయి. విసర్గ అనేది విమర్శరూపము. శూన్యాకారమైన అకారము విసర్గతో కలియటంచేత, విసర్గ రూపమైన అః కూడా శూన్యరూపమైనది. ఇది తురీయ బిందువు రూపముగా మారుతుంది.

మొదటి బిందువునే కామ బిందువు అంటారు. ఈ బిందువుకు తీవ్ర స్పందన కలిగినప్పుడు విసర్గ రూపము అంటే బిందు ద్వయము ఏర్పడుతుంది. అందువలన సంవిత్ ఏర్పడుతుంది. ఆ సంవిత్‌నే 'కళైకదేశా' 'శుద్ధవిద్యా' 'రూపారేఖా' అని కూడా అంటారు. దీనినే నూగారు అంటారు. అనగా బొడ్డు నుండి క్రిందకు సన్నని వెంట్రుకలతో సూచించబడే రేఖ.

· జగత్కారణ భూతమైన ఏకపాద్విభూతి రూపాన్నే 'కామకళ' అంటారు. సృష్టిమొత్తంలో ఇది 1/4 వంతు. ఇదే ఈశ్వర తత్వము.

శివశక్తి సామరస్యాత్మకము, నిరస్తాశేష విశేషము. అంటే నామరూపములు లేనటువంటిది. దీనినే అశబ్దము, నిర్గుణ బ్రహ్మము అంటారు. అటువంటి స్థితిలో కూడా చిద్రూపిణి అయిన శక్తి శివునికన్న వేరు కానట్టిదై ఉన్నది. వాక్యమందు అర్థమున్నట్టు, చంద్రుని యందు వెన్నెల ఉన్నట్లుగా, శివుని యందు శక్తి ఉన్నది. శక్తి సంపర్కము లేకుండా శివుడు ఉండడు. రమ్యత్వము అంటే సామరస్యము. ఆ సామరస్యము లేనప్పుడు శివుని యందు శూన్యత్వము లేక జడత్వము సంభవిస్తుంది. అందుచేతనే ఆ పరమేశ్వరుని సౌందర్యము శక్తియే అని చెప్పబడినది.

శివతత్వాన్ని రెండు రకాలుగా చెప్పవచ్చు. 1) శబ్దాత్మకము 2) అర్థాత్మకము. శబ్దాంశముచేత అకార, హకారములు ఆయన రూపము. అర్థాంశము చేత ప్రకాశ విమర్శాంశలు ఆయన రూపము. ఈ రూపములు అవ్యక్తములు. కంటికి కనిపించనివి. అందుచేతనే ఉపనిషత్తులు దీనిని నిర్గుణము అని చెప్పాయి. పరమేశ్వరుడు ప్రకాశాంశ, శుక్ల బిందువు. పరమేశ్వరి విమర్శాంశ, రక్త బిందువు, ఈ రెండు బిందువులూ కలిసి రజోగుణ ప్రధానమైన మిశ్రమ బిందువు ఉద్భవిస్తోంది. అది సూర్యబిందువు. కామబిందువు. ఆకాశంలోని సూర్యుడు ప్రకాశాంశ శుక్ల బిందువు. అతడికి ఎదురుగా ఉంచిన అద్దంలో కనిపించే బిందువు రక్త బిందువు. విమర్శాంశ అద్దంలో కనిపించిన ఈ బిందువు ప్రక్కనే ఉన్న గోడమీద పడుతుంది. అది రజోగుణ ప్రధానమైన మిశ్రమ బిందువు. ఇదే కామబిందువు. ఈ బిందువే జగత్తునకు బీజం అవుతున్నది. నేలలో పాతిపెట్టిన విత్తనము మొలకెత్తేటప్పుడు ఏ విధంగా రెండు దళాలుగా అవుతుందో, అదే విధంగా మిశ్రమబిందువు అర్ధ చంద్ర భాగాలుగా రెండుగా అవుతుంది. ఈ రెండు భాగాలే విసర్గ అనబడతాయి. ఈ రెండు దళాల మధ్యనుంచి అంకురము రూపంలో కాండము ఏ రకంగా వస్తుందో ఆ రకంగా రెండు బిందువులు (విసర్గ) మధ్యనుంచి హార్ధకళ పుడుతున్నది. హార్ధకళ అంటే హకారములో ఉన్న అకారమును తీసివేయగా మిగిలేది హ - అ = హ్. అదియే హార్ధ. ఇది త్రికోణాన్ని సూచిస్తుంది.

హార్ధకళ ప్రదేశంలో కాండములాగా రేఖా రూపంగా ఉన్నది సంకోచ. ఇప్పుడు బిందువు ప్రథమ స్పందరూపము. శక్తితో కూడని శివుడు ఏ పనీ చెయ్యలేడు. విసర్గ ద్వితీయ

స్పందము. ఇది ప్రస్పందము. తీవ్రముగా స్పందించునదని చెప్పబడుచున్నది. దాని మధ్య రేఖ సూటిగా వంకర లేకుండా ఉండటంచేత శుద్ధ విద్య అని పిలువబడుతోంది. అందుకనే కామబిందువులోని

| | | |
|---|---|---|
| ప్రకాశ బిందువు | - | శివతత్త్వం |
| విమర్శ బిందువు | - | శక్తితత్త్వం |

అలాగే విసర్గలోని

| | | |
|---|---|---|
| ప్రకాశ బిందువు | - | సదాశివతత్త్వం |
| విమర్శ బిందువు | - | ఈశ్వర తత్త్వం |
| వాటి మధ్య రేఖ | - | శుద్ధ విద్యాతత్త్వం |

ఈ విధంగా తత్త్వ పంచకము, కామకళాత్మకము అయిన జగత్తుకు కారణమైన తత్త్వము, సృష్టి సంకల్పానికి పూర్వము అంటే సృష్టి చెయ్యాలనే తలంపు పరబ్రహ్మకు రాకముందు ఉన్నది.

బిందువు యొక్క ప్రస్పందయే సంవిత్. ఇదే కామకళా తత్త్వము. దేహళీదీప న్యాయముగా అంటే గడపమీద ఉంచిన దీపము గడపకు రెండు వైపులా కాంతినిచ్చినట్లుగా, ప్రస్పందము బిందువుకూ, విసర్గకూ కూడా అన్వయిస్తుంది. ప్రకాశమే పరమార్థ స్వరూపము. తురీయ బిందువు నుండి పరమార్థ స్వరూపము పుట్టినందువల్ల ప్రకాశమే దాని స్వభావము. విసర్గ విమర్శతత్త్వాత్మకము. ఆ విసర్గ నుంచి వెలువడిందే శుద్ధవిద్యా తత్త్వము. అటువంటి శుద్ధవిద్యా తత్త్వము కూడి ఉండటంచేత, కామకళాతత్త్వమవటం చేత బిందువు నుంచి త్రికోణము పుట్టినది. ఇది మాయా తత్త్వాత్మకము. శుద్ధవిద్యతో నిత్యము సంబంధము ఉంది. మాయా సంబంధము గల శుద్ధ విద్యయే హార్ధకళా స్వరూపము.

త్రికోణము విశ్వలహరీ అని చెప్పబడుతోంది. అంటే విశ్వమను అలల స్థానము. మాయా తత్త్వమనే సముద్రంలో ప్రపంచమనే తరంగాలుపుడుతూ, పోతూ ఉంటాయి. అలాగే త్రికోణము మాతృకాత్రయాత్మకమైనది. సత్త్వ రజ స్తమో గుణాత్మకమైనది. ఇచ్ఛా జ్ఞాన క్రియా శక్తి స్వరూపమైనది. వామ జ్యేష్ఠా రౌద్రీశక్తి స్వరూపమైనది. పశ్యన్తీ, మధ్యమా, వైఖరీ స్వరూపమైనది.

త్రికోణానికి మూడు వైపులా ప్రకాశ, విమర్శ, మిశ్రమ బిందువులున్నాయి. మధ్యన సంవిద్బిందువున్నది. దీనికి మూడు వైపులా ఉన్న రేఖలు అవ్యక్త స్వరూపము, తేజోమయము అయిన మాతృకలు. ఈ కోణ బిందువులు.

1. మండలత్రయము - చంద్ర సూర్యాగ్ని మండలాలు
2. గుణత్రయము - సత్వ రజ స్తమో గుణాలు
3. బీజత్రయము - వాగ్భవ కామరాజ శక్తి బీజాలు
4. శక్తి త్రయము - ఇచ్ఛా జ్ఞాన క్రియా శక్తులు
5. మూర్తిత్రయము - బ్రహ్మ విష్ణు మహేశ్వరులు
6. త్రిపుటి - జ్ఞాతృ జ్ఞాన జ్ఞేయాలు.

త్రికోణమునందు జీవుల ప్రారబ్ధము, సర్వజగత్తు వాసనాత్మకముగా ఉన్నదని చెప్పటానికి ఈ త్రికోణము యొక్క నవత్రికోణాత్మకము చెప్పబడుతున్నది. త్రికోణము యొక్క ఒక్కొక్క కోణము తిరిగి మూడు రూపములు పొందుతున్నది. ఇది నవత్రికోణ రూపము. మధ్యలో ఒక త్రికోణము. దాని చుట్టూ ఎనిమిది కోణాలు. (అష్టకోణ చక్రము) ఇదే నవయోన్యాత్మకమైన సంహార చక్రము.

ధర్మా ధర్మాలు అంటే పుణ్యాపాపాలు. ఆత్మలు నాలుగు రకాలు. 1) ఆత్మా 2) అంతరాత్మాస్వః పరమాత్మా 4) జ్ఞానాత్మా. మాతృమానమేయములు మూడు. మొత్తం తొమ్మిది. చిత్ ావము గల వారగుటచేతనూ, సృష్టి క్రమములోని వారవటంచేతనూ, ధర్మ శబ్దంచేత శివ, శక్తి, సదాశివ, ఈశ్వర, శుద్ధ విద్యాత్మకమైన తత్వ పంచకము సూచించబడుతోంది.

ఈ రకంగా ముప్పై ఆరు తత్వాలున్నాయి. అవి.

| | | |
|---|---|---|
| 1. | ఆత్మ చతుష్టయము<br>(ఆత్మా, అంతరాత్మా, పరమాత్మా, జ్ఞానాత్మా) | 4 |
| 2. | త్రిపుటి (మాతృ, మాన, మేయములు) | 3 |
| 3. | తత్వ పంచకము<br>(శివ, శక్తి, సదాశివ, ఈశ్వర, శుద్ధ విద్య) | 5 |

| | | |
|---|---|---|
| 4. | మనస్సు, విద్ధి,చిత్తము, అహంకారము | 4 |
| 5. | కలా, ఆ కలు రాగము, కాలము, నియతి | 5 |
| 6. | తన్మాత్ర (శబ్ద స్పర్శ రూప రస గంధాలు) | 5 |
| 7. | జ్ఞానేంద్రియాలు | 5 |
| 8. | కర్మేంద్రి యాలు | 5 |
| | మొత్తం త్వాలు | 36 |

అయితే కాశ్మీరు దేశీయుల ప్రకారము

| | | | |
|---|---|---|---|
| 1. | పంచభూ ాలు | - | 5 |
| 2. | తన్మాత్రత్రయ | - | 5 |
| 3. | జ్ఞానేంద్రి యాలు | - | 5 |
| 4. | కర్మేంద్రి ద్రాలు | - | 5 |
| 5. | త్వగాది శ్చ్యవులు | - | 7 |
| 6. | ప్రాగ్, ప సు, దక్షిణ, ఉత్తర వాయువులు | - | 4 |
| 7. | మనస్సు శు | - | 1 |
| 8. | మాయ, ద్ధ విద్య, మహేశ్వరుడు, సదాశివుడు | - | 4 |
| | మొత్తం తత్త్వాలు | - | 36 |

ఈ ము వాది ఆరు తత్వాలతోనే ఈ జగత్తు సృష్టించబడింది. సృష్ట

కాని శి క్షితి పర్యంతము తత్వాలు ముప్పది ఆరు అ ుడు సంప్రదాయ ప్రకరణము ప్రకారము తత్వాలు ఈ విధంగా చెప్పబడ్డాయి.

త త్త్వాని శివశ్శక్తి శ్చ సదాశివ మహేశ్వరౌ ।

వి ద్యాఖ్య పంచశుద్ధాని శుద్ధా శుద్ధాని సప్త చ ॥

మ రుః కళా విద్యారాగః కాలోని యతిరేవ చ ।

ష ట్సప్తైవ ధా శుద్ధాని ప్రకృతి ర్బుద్ధ్యహంకృతీ ॥

మ శ్రోత్రేంద్రియ దశకం తన్మాత్రా భూత పంచకమ్ ॥

| | | |
|---|---|---|
| శివుడు, శక్తి | - | 2 |
| సదాశివుడు, మహేశ్వరుడు | - | 2 |
| శుద్ధ విద్య, మాయ | - | 2 |
| కళా, విద్య, రాగము, కాలము, నియతి | - | 5 |
| పురుషుడు, ప్రకృతి | - | 2 |
| బుద్ధి, అహంకారము | - | 2 |
| మనస్సు | - | 1 |
| ఇంద్రియాలు | - | 10 |
| తన్మాత్రలు | - | 5 |
| పంచభూతాలు | - | 5 |
| మొత్తం తత్వాలు | - | 36 |

## నవయోని చక్రము

*నవయోన్యాత్మకం చక్రం చిదానంద ఘనం మహత్ ।*
*చక్రం నవాత్మక మిదం నవధా భిన్న మంత్రకమ్ ॥* **13**

త్రికోణము నవయోన్యాత్మకము. ఇది చిదానందములచేత దట్టమైనది. జీవ ఈశ్వరాదులచే కూడిన చిత్ యొక్క ప్రకాశముతో నిండినదవటం చేత చిద్ఘనమైనది. అకథాదిరేఖలు కలది. అంటే అక్షములను ఒక్కొక్క భాగానికీ పదహారు చొప్పున మూడు భాగాలుగా విభజించారు.

1. అ నుండి - అః వరకు పదహారు (స్వరాలు)
2. క నుండి - త వరకు పదహారు (స్పర్శలు)
3. థ నుండి - స వరకు పదహారు (వ్యాపకాలు)

ఈ అక్షరాలన్నీ త్రికోణంలోని మూడు రేఖల యందు ఉంటాయి. ఈ రకంగా ఏర్పడ్డ త్రికోణము తిరిగి మూడు రూపాలు పొందుతున్నది. నవధా భిన్న మంత్రకం. అంటే నవనాథ రూపమైన, నవవర్గులచేత వేరు వేరు రకములు గలదైన మాతృకా అను పేరు కలది. నవవర్గులు అంటే అక్షరములన్నీ తొమ్మిది వర్గులు చేయబడ్డాయి. అవి. అ, క, చ, ట, త, ప, య, శ, క్ష.

కొందరి వాదన ప్రకారము వశిన్యాది దేవతలు ఎనిమిది కోణముల యందూ ఉండగా, పంచదశీ మహామంత్రంలోని మూడు కూటములూ మూడు కోణాల యందు గల త్రికోణము ఆ ఎనిమిది కోణముల మధ్యన ఉంటుంది. అందుచేత మొత్తం తొమ్మిది కోణాలవుతున్నాయి.

కొందరి మతము ప్రకారము శ్రీచక్రంలో తొమ్మిది చక్రాలున్నాయి. అవి 1) త్రైలోక్య మోహన చక్రము నుంచి 9. సర్వానందమయ చక్రం వరకు. ఇవే నవయోనులు అని చెప్పబడింది.

## అష్టకోణము

*బైందవాసన సంరూఢ సంవర్తానల చిత్కలం ।*
*అంబికారూప మేవేద మష్టారస్థం స్వరావృతం ॥* **14**

త్రికోణము మధ్యన ఉండే బిందువు సంవిద్బిందువు. ఈ బిందువు సంవర్తానలము అని చెప్పబడుతోంది. అంటే ప్రళయాగ్నిని ఆసనముగా చేసుకున్నది. ఈ బిందువులో ప్రళయాగ్ని ఉన్నది. ప్రళయ కాలంలో ప్రకాశ విమర్శలు రెండూ కలిసి తురీయ బిందువుగా ఏర్పడినాయి. అందుచేత ప్రళయాగ్ని అనేది తురీయ బిందువులోని ప్రకాశాంశయే. ఆతురీయ బిందువులోని విమర్శాంశయే చిత్కళ. ఈ త్రికోణము అష్టకోణములో అంతర్గతమై ఉన్నది. అక్షరాలలో అచ్చులు పదహారు. వాటిలో పదహారవదయిన అః త్రికోణము మధ్యన ఉంటుంది. మిగిలిన పదిహేను. మూడు రేఖల మీద ఐదు చొప్పున ఉంటాయి.. ఈ రకంగా త్రికోణము స్వరములచేత చుట్టబడి ఉన్నది. కాగా అష్టకోణము అష్టవర్గులచేత (అ క చ ట త ప య శ) చుట్టబడి ఉంటుంది. వాక్స్వరూపములు నాలుగు. అవి పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరీ. అష్టకోణము మధ్యమా వాక్స్వరూపము గలది. అందుచేత మాతృకలు (అక్షరములు) అన్నీ అంటే అ నుంచి క్ష వరకూ అష్ట కోణమందున్నాయి. శాంతా, అంబికా రూపముల సామరస్య రూపము బిందు చక్రమందు పుడుతున్నది. కాబట్టి త్రికోణము అంబికా రూపమే.

శాంతా - వామ, జ్యేష్ఠా, రౌద్రీల రూపము.

అంబికా - ఇచ్ఛా జ్ఞాన క్రియా రూపము.

ఇది త్రికోణ వసుకోణాత్మకమైన సంహార చక్రము.

## అంతర్దశారము

నవత్రికోణస్ఫురిత ప్రభారూప దశారకమ్
శక్త్యాదినవ పర్యంత దశార్ణ స్ఫూర్తి కారకమ్ ॥ 15

మాతృకా వివేకము ననుసరించి అ నుండి క్ష వరకూ ఉండే అక్షరాలలో స్వరములు సుషుప్త్యాత్మకములు. క నుంచి మ వరకు గలవి జాగ్రదాత్మకములు. స్వరాలలో చివరి రెండు అక్షరాలూ అం, అః. వీటిలో అం అబేధ ప్రమాతృ స్వరూపము. అః బేధ ప్రమాతృ స్వరూపము.

వ్యాపక ఖండంలో మకారము బేధ ప్రమాతా. చివరలో ఉన్న శకార క్షకారములు శివ ప్రమాతలు. భేద ప్రమాత అయినటువంటి 'మ' కారము అదృశ్యంగా ఉంటుంది. అందుకనే ఆవరణలలో మకారము లోపించింది. ఇది ఒక సంప్రదాయము. దీని ప్రకారము పంచమ, షష్టావరణలలో మకారము కనిపించదు.

స్పర్శ ఖండములోని పవర్గులో మొదటి నాలుగు అక్షరాలలోనూ (ప ఫ బ భ) మొదటి రెండూ ప ఫ లు భేద ప్రమాతృ స్వరూపాలు. మిగిలిన బ భలు అభేద మాతృ స్వరూపములు.

అష్టకోణం మధ్యన ఉన్న త్రికోణము స్వరములచేత ఆవరించబడి ఉంటుంది. కాబట్టి సుషుప్తి స్వరూపము. కామబిందువు విసర్గాత్మకము. అందుచేత బిందు చక్రము ప్రమాతృ స్వరూపము. అష్టకోణము మధ్యమా వాగ్రూపము కాబట్టి త్రికోణంలోని జగద్వాసనను స్ఫురింప చేస్తోంది. అష్టకోణంలో మాతృకల స్వరూపం త్రికోణంలోకి మల్లే అస్పష్టం కాదు. అలాగని స్పష్టమూ కాదు. ఇవి మధ్యమంగా ఉంటాయి. బిందువు, త్రికోణము, అష్టకోణము గల ఈ చక్రం సంహార చక్రము అని చెప్పబడుతోంది. ఇక్కడ జీవ సంసారములు వాసనాత్మకముగా (సూక్ష్మంగా) ఉంటాయి. పరశివుడు చేయవలసినది సృష్టి. ఆ సృష్టికి కారణమైన జీవ సంసారములు ఈ చక్రంలో సూక్ష్మ రూపంగా ఉంటాయి కాబట్టి ఇది సంహార చక్రము అయింది. సంహారము నుంచే సృష్టి వస్తుంది. కాబట్టి సంసారము యొక్క స్థితి స్వప్న జాగరములు. స్వప్న మందు సంసారము సూక్ష్మ రూపంగానూ, జాగరమందు స్థూలంగానూ ఉంటుంది.

బిందు చక్రం నుంచి నవకోణం వస్తున్నది. బిందువు యొక్క కాంతులు, చిత్, అచిత్, రూపాలు కలా, అవిద్యా, రాగము, కాలము, నియతి. వీటి రూపమే దశార చక్రము. ఇక్కడ

మకారము అదృశ్యమని ముందే చెప్పబడింది. కాబట్టి య ర ల వ శ ష స హ ళ క్ష వర్ణాలు ఈ దశార మందుంటాయి. ఈ రకంగా అంతర్దశారము నవయోనిచక్రము నుండి ఉత్పన్నమైనది. కాని ఇంకొక సంప్రదాయము ప్రకారము మ య ర ల వ శ ష స హ క్ష వర్ణాలు ఈ దశారమందుంటాయి. ఇక్కడ ళ కార క్ష కారాలు రెండూ మిశ్రమాక్షరాలే. కాబట్టి రెండింటి బదులుగా ఒక్క క్ష కారము వాడితే సరిపోతుంది. ల ళ యో ర బేధః అనే సూత్రాన్ననుసరించి ల కార ళ కారములు ఒక్కటే. కాబట్టి ప్రత్యేకంగా ళ కారాన్ని తీసుకోవలసిన పని లేదు. వీటిని గురించి వివరిస్తూ బాస్కరరాయలవారు తమ శేతు బంధము వ్యాఖ్యలో మ కారము నుండి హ కారము వరకు తొమ్మిది, క్ష కారము ఉంటాయని వ్రాశారు.

అమృతానందనాధుల వారు తమ దీపిక అనే వ్యాఖ్యలో య కారము నుండి తొమ్మిది, క్ష కారము మొత్తం పది అని వ్రాశారు. ఇది కేవలం సంప్రదాయ బేధము.

ఈ విధంగా సూక్ష్మ సంసారాత్మకరూపమైన అంతర్దశారము వర్ణించబడింది.

## బహిర్దశారము

***భూత తన్మాత్ర దశక ప్రకాశ లంబనత్వతః ।***
***ద్విదశార స్ఫురద్రూపం క్రోధీశాది దశారకమ్ ॥*** **16**

పంచభూతాలు, తన్మాత్రలు, జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాల యొక్క ప్రకాశము స్పష్టమైనది. ఈ పంచభూతాల, తన్మాత్రల అప్రకటిత రూపము బహిర్దశారము, బిందు, త్రికోణ, వసుకోణాత్మకమైన సంహార చక్రము నుండి వెలువడ్డ తేజస్సు అప్రకటితముగా అంతర్దశారము నందు, ప్రకటితముగా బహిర్దశారమందు ఉంటాయి.

ఈ రెండు దశారములూ నవత్రికోణము నుండే ఏర్పడినాయి. కామకలా విలాసములోని 29, 30 శ్లోకములలో కూడా ఇదే విషయం చెప్పబడింది.

***శ ష స ప వర్ణమయం తద్వ సుకోణం మధ్య కోణ విస్తారః ।***
***నవకోణం మధ్యం చేత్యస్మిన్ చిద్దీప దీపితే దశకే ॥***

***తచ్ఛాయాద్వితయ మిదం దశారచక్ర ద్వయాత్మనా వితతం ।***
***త ట చ క వర్గ చతుష్టయ విలసన విస్పష్ట కోణ విస్తారమ్ ॥***

# చతుర్దశారము

చతుశ్చక్ర ప్రభారూప సంయుక్త పరిణామతః ।
చతుర్దశార రూపేణ సంవిత్తి కరణాత్మనా ॥ 17

ఖేచర్యాది జయాన్తార్ణ పరమార్థ ప్రథామయమ్ ।
ఏవంశక్త్యనంకా కార స్ఫురద్రౌద్రీ ప్రభామయమ్ ॥ 18

బిందువు, త్రికోణము, అష్టకోణము, దశార యుగ్మముల యొక్క కాంతి పుంజములతో మన్వస్రము అనబడే చతుర్దశారము ఏర్పడుతోంది. జ్ఞానేంద్రియాలు ఐదు, కర్మేంద్రియాలు ఐదు, అంతఃకరణ చతుష్టయము అంటే మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము నాలుగు. మొత్తం పధ్నాలుగు ఇంద్రియాలతోనూ చతుర్దశారము ఏర్పడుతోంది. అంటే

**త్రికోణము :** చంద్ర స్వరూపము. దీని కళలు పదహారు. మూడు రేఖల యందు ఐదు చొప్పున పదిహేను. పదహారవ కళ మధ్యలో ఉంటుంది. ఆ కళలు .....

1) అమృత, 2) మానదా, 3) పూషా, 4) తుష్టి 5) పుష్టి 6) రతి, 7) ధృతి, 8) శశినీ, 9) చంద్రికా, 10) కాంతి, 11) జ్యోత్స్నా, 12) శ్రీ,, 13) ప్రీతి, 14) అంగదా, 15) పూర్ణా, 16) పూర్ణామృతా.

ఇవి అకారాది అః కార పర్యన్తము ఉంటాయి.

అంతర్దశారము - ఇది అగ్ని తత్త్వాత్మకమైనది. దీని కళలు పది. అవి ....

1) ధూమ్రా, 2) ఊష్మా, 3) జ్వలినీ, 4) జ్వాలినీ, 5) విస్ఫులింగినీ, 6) సుశ్రీ, 7) సురూపా, 8) కపిలా, 9) హవ్యవాహినీ, 10) కవ్యవాహినీ.

ఇవి యకారాది క్షకారాన్తము ఉంటాయి.

**బహిర్దశారము. చతుర్దశారము :** ఇవి సూర్య తత్త్వాత్మకమైనది. దీని కళలు పది. ఇవి రెండేసి వర్ణములతో ఉంటాయి.

1) కం భం తపినీ, 2) ఖం బం తాపినీ, 3) గం ఫం ధూమ్రా, 4) ఘం పం మరీచీ, 5) ఙం నం జ్వాలినీ, 6) చం ధం రుచి, 7) ఛం దం సుషుమ్నా, 8) జం థం భోగదా, 9) ఝం తం విశ్వా, 10) ఞం ణం బోధినీ, 11) టం ఢం ధారిణీ, 12) ఠం డం క్షమా.

త్రికోణము, అష్టకోణము, దశార ద్వయము, చతుర్దశారములు విడివిడిగా వేరువేరు రూపాలు కలిగియున్నాయి.కాని వీటిమధ్యన ప్రకాశవంతమైన త్రికోణముండటం చేత ఒకే చక్రంగా ప్రకాశిస్తున్నాయి. ఈ సమిష్టి చక్రము రౌద్రీ సామరస్యము. త్రికోణము నుంచి అంబికా రూపముద్భవించింది. కాబట్టి త్రికోణానికి అంబికారూపము చెప్పబడింది. త్రికోణము నుంచి చతుర్దశారము వరకూ క్రియా, రౌద్రీ సామరస్యము.

## సృష్టి చక్రము

**జ్యేష్ఠారూప చతుష్కోణం వామారూపభ్రమిత్రయమ్ ।**

ఇప్పటి వరకూ ముప్పైఆరు తత్త్వములతో కూడిన జగత్తు యొక్క క్రమ సృష్టి బిందువు నుండి చతుర్దశారము వరకు సంహార క్రమంలో చెప్పబడింది. ఇప్పుడు పంచతత్త్వములు తొడుగుగా ధరించిన పురుషుని భ్రాంతి ననుసరించి, వ్యతిరేక సృష్టి నిరూపించబడుచున్నది. ఇది సృష్టిక్రమము. పంచతత్త్వములు అంటే కలా, అవిద్య, రాగము, కాలము, నియతి అనేవి.

మూడు రేఖలు గలిగి చతుష్కోణాకారమైన చక్రము భూపురము. ఇది జ్యేష్ఠారూపము. జ్ఞాన శక్తి యొక్క సామరస్య స్వరూపమే జ్యేష్ఠా. అష్టదళానికీ, షోడశ దళానికీ పైన ఒకటి, కింద ఒకటి, మధ్య ఒకటి వృత్తాలున్నాయి. అంటే వృత్త త్రయము ఒకేచోట కాకుండా విడివిడిగానే ఉన్నది అని ఇక్కడ చెప్పబడుతోంది. ఈ వృత్త త్రయము వామారూపము. వామాశక్తి యొక్క సామరస్య స్వరూపమే ఇచ్ఛా.

ఇంతకు పూర్వము బిందువు నుండి ఒక్కొక్క చక్రము బయటకు వచ్చింది అని చెప్పటం జరిగింది. కాని వృత్త భూపురాలను వ్యతిరేక వరుసలో వర్ణించటం జరిగింది. జీవుడు అనే భ్రాంతి ననుసరించి వ్యతిరేక సృష్టి ఇక్కడ చెప్పబడింది. ఈ విధంగా శ్రీచక్రాన్ని భావించినట్లైతే ఉత్తమ మైనటువంటి పరమాసిద్ధి కలుగుతుంది.

## దేహము - శ్రీచక్రము

**విద శాన్త స్త్రి కోణం చ శాన్త్యతి తాష్టకోణకమ్ ॥** 19

**...శ ద్వాదశారం చ తథైవ భువనారకమ్ ।**

**...కలా ప్రమారూప - దళాష్టక సమా వృతమ్ ॥** 20

ప్రతిష్ఠావపుషా సృష్టి స్ఫుర ద్వ్యష్టదలాంబుజమ్ ।।
నివృత్త్యాకార విలసచ్చ తుష్కోణ విరాజితమ్ ॥ 21

చిదంశ అంటే చిత్కళ. సంకల్ప, వికల్పాలకు : కారభూతమైనది, బిందు త్రికోణాత్మకమైనది అయిన చక్రమే 'చిదం శాంతం స్త్రి కోణము'. బ్రహ్మ రంధ్రానికి పై భాగాన (పన్నెండు అంగుళాల ఎత్తున ఉన్న, చిత్కళతో కూడిన బిందు త్రికోణాత్మకమైన పరబ్రహ్మను ధ్యానం చెయ్యాలి.

**'శాంత్యతీత మష్టకోణకం'** : శాంత్యతీత కూడిన, ఆకాశ తత్త్వాత్మకమైన అష్ట కోణము. లలాటం దగ్గర నుండి బ్రహ్మ రంధ్రం దాకా శ ంతతీత కళాయుక్తమైన ఆకాశమండలముతో కూడిన అష్టకోణ చక్రమున్నది.

**'శాంత్యంశ ద్విదశారం చ తథైవ భువనారకమ్'** : కంఠవ ు నెడి లలాటము వరకు గల ప్రదేశంలో శాంతి కళతో కూడిన, వాయు తత్త్వాత్మకమైన అ ంతర్దశము, బహిర్దశారము, చతుర్దశారములున్నాయి.

**విద్యాకళా ప్రభా రూప దళాష్టక సమావృతం** : నాభి దగ్గర ను కంఠము వరకు గల ప్రదేశమందు విద్యా కళతో కూడిన వహ్ని మండలాత్మకమైన అష్ట పద్మమున్నది.

**ప్రతిష్ఠావపుషా స్పష్ట స్ఫుర ద్వ్యష్ట దళాంబుజమ్** : జాను వు ాకాలు) నుండి నాభి వరకు గల ప్రదేశములో ప్రతిష్ఠాకళతో కూడిన జల తత్త్వాత్మకమై ైన షోడశదళ పద్మమున్నది.

**నివృ క్త్యాక విలస చ్చతుష్కోణ విరాజితం** : పాదము : నుండమోకాలు వరకు గల ప్రదేశంలో నివృత్తి కళతో కూడిన, పృథ్వీ తత్త్వాత్మకమైన భూ పురము మున్నది.

ఈ వి ధం శ్రీచక్రము మానవ దేహంలో ఏ ఏ భాగాలకు సమ:యం చేయబడిందో వివరించబడి ంది. ాగా ఇతర గ్రంథాలలో ఈ సమన్వయము వేరు ఉన్నది.

దీని ప్రకారం శ్రీచక్రంలోని వివిధ ఆవరణలకూ, మానవ దే హంలోని వివిధ భాగాలకూ సమన్వయం ఈ విధంగా ఉన్నది.

బైందమ్ బ్రహ్మ రంధ్రం చ మస్తకం చ త్రికోణకమ్ ।
లలే ష్టారపత్రం చ భ్రువోర్మధ్యే దశారకమ్ ।
బహిశ్శారం కంఠే చ మన్వశ్రం హృదయం భవేత్ ।

**నాభౌచ వసుపత్రం చ కట్యాం షోడశ పత్రకమ్ ।**

**వృత్తత్రయం చ ఊరుభ్యాం, పద్భ్యాం భూపురత్రయమ్ ॥**

| | | |
|---|---|---|
| బిందువు | - | బ్రహ్మ రంధ్రము |
| త్రికోణము | - | తల ముందు భాగము |
| అష్ట కోణము | - | లలాటము |
| అంతర్దశారము | - | భ్రూమధ్యము |
| బహిర్దశారము | - | కంఠము |
| చతుర్ద శారము | - | హృదయము |
| అష్ట దళము | - | నాభి |
| షోడశ దళము | - | కట్టి ప్రదేశము |
| వృత్తత్రయము | - | ఊరువులు |
| భూపురము | - | పాదాలు |

అయితే మరికొన్ని తంత్రాల ప్రకారము ఈ సమన్వయము వేరుగా ఉన్నది.

**శ్రీచక్రం బ్రహ్మరంధ్రేతు, సువృత్తం చ త్రికోణకమ్**

**లలాటే ష్టారకం చక్రం, భృవోర్మధ్యే దశారకమ్**

**బహిర్ద శారం కంఠేతు, మన్వస్రం హృదయే భవేత్**

**కుక్షౌతు ప్రథమవృత్తం, నాభ్యా మష్టదళాంబుజమ్**

**కట్యాం ద్వితీయం వలయం, స్వాధిష్ఠానే కలాశ్రకమ్**

**తీస్యాదస్తాత్ తృతీయం, మూలాధారే చతురశ్రకం**

**ద్వితీయం భూపురం జంఘే, తృతీయం వామ జంఘికే**

**త్రిపురేశీ శ్రీమహా యంత్రం సృష్టి న్యాస విధిక్రమాత్ ॥**

| | | |
|---|---|---|
| బిందువు, త్రికోణము | - | బ్రహ్మ రంధ్రము |
| అష్ట కోణము | - | లలాటము |
| అంతర్దశారము | - | భ్రూ మధ్యము |
| బహిర్దశారము | - | కంఠము |
| చతుర్దశారము | - | హృదయము |

ప్రథమ వృత్తము - కుక్షి

అష్ట దళము - నాభి

ద్వితీయ వృత్తము - కటి ప్రదేశము

షోడశ దళము - స్వాధిష్ఠానము

తృతీయ వృత్తము - స్వాధిష్టానానికి క్రింది భాగము

చతురస్రంలోని ప్రథమ రేఖ - మూలా ధారము

చతురస్రంలోని ద్వితీయ రేఖ - కుడి పిక్క

చతురస్రంలోని తృతీయ రేఖ - ఎడమ పిక్క

శంకర భగవత్పాదుల వారు "సౌందర్యలహరి"లో.

**మహీం మూలధారే కమపి మణిపూరే హుతవహం।**

**స్థితం స్వాధిష్ఠానే హృది మరుత మాకాశముపరి।**

**మనోపి భ్రూమధ్యే సకలమపి భిత్వాకుల పథం।**

**సహస్రారే పద్మే సహరహసి పత్యా విహరసే ॥**

మూలాధారమునందు - త్రికోణము

స్వా ధిష్ఠానమునందు - అష్ట కోణము

మణి పూరక మందు - అంతర్దశారము

అనాహత మందు - బహిర్దశారము

విశుద్ధి చక్ర మందు - చతుర్దశారము

ఆజ్ఞా చక్ర మందు - భూపురము చెప్పబడ్డాయి.

గౌడ పాదుల వారు తమ "శుభగోదయస్తుతి"లో.

**త్రికోణం చాధారం త్రిపురతనుతే ష్టారమనఘే ।**

**భవేత్స్వాధిష్టానం, పునరపి దశారమ్ మణిపురమ్ ।**

**దశారంతే సంవిత్కమల, మథ మన్వస్రక్రముమే ।**

**విశుద్ధం, స్యాదాజ్ఞా శివ ఇతితతో బైందవ గృహమ్ ॥**

| | | |
|---|---|---|
| ఆధార చక్రంలో | - | త్రికోణము |
| స్వాధిష్ఠానంలో | - | అష్ట కోణము |
| మణిపూరంలో | - | అంతర్దశారము |
| అనాహతంలో | - | బహిర్దశారము |
| విశుద్ధి చక్రంలో | - | చతుర్దశారము |
| ఆజ్ఞా చక్రంలో | - | అష్ట దళము, షోడశ దళము |
| సహస్రారం దగ్గర | - | భూపు పురము. |

శ్రీచక్రాన్ని మానవ దేహంతో సమన్వయం చేసేటప్పుడు వివిధ గ్రంధాలలో అనేక రకాలుగా చెప్పబడింది. వీటి మీద మరిన్ని వివరాలకు నాచే వ్రాయబడిన **శ్రీచక్రము.** అనే పుస్తకం చూడండి.

**మూలా ధారంలో :** నివృత్తి కళతోకూడిన పృథివీ తత్త్వాత్మకమైన భూపురం ఉన్నది. స్వాధిష్ఠానంలో ప్రతిష్టా కళతో కూడిన షోడశ దళ పద్మం ఉన్నది.

**మణి పూరంలో :** విద్యా కళతో కూడిన అగ్ని తత్త్వాత్మకమైన అష్టదళ పద్మమున్నది.

**అనాహతంలో :** శాంతి కళతో కూడిన వాయు తత్త్వాత్మకమైన దశారయుగ్మము, చతుర్ద శారము ఉన్నాయి.

**విశుద్ధి చక్రంలో:** శాంత్యతీత కళతో కూడిన ఆకాశ తత్త్వాత్మకమైన అష్టకోణమున్నది.

**అజ్ఞా చక్రంలో :** మనస్సుకు ఇంకొక పేరైన అవ్యక్తమనే కళతో కూడిన సకల కళలతో కూడిన బ్రహ్మ రూపమనే త్రికోణ చక్రమున్నది.

**సహస్రారంలో :** చిత్కళతో కూడిన విష్కళ బ్రహ్మరూపమైన (ఏ విధమైన కళలు లేనటువంటి బ్రహ్మ) బిందు వున్నది.

ఈ రకంగా సకళ, నిష్కళ స్వరూపాలు త్రికోణము, బిందువు లందున్నాయి.

## నాద శక్తులు

*త్రైలోక్య మోహనాద్యేతు నవ చక్రే సుహేశ్వరి ।*
*నాదో బిందుః కళాజ్యేష్టా రౌద్రీవామా తథా పునః ॥* 22

విషఘ్నీ.దూతరీచైవ సర్వానందాః క్రమాత్స్థితాః ।
నిరంశౌ నాదబిందూ చ కలాచేచ్ఛా స్వరూపకం ॥ 23

జ్యేష్ఠా జ్ఞానం క్రియా శేషమిత్యేవం త్రితయాత్మకం ।
చక్రం కామ కళారూపం ప్రసార పరమార్థతః ॥ 24

త్రైలోక్య మోహన చక్రమైన భూపురము నుండి బిందువు వ॰ శ్రీ చక్రంలో ఉన్న తొమ్మిది చక్రాలలోనూ తొమ్మిది శక్తులున్నాయి.

ఇక్కడ నాదము అంటే నవనాద శక్తులు అని అర్థం. అవి అ న్రపకా వరకు ఉంటాయి. అ, క చ ట త ప య శ క్ష. ఇవే నాద శక్తులు. అయితే ఇంకొక లెక్క రము అచ్చులలో హ్రస్వములు ఒక వర్గు. కాగా దీర్ఘములు ఒక వర్గు. క చ ట త ప య శ. వర్గులతో కలిసి తొమ్మిది నాద శక్తులు.

**బిందు :** అంటే అకారము నుండి అః వరకు గల పదహారు వ॰ లు అనబడే శక్తి.

కళా అంటే అకారము నుండి అః వరకు గల చంద్ర కళలు పదహారు. ఇది కళా స్వరూపిణీ శక్తి.

| | | |
|---|---|---|
| జ్యేష్ఠా | - | సు్రష్ణు రూపశక్తి |
| రౌద్రే | - | ( ) రూపశక్తి |
| వామా | - | (హ్మ రూపశక్తి |

**విషఘ్నీ :** వామ, జ్యేష్టా, రౌద్రీల యొక్క సమిష్టి రూపమైన అ కా శక్తి. సంసార రూపమైన విషాన్ని నాశనం చేస్తుంది కాబట్టి దీన్ని విషఘ్ని శక్తి అంటారు.

**మాతృకా :** సర్వ కారణ విమర్శాత్మకమైన అకారాది వర్ణ సమిష్టి రూపశక్తి.

**సర్వానందా :** ఆనంద శక్తి, ఇతరములైన ఆనందాలన్నీ దీని యందు నిలవలేవూ మొత్తం మీద.

| | | |
|---|---|---|
| 1. నాద శక్తి | 2. వర్ణ )ందు) శక్తి | 3. కళా శక్తి |
| 4. జ్యేష్ఠా శక్తి | 5. రౌద్రీ శక్తి | 6. వామా శక్తి |
| 7. విషఘ్ని శక్తి | 8 మాతృకా శక్తి | 9. సర్వానందా శక్తి |

అనబడే తొమ్మిది శక్తులు తొ॰ చక్రముల యందు ఉంటా ). —లో

నాదము అంటే - భూపురము

బిందువు అంటే - షోడశ దళము

నిరంశే - ఇచ్ఛా జ్ఞాన క్రియా శక్తుల చేత సూచించబడిన శాంతా శక్తి రూపము. శాంతా శక్తి చిద్రూపిణి కాబట్టి నిరాకారము.

**కళా :** అష్టదళ పద్మము. ఇచ్ఛా స్వరూపము.

**జ్యేష్ఠా :** చతుర్దశారము జ్ఞానశక్తి స్వరూపము.

**శేషం :** మిగిలినటు వంటి బహిర్దశారము,

అంతర్దశారము, అష్టకోణము, బిందువు, చక్రములు. వీటిని క్రియాశక్తి స్వరూపములుగా భావించాలి.

ఈ రకంగా శ్రీచక్రము త్రితయాత్మకము. ఇచ్ఛా, జ్ఞాన, క్రియాశక్తుల్య స్వమిష్టి రూపము. కామకళ యొక్క సంపూర్ణమైన ప్రకాశము నుంచే శ్రీచక్రము ఉత్పన్నమైనది. అందుచేత శ్రీచక్రమంతా కామకళా రూపమే. వస్తువు దేని నుంచి ఉత్పన్న మవుతుందో, దాని యొక్క పారమార్థిక స్వరూపాన్నే కలిగి ఉంటుంది. మట్టి నుండి తయారైన కుండ మట్టి రూపమే కలిగి ఉంటుంది. దారములతో తయారయిన వస్త్రము దారముల రూపాన్నే కలిగి ఉంటుంది. అలాగే బిందు త్రయ (బిందువు, విసర్గ) రూపమైన కామకళ నుండి శ్రీచక్రము ఉత్పన్నమైనది. కాబట్టి వామ, ఇచ్ఛా, పశ్యన్తీ మొదలైన మూడు శక్తుల స్వరూపమైన శ్రీచక్రము కామకళా స్వరూపమే. అందుకనే శ్రీచక్రం అంతా కామ కళా మయంగానే భావించాలి.

## మహా బిందువు

***అకులే విషు సంజ్ఞేచ శాక్తే వహ్నౌ తథాపునః ।***
***నా భావనా హతేశుద్ధే లంబికాగ్రే భ్రువోఽన్త రే ॥ 25***

***బిందౌ తదర్థే రోదిన్యాం నాదే న్యాస్త ఏవచ ।***
***శక్తౌ పునర్వ్యాపికాయాం సమనోన్మన గోచరే ॥ 26***

***మహా బిందౌ పునశ్చైవం త్రిధా చక్రంతు భావయేత్ ।***

శరీరంలో మేరు దండము ఉన్నది. దీన్నే వెన్నుపూస అంటారు. దీని వెంబడి సుషుమ్నా నాడి ఉన్నది. ఆ సుషుమ్నకు మొదట ఊర్ధ్వముఖంగానూ చివర సహస్రారం దగ్గర అదోముఖంగానూ మొత్తం రెండు సహస్రారాలున్నాయి. ఈ రెండు సహస్రారాలను ఆశ్రయించి (కలుపుతూ) ఉన్న సుషుమ్నలో ముప్పై పద్మాలున్నాయి. క్రింద ఉన్న సహస్రారానికి, మూలాధారానికి మధ్య అష్టదళ, షడ్దళ పద్మలు రెండున్నాయి. ఈ రెండింటి మధ్య భాగాన్నే 'విషు' అంటారు. ఆధార చక్రము నుంచి సహస్రారము (మహా బిందువు) వరకు పంతొమ్మిది స్థానాలున్నాయి. ఇవి మొత్తం మూడు జట్లుగా ఉంటాయి. ఒక జట్టులో తొమ్మిది, రెండవ జట్టులో తొమ్మిది. మూడవ జట్టులో మహా బిందువు ఒక్కటే ఉంటుంది. శ్రీచక్రాన్ని మొదటి జట్టులోనూ, తరువాత రెండవ జట్టులోనూ ఆ తరువాత మహా బిందువు నందు భావన చెయ్యాలి. ఈ స్థానాలు క్రింది విధంగా ఉంటాయి.

**మొదటి జట్టు :**

1. అకులము - ఆధార చక్రానికి దిగువ ఉన్న సహస్రారము
2. విషు - అష్టదళము, షడ్దళముల మధ్య భాగము
3. శక్తి - మూలాధారము. ఇక్కడే కుండలినీ శక్తి ఉంటుంది.
4. వహ్ని - స్వాధిష్ఠానము. (స్వాధిష్టానము జలతత్వాత్మకమైనది. కాని ఆధార చక్రము దగ్గరనుంచీ అనాహతం దాకా వ్యాపించి ఉన్న వహ్ని కూటము యొక్క మధ్య భాగము కాబట్టి వహ్ని అనబడుతోంది.)
5. నాభి - బొడ్డు దగ్గర ఉన్న మణి పూరము.
6. అనాహతము - హృదయస్థానము
7. విశుద్ధ చక్రము - కంఠ స్థానము
8. లంబికాగ్రము - కొండ నాలుక. సూక్ష్మ జిహ్వాస్థానమైన అష్టదళ పద్మము.
9. భ్రూమధ్యం - భృకుటి. ఆజ్ఞా చక్ర స్థానము

**రెండవ జట్టు :**

1. ఇందు - బిందువు
2. తదర్ధం - అర్ధచంద్రము
3. రోదిని

4. నాదము
5. నాదాన్తము
6. శక్తి
7. వ్యాపికా
8. సుమనా
9. ఉన్ననా

**మూడవ జట్టు** ఇందులో ఒకే ఒక స్థానముంటుంది. అదే మహాబిందువు. ఇది శిరస్సుకు పన్నెం డు అంగుళాలపైన ఉంటుందని చెప్పబడుతోంది.

## శ్రీచక్ర అధికారులు

*ఆజ్ఞాన్తం సకలం ప్రోక్తం తతస్సకల నిష్కళం ॥* **27**
*ఉన్మన్యన్తం పరేస్థానే నిష్కళంచ త్రిధాస్థితం.*
*దీపాకారోఽర్ధమాత్రశ్చ లలాటే వృత్త ఉచ్యతే ॥* **28**

క్రింద భాగానవున్న సహస్రారమైన అకులము దగ్గర నుంచీ ఆజ్ఞా చక్రాంతము వరకు గల తొమ్మిది స్థానముల యందు (మొదటి జట్టు) శ్రీచక్రాన్ని భావించటాన్ని 'సకల భావన' అంటారు. అక్కడ 'సకలా' అనబడే అశుద్ధులైన ఉపాసకులు మాత్రమే అధికారులు. రెండవ జట్టులో బిందువు నుండి ఉన్మని వరకు గల తొమ్మిది స్థానాలలోనూ శ్రీచక్రాన్ని భావించటాన్ని 'సకలనిష్కళ' అంటారు. ఇక్కడ శుద్ధా శుద్ధ మిశ్రులైన 'ప్రళయాకళా' అనే ఉపాసకులు అధికారులు. మూడవ జట్టు అయిన మహా బిందువులో శ్రీచక్ర భావన చేసేవారు కేవల విజ్ఞానులు. ఇక్కడ సాధకుడు పరదేవతకూ, తనకూ బేధము లేదనే నిష్కళా భావనతో ఉంటాడు. ఈ రకంగా శ్రీచక్రము అధికారి భేదము చేత మూడు రకాలుగా చెప్పబడుతోంది.

1. మొదటి జట్టుకు సకలా అనే భావన కల, అశుద్ధులైన, భేదమే ప్రధాన దృష్టిగా గల ఉపాసకులు అధికారులు.
2. రెండవ జట్టుకు సకలా నిష్కళా అనే భావన కల శుద్ధాశుద్ధ మిశ్రులైన భేదాభేద దృష్టి గల ఉపాసకులు అధికారులు.
3. మూడవ జట్టుకు తనకూ పరదేవతకూ భేదము లేదని నిష్కళా భావన చేసే అభేద దృష్టి గల వారైన కేవల విజ్ఞానులు అదికారులు.

వీటిలో మొదటి జట్టులోని ఉపాసకులు ఎక్కువ. రెండవ జట్టు వారు బిందువు నుంచి ఉన్మని వరకూ శ్రీచక్ర భావన చేస్తారు. దీప సమానమైన కాంతి గలిగి, అర్ధ మాత్ర ఉచ్ఛారణ కాలము గలిగినది, వృత్తాకారము కలిగినది అయిన బిందువు లలాటమందున్నది. మాత్ర అంటే అ, ఇ మొదలైన హ్రస్వమును ఉచ్ఛరించటానికి పట్టే కాలము 256 లవములు.

పద్మము యొక్క రేకులను బొత్తిగా పెట్టి సన్నని సూదితో పొడిచినట్లైతే, ఒక్కొక్క దళానికీ గుచ్చటానికి పట్టే కాలాన్ని లవమంటారు! ఇప్పుడు అర్ధమాత్ర అంటే 128 లవములు.

## అర్ధచంద్ర, రోదినీ లక్షణములు

*అర్ధచంద్రస్తథాకారః పాదమాత్రస్తదూర్ధ్వకే ।*
*జ్యోత్స్నాకారా తదష్టాంశా రోధినీ త్ర్యస్రవిగ్రహా॥* 29

బిందువుకు పైభాగాన అర్ధచంద్రమున్నది. పేరుకు తగ్గట్టుగానే దాని ఆకారము కూడా అర్ధచంద్రంగానే ఉంటుంది. దీని కాంతి కూడా అష్టమినాటి చంద్రుని వలెనే ఉంటుంది. దీని ఉచ్ఛారణ 1/4వంతు మాత్ర. అంటే 64 లవములు. దీనిపైన వెన్నెలవంటి కాంతి గలది, 1/8 వంతు మాత్రాకాలము (32 లవములు) గలిగి ఊర్ధ్వాగ్రమైన త్రికోణ స్వరూపము కల 'రోదినీ' ఉంటుంది.

## నాద లక్షణము

*బిందు ద్వయాన్తరే దండః శ్వేవ రూపో మణిప్రభః ।*
*కలాంశో ద్విగుణాంశ శ్చ నాదాంతో విద్యుదుజ్జ్వలః ॥* 30

కనుల వలె ఉండే రెండు బిందువులున్నాయి. వీటిని 'తిర్యక్' బిందువు లంటారు. వాటిని కలుపుతూ మధ్యలో సన్నని రేఖ ఒకటి ఉన్నది. ఇది మణి ప్రభ కలిగి ఉంటుంది. అంటే ఎర్రని కాంతితో ప్రకాశిస్తుంది. ఇక్కడ కలాంశ అని చెప్పటం చేత మాత్రలో 1/16 వంతు ఉచ్ఛారణా కాలము. అంటే 16 లవములు. ఇది అవ్యక్త నాద స్వరూపము. ఇదే నాదము.

## శక్తి లక్షణము

*హలాకారస్తు సవ్యస్థ బిందు యుక్తో విరాజతే।*
*శక్తి ర్వ్యామస్థ బిందూధ్య స్థిరాకారా తథా పునః ॥* 31

నాదానికి పై భాగాన ద్విగుణాంశము అంటే నాద ఉచ్చారణ కాలానికి రెట్టింపు (మాత్రలో అనగా 1/32 వంతు అది 8 లవములు కలిగి విద్యుత్ కాంతులతో ప్రకాశిస్తుంటుంది. ఇదే నాదాన్తము. దీని ఆకారము కొన పైకి ఎత్తిపెట్టిన నాగలి లాగా ఉండి కుడి వైపు ఉన్న బిందువుతో కలిసి ఉంటుంది. తిర్యక్ బిందువులలో ఎడమ వైపు బిందువుకు పై భాగాన ఉన్నదే శక్త్యాకారము. శక్తికి పై భాగాన వ్యాపిక ఉంటుంది. శక్తి ఉచ్ఛారణ కాలము 4 లవములు.

## సుమనా లక్షణము

*వ్యాపికా బిందు విలస త్రికోణాకారతాం గతా ।*
*బిందు ద్వయాంతరాలస్థా ఋజు రేఖా మయీ పునః ॥* 32

శక్తికి పై భాగాన వ్యాపిక ఉన్నది. అది ఊర్ధ్వ శీర్షము గల త్రికోణము మాదిరిగా ఉంటుంది. పైన, క్రింద రెండు బిందువులుండి, ఆ రెండింటినీ కలిపే సన్నని రేఖనే సుమనా అంటారు.

## ఉన్మనా లక్షణము

*సమనా బిందువిలస దృజు రేఖా తథోన్మనా*
*శక్త్యాదీనాం వపుః స్ఫూర్జ ద్ద్వాదశాదిత్య సన్నిభమ్* 33

బిందువు పై భాగాన ప్రకాశించే తిన్నని రేఖయే సుమన. సుమన చేరేంత వరకు సాధకుడి మనస్సు పని చేస్తూ ఉంటుంది. అందుచేతనే అది 'సుమనా' అనబడింది.

ఆ తరువాతది 'ఉన్మనా'. ఉన్మనా స్థితిలో మనస్సు పని చెయ్యదు. ఇక్కడ మనస్సుకు ఇంకొక రూపం వస్తుంది. ఇంకొక రూపంతో మనస్సు ఇంకా పైకి పోతుంది. అందుకనే దీనిని ఉన్మనా అంటారు.

## కాల నిర్ణయము

***చతుష్షష్టి తదూర్ధ్వంతు ద్వి గుణం ద్విగుణం తత:***
***శక్త్యా దీనాంతు మాత్రాంశో మనోన్మన్యాస్త థోన్మనీ ॥ 34***

కాల పరిమాణములో అతి సూక్ష్మమైనది లవము. వరివశ్యా రహస్యంలోని 18వ శ్లోకంలో భాస్కరరాయల వారు కాలపరిమాణాన్ని ఈ విధంగా చెప్పారు.

***నళినీ పత్ర సంహత్యా: సూక్ష్మ సూచ్య భి వేధనే ।***
***దళే దళేతుయ: కాల: సకాలో లవ సంజ్ఞత: ।***
***అతి సూక్ష్మ తమ: కాలోనోపలభ్యో భృగూద్వహా ॥***

తామర పూవుల యొక్క రేకులను కట్టగా చేసి సూదితో గ్రుచ్చినట్లైతే, ఒక్కొక్క దళము గ్రుచ్చుడు పడటానికి ఎంత కాలము పడుతుందో దాన్ని లవము అంటారు. అంత కన్నా తక్కువైనకాలాన్ని పరిశీలించటం సాధ్యంకాదు.

| | | |
|---|---|---|
| ఒక మాత్ర | - | 256 లవములు |

***బిందోరర్ధం మాత్రా పరే పరే చాపి పూర్వ పూర్ధా:***

బిందువుకు అర్ధమాత్ర అంటే 128 లవములు. అక్కడ నుంచి మిగిలిన వాటికి పై వాటిలో సగము మాత్రమే కాలము. అంటే బిందువులో సగము కాలము అర్ధ చంద్రము. అందులో సగము కాలము రోదిని. అందులో సగము నాదము. నాదములో సగము నాదాంతము. ఈ రకంగా కాల నిర్ణయం జరిగింది.

ఇప్పుడు బిందువు మొదలగు వాని ఉచ్ఛారణ కాలము.

| | | |
|---|---|---|
| బిందువు | - | 128 లవములు |
| అర్ధ చంద్రము | - | 64 లవములు |
| రోధిని | - | 32 లవములు |
| నాదము | - | 16 లవములు |
| నాదాంతము | - | 8 లవములు |
| శక్తి | - | 4 లవములు |
| వ్యాపిక | - | 2 లవములు |
| సుమనకు | - | 1 లవము |
| ఉన్మని | - | కాలము లేదు |

## పరబ్రహ్మ స్వరూపము

*దేశకాల నవచ్ఛిన్నం త దూర్ధ్వే పరమం మహత్ ।*
*నిసర్గ సుందరం తత్తు పరానంద విఘూర్ణితమ్ ॥* **35**

ఉన్మనికి పై భాగంలో మహా బిందువున్నది. ఇది శిరస్సుకు పన్నెండు అంగుళాల పై భాగాన ఉంటుంది. ఈ మహా బిందువు దేశకాలములకు అతీతమైనది. పరమ పదమైనది. సర్వోత్కృష్టమైనది. గొప్ప వాటి కన్నా కూడా గొప్పది. స్వభావము చేతనే అందమైనది. అందుచేతనే నిసర్గసుందరమైనదని చెప్పబడింది. శివశక్తుల సామరస్యము పరమానందకరమైనది. అటువంటి పరమానందముతో ఇది వ్యాపించి ఉన్నది.

## త్రికోణ భావన

*ఆత్మనః స్ఫురణాం పశ్యేద్యదా సా పరమా కళా ।*
*అంబికా రూపమాపన్నా పరావాక్సముదీరితా॥* **36**

కళా శబ్దముచేత ఆ పరమేశ్వరి చెప్పబడుచున్నది. శివశక్తుల సామరస్యమే పరబ్రహ్మ స్వరూపము. అట్టివంటి పరబ్రహ్మను సృష్టిప్రాధాన్యత వలన దేవి అని కూడా చెబుతున్నారు. విమర్శ రూపవై ఆ దేవి స్వేచ్ఛగా, తనయందు లీనమై ఉన్నశక్తి త్రయముతో (ఇచ్ఛా జ్ఞాన క్రియా శక్తులతో) కూడినదై, ఇచ్ఛా శక్తితో ప్రకాశ సంబంధమైన కాంతిని, ముప్ఫై ఆరు తత్త్వముల రూపమైన జగత్తు యొక్క సూక్ష్మ రూపమును, క్రియాశక్తినీ చూస్తుంది. జగత్తు యొక్క సూక్ష్మరూపాన్ని జ్ఞానశక్తితో అనుసంధానము చెయ్యటం చేత బిందు, విసర్గ, కళాత్మకత్వము పొందుతుంది. అప్పుడు కామకళా రూపిణి అయిన శాంతా శక్తి (ఇచ్ఛా జ్ఞాన క్రియాశక్తుల సామరస్యము) అంబికా రూపముతో (వామా, జ్యేష్టా, రౌద్రీ శక్తుల సామరస్యము) సామరస్యము పొంది పరావాక్‌గా చెప్పబడుతున్నది. అంటే శాంతా, అంబికల సామరస్యముతో కూడిన కామకళ నుండే పరావాక్కు పుడుతున్నది. అదే త్రికోణగత బిందు చక్రము.

## త్రికోణ విశేష్ట భావన, పశ్యంతీ రూపము

*బీజభావ స్థితం విశ్వం స్ఫుటీకర్తుం యదోన్ముఖీ ।*
*వామా విశ్వ స్య వమనాదంకురా కారతాంగతా ॥* **37**
*ఇచ్ఛా శక్తి స్తదాసేయం పశ్యంతీ వపుషాస్థితా ।*

అకారాదిక్ష కారంతమూ మాతృకలు నాలుగు విధాలుగా ఉంటాయి. అవి

1. స్థూల 2. సూక్ష్మ 3. సూక్ష్మతర 4. సూక్ష్మతమ

అదే విధంగా వాగ్రూపమైన జగత్తు కూడా నాలుగు విధాలుగా ఉన్నది. అవి.

1. పరా 2. పశ్యంతీ 3. మధ్యమా 4. వైఖరీ

అయితే వీటిలో

1. స్థూలము - వైఖరీ
2. సూక్ష్మము - మధ్యమా
3. సూక్ష్మ తరము - పశ్యంతీ
4. సూక్ష్మ తమము - పరావాక్కు

అతి చిన్నదైన విత్తనంలో అంత పెద్ద మర్రి వృక్షము దాగి ఉండటము ఊహకు కూడా అందని విషయము. అలాగే పరావాక్కునందు విశాలమైన విశ్వమంతా దాగి ఉన్నది. విత్తనములో నుంచి మొలక వచ్చి పెద్ద వృక్షము అయినట్లుగానే, తనయందు బీజ రూపంలోఉన్న పరా వాగ్రూపమైన విశ్వమును బయటకు పంపినప్పుడు, విత్తనము మొలకెత్తినట్లే, అవస్థా భేదం చేత పరావాక్కు అంకుర భావం పొంది 'పశ్యంతీ' అవుతుంది. అంకుర భావం పొందిన పరావాక్కు త్రికోణంలోనే ఉంటుంది.

వమనము చేయటము అంటే కక్కుట. ఇదే సృష్టి అందుకనే వామా అనబడుతోంది. వామాశక్తితో సామరస్యము పొందినదై పరావాక్కు పశ్యంతీ రూపము పొందుతున్నది. అంటే పరావాక్కు నుంచి పుట్టిన శృంగాట రూపము (త్రికోణము) అంకురమయి పశ్యంతీ, మధ్యమా, వైఖరీ అని మూడు రేఖలు కలిగి ఉంటుంది.

ఎడమ వైపు రేఖ - పశ్యంతి, సృష్టి రూపము
కుడి వైపు రేఖ - వైఖరీ, సంహార రూపము
మధ్య రేఖ - మధ్యమా, స్థితి రూపము
(పైభాగాన అడ్డంగా ఉండేది.)

ఈ రకంగా మూడు రేఖలూ మూడు రూపాలు అయినప్పటికీ, ఎడమ వైపున ఉన్న సృష్టి రూపమైన పశ్యంతీ రేఖయే త్రికోణంలో ప్రధానమైనది.

## మధ్యమా రూపము

*జ్ఞానశక్తి స్తథా జ్యేష్ఠా మధ్యమా వాగు దీరితా ॥* **38**

*ఋజు రేఖ మయీ విశ్వస్థితౌ ప్రథిత విగ్రహా*

ఋజు రేఖ రూపంలో ఉన్న మధ్యమ విశ్వము యొక్క స్థితి రూపము. పశ్యంతి మూలంగా అంకురించిన విశ్వము కొంత కాలం పాటు ఉండటమే స్థితి. ఇచ్ఛా జ్ఞాన క్రియాశక్తులలో మధ్యమ జ్ఞానశక్తి. ఈ మధ్యమ వాగ్రూపము పొంది లోకవ్యవహారానికి ఉపకరిస్తుంది.

## వైఖరీ రూపము

*తత్ సృష్ట్యాతి దశాయాంతు బైందవం రూపమాస్థితా ॥* **39**

*ప్రత్యాపృత్తి క్రమేణైవ శృంగాట వపురుజ్వలా ।*

*క్రియాశక్తిస్తు రౌద్రీయం వైఖరీ విశ్వ విగ్రహా ॥* **40**

బిందు రూపంలో ఉన్న పరావాక్కు సృష్ట్యాత్మకమైన త్రికోణంలోని ఎడమ రేఖగా అయి, తరువాత స్థిత్యాత్మకమైన మధ్యరేఖ రూపముగా కొంత కాలముండి లయ సమయము ఆసన్నము కాగా తిరిగి బిందురూపము పొందటానికి ఉద్యుక్తురాలై, సృష్టి నుంచి స్థితికి వచ్చినట్లుగానే, స్థితి నుంచి సంహారానికి బయలుదేరి త్రికోణంలోని కుడివైపురేఖ గుండా వచ్చి సృష్టిరేఖ చివను తాకుతుంది. ఈ రకంగా శృంగాటము (త్రికోణము) చుట్టూ ఒక ప్రదక్షణమైనది. దీనివల్ల త్రికోణము ప్రకాశవంతమవుతున్నది. అటువంటి ప్రకాశమాన రూపమే పరావాక్కు అనబడుతుంది.

విశ్వము స్థూలము, సూక్ష్మము, సూక్ష్మ తరము, సూక్ష్మతమము అని నాలుగు విధములు. అలాగే వాక్కు కూడా పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరీ అని నాలుగు విధములు. అందుచేతనే వాగ్రూపము విశ్వ విగ్రహా అనబడుచున్నది. గతంలో చెప్పినట్లుగా క్రియాశక్తి, రౌద్రిశక్తితో సామరస్యము పొందినదై వైఖరిగా వ్యవహరించబడుచున్నది. త్రికోణము కుడి వైపురేఖ క్రియా రౌద్రీ శక్తుల రూపమై వైఖరిగా పిలవబడుతున్నది. త్రికోణంలో సామరస్యం పొందే శక్తులు ఈ క్రింది విధంగా ఉంటాయి. త్రికోణంలోని

| | | | | |
|---|---|---|---|---|
| ఎడమ వైపు రేఖ - ఇచ్ఛా, | - | వామ, | - | పశ్యంతీ శక్తులు. |
| మధ్య రేఖ - జ్ఞాన, | - | జ్యేష్ఠా, | - | మధ్యమా శక్తులు. |
| కుడి వైపు రేఖ - క్రియా, | - | రౌద్రీ, | - | వైఖరీ శక్తులు. |
| బిందువు - శాంతా, | - | అంబికా, | - | పరా శక్తులు. |

## బిందు భావము

*భాసనాద్విశ్వ రూపస్య స్వరూపే బాహ్యతోఽపి చ ॥*
*పీఠాశ్చ తస్త్రః శక్తస్తు కా - పూ - జా - ఓ - ఇతి క్రమాత్ ॥* **41**
*పీఠాః కందే పదే రూపే రూపాతీతే క్రమా స్థితాః ।*

విశాల విశ్వానికీ మానవ శరీరానికీ సమాన రూపత్వము ఉన్నది.

| | | |
|---|---|---|
| బ్రహ్మాండము | - | విశాల విశ్వము |
| పిండాండము | - | మానవ శరీరము |

ఈ రెండూ సమిష్టి వ్యష్టి జీవశరీరములు. బ్రహ్మాండంలో ఉన్న అవయవాలే పిండాండములో కూడా ఉన్నాయి.

నామ రూపాత్మకమైనది ప్రపంచము. ఆ ప్రపంచము యొక్క స్వరూపము పిండాండము. పిండాండ మందు బ్రహ్మాండము యొక్క కాంతి వలన అంటే రెండూ ఒకే రకంగా సమానంగా ఉండటం చేత అంబికా, మొదలైన శక్తులు కా, పూ, జా, ఓ అనే పేర్లు గల పీఠాలయినాయి:

1. కా - కామగిరి పీఠము
2. పూ - పూర్ణగిరి పేఠము
3. జా - జాలంధర పీఠము
4. ఓ - ఓఢ్యాణ పీఠము

ఈ పీఠాలన్నీ కూడా నదీ తీరమునందున్నాయి. ఇప్పుడు పిండాండ మందు చెప్పబడిన

| | | | | |
|---|---|---|---|---|
| 1. | కందం | - సుషుమ్నా నాళము | - | మూలాగాగము |
| 2. | పదం | - హృదయము | - | అనాహతము |
| 3. | రూపం | - బిందువు | - | భ్రూమధ్యము - ఆజ్ఞా చక్రము |
| 4. | రూపాతీతం | - కళలకు అతీతమైనది | - | బ్రహ్మరంధ్రము |

చెప్పబడుతున్నాయి. ఈ స్థానాలలోనే ఇందాక చెప్పిన పీఠాలున్నాయి. ఈ పీఠాలలోనే అంబికా మొదలైన శక్తులున్నాయి.

1. కామగిరి పీఠము - త్రికోణంలోని అగ్రకోణము, వాగ్భవ బీజము, వామాశక్తి, ఆధార చక్రము.
2. పూర్ణగిరి పీఠము - త్రికోణంలోని దక్షిణ కోణము, కామరాజ బీజము, జ్యేష్ఠా శక్తి, అనాహతము.
3. జాలంధర పీఠము - త్రికోణంలోని ఉత్తర కోణము, శక్తి బీజము, రౌద్రీశక్తి, ఆజ్ఞా చక్రము.
4. ఓఢ్యాణ పీఠము - త్రికోణంలోని బిందువు, సర్వ బీజములు, అంబికాశక్తి, బ్రహ్మరంధ్రము.

లలితా సహస్ర నామాలకు వ్యాఖ్యారాస్తూ భాస్కర రాయలవారు తమ సౌభాగ్య భాస్కరములోని

375 నామము కామ పూజితా - కామ గిరి పీఠము (కామ రూపము)
376వ నామము - శృంగార రస సంపూర్ణా - ఇదే శృంగేరీ పీఠము
378వ నామము - జాలంధర స్థితా - జాలంధర పీఠము.
379 వ నామము - ఓఢ్యాణ పీఠ నిలయా - ఓఢ్యాణ పీఠము

ఈ పీఠాలు శరీరంలో వరుసగా మూలాధారము, అనాహతము, విశుద్ధ, ఆజ్ఞా చక్రాలుగా ప్రసిద్ధమైన తంత్ర శాస్త్రములలో చెప్పబడ్డాయి. ఆజ్ఞా చక్రంలో చంద్రుడుంటాడు. ఇక్కడ చంద్రుడు షోడశకళాయుక్తుడు. సహస్రారం చంద్రలోకం. ఇక్కడ చంద్రుడు నిత్య కళాయుక్తుడు. కళలకు అతీతమైనవాడు. అందుకే ఇక్కడ 'రూపాతీతం' అని చెప్పబడింది. రూపం అంటే కళలు గల చంద్రుడు ఆజ్ఞా చక్రంలో ఉండగా, కళల కతీతుడైన చంద్రుడు సహస్రారంలో బ్రహ్మ రంధ్రం దగ్గర ఉన్నాడు.

## పీఠ స్వరూపాలు

*చతురస్రం తథా బిందు షట్క యుక్తం చ వృత్తకమ్ ।* **42**

*అర్థ చంద్రం త్రికోణం చ రూపాణ్యేషాం క్రమేణ తు ।*
*పీతో ధూమ్రస్తథాశ్వేతో రక్తో రూపం చ కీర్తితమ్॥* **43**

ఈ పీఠాలు క్రమంగా పృథివీ, వాయు, జల, అగ్ని రూపాలని వివరించబడుతోంది.

1. కామగిరి పీఠము - భూపురము, భూతత్త్వము, పీతవర్ణము.
2. పూర్ణగిరి పీఠము - షడ్బిందువులచే ఏర్పడిన వృత్తము, వాయుతత్త్వము, ధూమ్ర వర్ణము.
3. జాలంధర పీఠము - అర్థ చంద్రాకారము, జలతత్త్వము, శ్వేత వర్ణము.
4. ఓఢ్యాణ పీఠము - త్రికోణము, అగ్ని తత్త్వము, రక్త వర్ణము.

## పీఠములందలి లింగములు

*స్వయమ్భుర్బాణ లింగం చ ఇతరం చ పరం పునః*
*పీఠేష్వే తాని లింగాని సంస్థితాని వరాననే ॥* **44**

అంతఃకరణ ప్రవృత్తి చేత ప్రకాశించిన చైతన్య రూపములు పీఠములు. వీటిని గురించి ఎవరైనా చెబితే తెలియవలసినదే కాని ఊహించటానికి వీలులేదు. అవి అమృత స్వరూపమైనవి.

బాహ్యేంద్రియాలకు గోచరించకుండా జ్ఞానాన్ని గూర్చి తెలియజేసే ఆకారము లింగము అనబడుతుంది. పైన చెప్పిన పీఠాలు మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారములతో కూడినవి. వీటియందు స్వయంభూ, బాణ, ఇతర, పరా అనీ పేర్లతో లింగములున్నాయి. కాని లింగములు నాలుగు రకములు అనీ, అవి స్వయంభూ, బాణా, తారా, పరా అనే ఇతర గ్రంధాలలో ఉన్నది.

## లింగముల స్వరూపము

*హేమ బంధూక కుసుమ శరచ్చంద్ర నిభానితు*
*స్వరావృతం త్రికూటం చ మహాలింగం స్వయంభువమ్* **45**

*కాది తాంతాక్షరోపేతం బాణ లింగం త్రికోణకమ్ ।*
*కదంబ గోళకాకారం థాదిషా న్తాక్షరావృతమ్ ॥* **46**

*సూక్ష్మ రూపం సమస్తార్ణ వృతం పరమ లింగకమ్*
*బిందురూపం పరానందకందం నిత్య పదో దితం ॥* **47**

ఈ శ్లోకాలలో లింగముల యొక్క స్వరూపము, వాటి రంగు, అక్షరములు వివరించబడుతున్నాయి.

1. స్వయంభూ లింగము - హేమ వర్ణము గలది.
2. బాణ లింగము - బంధూక పుష్ప వర్ణము. (ఎరుపు రంగు) గలది.
3. ఇతర లింగము - శరశ్చంద్ర వర్ణము (తెలుపు రంగు) గలది.

**1. స్వయంభూ లింగము :** స్వయముగా ఉద్భవించినది. ఎవరిచేతా తయారు చేయబడినదికాదు. లౌకికంలో దీన్ని మహాలింగము అంటారు. ఇది అ నుంచి అః వరకు గల స్వరముల చేత కూడినదై ఉంటుంది. ఇది త్రికూటము. మూడు శిఖరములు గలది. మూడు బిందువులు గల కూటత్రయముతో కూడినది. మూడు బిందువులు అంటే సున్నా, విసర్గ మొత్తం మూడు బిందువులు.

**2. బాణ లింగము :** క కారము నుండి త కారము వరకు పదహారు అక్షరములచే చుట్టబడి త్రికోణాకారమై ఉన్నది.

**3. ఇతర లింగము :** కడిమి చెట్టు పూవువలె గోళాకారంలో ఉంటుంది. ధ నుంచి స వరకు గల 16 వర్ణములతో పరివృతమై ఉంటుంది.

**4. పరా లింగము :** సూక్ష్మ రూపము గలది. అ నుంచి క్ష వరకూ అన్ని వర్ణముల చేత పరివృతమైనది. స్వయంభూ, బాణ, ఇతర లింగముల యొక్క సమిష్టి రూపము. ఇది చర్మ చక్షువులకు కనిపించదు. అతీంద్రియ గోచరమైనది. బిందు రూపంలో ఉంటుంది. అంటే బిందు పీఠమందుంటుంది. లలితా సహస్రంలోని 380వ నామము బిందు మండల వాసినీ. సర్వానందమయ చక్రమందుండునది. లేక బ్రహ్మరంధ్రము దగ్గర ఉండునది. పరానంద స్వరూపమైనది. ఇతరములైన ఆనందాలకు (విద్యానంద, విషయానంద, వాసనా నందాలకు) పరానందమే మూలము. పరానందము కాలాతీతమైనది. ఒకప్పుడు ఉండి మరొకప్పుడు లేకుండాపోదు. శాశ్వతమైనది.

పైన చెప్పిన వాటిలో అ నుంచి స వరకు మాత్రమే అక్షరములను చెప్పటం జరిగింది. హ ళ క్ష లను చెప్పలేదు. దీని కారణము.

హ కారము - స్వరములలోని విసర్గలో ఉన్నది.

ళ కారము - సంస్కృతంలో ళ కారము లేదు. కొన్ని చోట్ల ఉన్నదని చెప్పారు. కాని అది ల, స ల మిశ్రమము. అదీ గాక లకార ళకారములకు భేదము లేదు.

క్ష కారము - క, ష ల మిశ్రమము.

కాబట్టి ఈ మూడు అక్షరములు వదలి వేయబడినవి.

## బీజాక్షరముల వ్యష్టి, సమష్టి రూపములు

***బీజ త్రితయ యుక్తస్య సకలస్య మనోః పునః***
***ఏతాని వాచ్య రూపాణి కుల కౌళ మయానితు ॥*** ***48***

***జాగ్ర త్స్వప్న సుషుప్త్యాఖ్య తుర్యరూపాణ్య ముూనిత ,***

కులం - అనగా ప్రమాతృ, ప్రమేయ, ప్రమాణములతో కూడినది.

ప్రమాత - తెలిసికొనబడినది

ప్రమేయము - తెలిసికొనతగినది

ప్రమాణము - తెలిసికొను జ్ఞానము

కౌళము - ఈ మూడింటి యొక్క సమిష్టి రూపము.

ఇవి గాక, గతంలోచెప్పిన ఇచ్ఛాది చతుష్టయము ఇచ్ఛా, జ్ఞానం, క్రియా, శాంతా శక్తులు, వామాది చతుష్టయము వామ, జ్యేష్టా, రౌద్రీ, అంబికా.

బీజ త్రయము - (ఐం) వాగ్భవ బీజము, (క్లీం) కామ రాజ బీజము, (సౌః) శక్తి బీజము. వీటి సమిష్టి అంటే ఐం క్లీం సౌః ఇవన్నీ కలిసి పరిపూర్ణమైన శ్రీవిద్యా మంత్రమవుతున్నది. కాదివిద్యలో పంచదశీ మహామంత్రానికి ఉన్న కూటత్రయము (మూడు కూటములు), బాలా మంత్రమూ రెండూ ఒక్కటే.

పైన చెప్పిన చతుష్టయమే జాగ్ర, స్వప్న, సుషుప్తి, తురీయములనే అవస్థలు.

## శ్రీచక్రాధి దేవత స్వరూపము

***అతీతంతు పరం తేజఃస్వసంవిదుదయాత్మకం ॥*** ***49***

కామ కళాత్మకమైన బిందువు శ్రీచక్రంలో సర్వానందమయమైన బిందు చక్రంలో ఉన్నది.

| | | |
|---|---|---|
| పరంతేజః | - | ప్రకాశించు వాటన్నింటిలోనూ ఎక్కువగా ప్రకాశించునది. |
| స్వసంవిద్ | - | తాను మినహా మరొకటి లేదు. కేవలము తనను గూర్చి తెలియచేయు జ్ఞాన స్వరూపము. |
| ఉదయాత్మకమ్ | - | ఉదయిస్తున్న రీతిగా. సూర్యుడు ఉదయిస్తున్నప్పుడు క్రమంగా పెరిగే విధంగా అభివృద్ధి లక్షణములు గలది. షడ్భావములు లేనిది. షడ్భావములు అంటే. |
| 1. అస్తి | - | ఉంటున్నది |
| 2. జయాత్ | - | పుట్టుచున్నది |
| 3. వర్థతే | - | పెరుగుచున్నది |
| 4. విపరిణమత్ | - | విశేషముగా పరిణామము చెందుచున్నది. |
| 5. అపక్షీయత్ | - | క్షీణించు చున్నది. |
| 6. నశ్యత్ | - | నశించునది. |

ఈ భావనలు ఏవీ కూడా శ్రీ చక్ర దేవతకు ఉండవు. ఆవిడ స్వయం ప్రకాశ, సర్వాతీత, జ్ఞాన స్వరూపిణి, కోటి సూర్యచంద్రుల కాంతితో ప్రకాశిస్తుంటుంది.

## చిదానందము

***స్వేచ్ఛా విశ్వమయోల్లేఖ ఖచితం విశ్వరూపకం***
***చైతన్యమాత్మనో రూపం నిసర్గానందసుందరం ॥*** ***50***

ఆ పరమేశ్వరి దేని సహాయమూ లేకుండా, కేవలము తన యొక్క చూపు చేతనే 'విశ్వమయోల్లేఖా' అంటే విశ్వము అనే చిత్రాన్ని, స్వేచ్ఛా - స్వ ఇచ్ఛ అనబడే కుంచెతో తన

ఇష్టానుసారము తానే అయిన గోడ యందు చిత్రిస్తున్నది. ఈ చిత్రమే అంటే విశాలమైన విశ్వమే ఆత్మ. ఇది చైతన్య రూపమైనది. అంటే తనయొక్క ప్రకాశ రూపమైన పరమేశ్వరుని కన్న వేరుకానటువంటిది. ఈ రూపము నిసర్గానంద సుందరమైనది. శివశక్తులు తురీయ బిందువులో కలిసి ఉంటారు. అందుచేత వచ్చిన ఆనందముతో సుందరమైనది. ప్రకాశాంశమైన పరమశివుని కన్న వేరుకానిది, శివశక్తుల సామరస్యముచేత ఉత్పన్నమైన ఆనందము కలది అయి ఉన్నది. సత్ అంటే పరమేశ్వరుడు. చిత్ అంటే పరమేశ్వరిః వారిద్దరి కలయికయే ఆనందము. ఇదే శాశ్వతమైన ఆనందము. చిదానందము.

## ఇచ్ఛా జ్ఞాన క్రియాశక్తులు

*మేయమాతృ ప్రమామాన ప్రసరై స్సంకుచత్ప్రభం ।*
*శృంగాట రూపమాపన్న మిచ్ఛాజ్ఞాన క్రియాత్మకం ॥* **51**

మేయము ప్రమా విషయము. ప్రమా అంటే పూర్తి అయిన అనుభవము. ఆ అనుభవము పొందినవాడే ప్రమాత. ప్రమాకారణము ప్రమాణము. ఈ విధమైనటువంటి మేయము మొదలైన నాల్గింటితో చెందిన పరిణామము యొక్క ప్రభ అనగా కాంతి కొంచెము తగ్గించబడినదై బిందు త్రికోణాత్మకమైన కామకలా స్వరూపమైనది. ఉపాసకులనను గ్రహించటం కోసమే కామకలా స్వరూపము ఈ విధంగా ఏర్పడింది. అందుచేతనే ఇచ్ఛా జ్ఞాన క్రియాశక్తులు వ్యష్టిగాను, సమిష్టిగాను నాలుగు రూపాలు పొందినాయి.

## కామకలా స్వరూపము

*విశ్వాకారప్రథాధార నిజ రూప శివాశ్రయం ।*
*కామేశ్వరాంక పర్యంక నివిష్ట మతి సుందరం ॥* **52**

ముప్పై ఆరు తత్త్వముల పరిణామము చెందిన ఆ పరమేశ్వరి యొక్క నిజరూపము పరమేశ్వ రుడు. తురీయ బిందువు. కామకల తురీయ బిందువు నుండే ఉత్పన్నమైనది. ఈ రకంగా తురీయ బిందువు నుండి ఉత్పన్నమైన కామ బిందువు శివశక్త్యాత్మకము. అంటే శివశక్తులతో కూడినది. వీరే కామేశ్వరీ, కామేశ్వరులు. అంటువంటి కామేశ్వరుని యొక్క అంక భాగాన కూర్చొని ఉన్నది కామేశ్వరి. అందుకనే ఆమెను 'కామేశ్వరాంకస్థా' అనీ, 'పరమశివపర్యంకనిలయా' అనీ అంటారు.

అంక భాగాన్ని పర్యంకముగా చెప్పటం వలన ఆనందాతిశయం కలుగుతుంది. అందుకనే అతి సుందరము. ఈ రూపము అందరి చేతా ఊహించుకొనతగినది. అందుకే సుందరము, మనోహరము అయినది. కామేశ్వరుణ్ణి గురించి తెలుసుకున్నవాడు కామేశ్వరుని ఆకర్షణ అనబడే సౌందర్యముతో కూడి ఉన్నాడు. అనగా శివశక్తులు సదాశివ తత్త్వానికి పైన ఉన్నారు. అక్కడ పంచ బ్రహ్మాత్మకమైన మంచం మీద, కామేశ్వరుని అంకభాగాన ఆసీనురాలైనటువంటిది, ప్రేమ పాత్రురాలైనటువంటిది, విభావ, అనుభావ, సాత్త్విక, వ్యభిచారములతో కూడిన, పరిపుష్టమైన, విశేషమైన స్థాయీ భావము పొందినటువంటి శృంగార రసాత్మకమైన పరదేవత అయిన కామేశ్వరిని ధ్యానించాలి. ఇక్కడ వ్యభిచారము అంటే - ఉండవలసిన స్థితి కన్న వ్యతిరేకమైన స్థితి.

కామేశ్వరుడు ప్రకాశ బిందువు. అతనిది నిత్య అంతర్ముఖస్థితి. కామేశ్వరి విమర్శ బిందువు. ఈమెది ప్రపంచ రూపమైన-బాహ్య స్థితి. ఈ రకంగా ఇద్దరూ వ్యతిరేకమైన స్థితులలో ఉంటారు. అందుకనే వ్యభిచారమన బడినది.

కామేశ్వరుని అంక భాగాన అంటే తురీయ బిందువైన పర్యంకమునందున్నటు వంటిది అని అర్థం. అంతర్ముఖము, బహిర్ముఖము అయిన హార్ధకళ (హ్ కారము) బ్రహ్మ, విష్ణు, రుద్రాత్మకము. హార్ధకళనే పదార్థకళ అని కూడా అంటారు. విసర్గ (ః) ఈశ్వర, సదాశివాత్మకము. అదే విధంగా కామకళలోని సర్గ కళారూపమైన ఆసనము బిందువు. అక్కడ అంటే బిందువులో ఉన్నటువంటి పరమేశ్వరీ, పరమేశ్వర తత్త్వాన్ని ధ్యానించాలి.

## పరమేశ్వరి ఆయుధాలు

**ఇచ్ఛాశక్తిమయం పాశమంకుశం జ్ఞాన రూపిణం**
**క్రియాశక్తిమయేబాణ ధనుషీదధ దుజ్జ్వలం ॥ 53**

ఇచ్ఛాశక్తి పాశము. ఇచ్ఛవల్ల బంధాలు ఏర్పడతాయి. అందుచేతనే ఇచ్ఛాశక్తి రాగానికి ప్రతీక. దీనివల్ల మానవుడు నేను, నాది అనే భావనలో ఉండి సంసార లంపటంలో కూరుకుపోతాడు. ఆత్మ జ్ఞానము సంపాదించినట్లైతే అజ్ఞానము మటుమాయమవుతుంది. అంకుశము జ్ఞానానికి ప్రతీక. జ్ఞానంరావాలంటే విషయవాంఛల యందు ద్వేషము పుట్టాలి. అప్పుడు గాని ఆత్మజ్ఞానము కలగదు. పరమేశ్వరి చేతిలోని అంకుశమే ద్వేషము.

***పాశాంకుశౌ తదీయౌతు, రాగద్వేషాత్మకౌస్మృతౌ॥***

పరమేశ్వరి చేతిలోని పాశాంకుశాలే మానవుడిలోని రాగద్వేషాలు. ద్వేషానికి ఇంకొక పేరే క్రోధము. క్రియాశక్తితో కూడినవి శబ్ద స్పర్శాదులైన (పంచతన్మాత్రలైన) బాణాలు ! ఈ బాణాలను మనస్సు అనే ధనుస్సుతో జోడించటమే క్రియాశక్తి.

ఈ రకంగా తేజోమయమైన రాగ ద్వేషాలను ఆయుధములుగా చేతులందు ధరించి, జగత్తును ఆ పరమేశ్వరి నడిపిస్తున్నది. అందుకే శబ్ద స్పర్శాదయో బాణా మన స్థస్యాభవద్ధను: అనీ, 'మనోరూపేక్షు కోదండా పంచతన్మాత్రసాయికా' అని చెప్పబడింది.

సాధకుడు రాగ ద్వేషాలు విడిచి మనస్సును ధనుస్సుగా చేసి, పంచతన్మాత్రలే బాణాలుగా భావించి అహంకారమనే పుష్పంతో పరమేశ్వరిని గనక పూజించినట్లైతే, సాధకుడికి సర్వ సిద్ధులూ లభిస్తాయి.

## శివ శక్తుల రూపము

***ఆశ్రయాశ్రయి భేదేన అష్టధా భిన్న హేతిమత్।***
***అష్టార చక్ర సంరూఢం నవ చక్రాసనస్థితం॥*** ***54***

ఆశ్రయము కామేశ్వరుడు ఆశ్రయించినది కామేశ్వరి. వీరి ఆయుధములు మొత్తం ఎనిమిది. అందులో కామేశ్వరికి నాలుగు, కామేశ్వరుడికి నాలుగు. కామేశ్వరి కామేశ్వరుని అంక భాగాన కూర్చొని ఉన్నది. అంటే వారిద్దరూ విడివిడిగా లేకుండా కలిసే ఉన్నారు. అందుచేతనే వారికి విడిగా పూజలేదు. కామేశ్వరీ, కామేశ్వరుల ఆయుధాలు కూడా మేళవించి పూజించాలి. ఈ రకంగా ఉన్న శివశక్తులు అష్టార చక్రం అధిరోహించి, మిగిలిన చక్రాలలో కూడా వ్యాపించి ఉన్నారు. అంటే భూపురం దగ్గర నుండి, అష్టార చక్రం వరకూ బిందు త్రికోణాత్మకమైన కామకళా రూపమున్నది. ఈ విధంగా కామేశ్వరీ కామేశ్వరతత్త్వం అన్ని చక్రములందు వ్యాపించి ఉన్నది. అయితే ఆ రూపము తురీయ బిందు రూపమే కాని ఉపక్రమ, ఉప సంహారైక రూపంగా తొమ్మిది చక్రము లందు ఉన్నది. అనగా కామేశ్వరుడు అనే రూపము బిందువు మొదలు భూపురం దాకా అన్ని చక్రాల యందు ఉన్నది. ఉపక్రమంలో బిందువుకన్నా అతీతము. ఉపసంహార మందు నవచక్రాసనస్థితము.

శివశక్తులు తమ రూపాన్ని ఎనిమిది భాగాలుగా విభజించి అష్ట కోణంలో వశిన్యాది దేవతల రూపంలో ఉన్నారు. అని స్వచ్ఛంద తంత్రములో చెప్పబడింది. ఈ మిదునమేతన

యొక్క నవ ఆధారములను నవచక్రత్వముగా విభజించి తమ నాదశక్తి నవకమును నవచక్రేశ్వరీ రూపముతో పొంది ఉన్నారు. అని అమృతానందులు వ్రాశారు.

## శ్రీచక్రము తురీయ బిందు పరిణామము

*ఏవం రూపం పరంతేజః శ్రీచక్ర వపుషాస్థితం*
*తదీయ శక్తి నికరస్ఫుర దూర్మి సమావృతం ॥* **55**

ఈ విధంగా తురీయ బింద్వాత్మకమైన తేజస్సే శ్రీచక్ర రూపంతో ముప్పది ఆరు తత్త్వాలు కలిగి బిందువు దగ్గర నుండి భూపురం వరకూ ప్రకాశిస్తున్నది.

అణిమాది శక్తుల సమూహ రూపంచే స్ఫురించు అలలతో శివశక్తులు చుట్టబడి ఉన్నారు. ఇక్కడ ప్రకాశాత్మ అయిన పరమేశ్వరుడే సముద్రము. విమర్శ రూపిణి అయిన కామేశ్వరియే అందులోని నీరు, నీరు లేకుండా సముద్రం ఉండదు. పరాశక్తి యొక్క అవయవ శక్తిసమూహమే సముద్ర తరంగాలు. ఈ అలలు సముద్రంలోనే పుట్టి సముద్రంలోనే లీనమవుతాయి. అలాగే 36 తత్త్వాలు కూడా ప్రకాశాంశ అయిన కామేశ్వరుని నుంచే పుట్టి, కామేశ్వరుని యందే లీనమవుతాయి.

## ముద్రా విషయము

*చిదాత్మ భిత్తౌ విశ్వస్య ప్రకాశమర్శనే యదా*
*కరోతి స్వేచ్ఛ యా పూర్ణ విచికీర్షా సమన్వితా ॥* **56**
*క్రియా శక్తిస్తు విశ్వస్య మోదనాద్ ద్రావణాత్తదా*

ఈ శ్లోకము నుండి ఒక్కొక్క ఆవరణ పూజ యందు ప్రదర్శింపబడు ముద్రలను (దశముద్రలు) వివరించటం జరుగుతోంది.

పరబ్రహ్మ ప్రకాశ విమర్శల యొక్క సమిష్టి రూపము. ప్రకాశమునందు విమర్శ తన యొక్క అవయవ భూతములైన ఇచ్ఛా మొదలైన వాటితో సామరస్యము పొందుతున్నది. వాటి మధ్య జ్ఞానశక్తి చిద్రూపము వలన ప్రకాశమునందు మిక్కిలి సామరస్యము పొందుతున్నది. ఇచ్ఛా క్రియాశక్తులు జ్ఞానశక్తి ద్వారా సామరస్యము పొందుతున్నాయి. ఇక్కడ చిత్ - అంటే ప్రకాశముతో సామరస్యము పొందిన జ్ఞాన శక్తి, ఆత్మభిత్తి యందు -

అనగా ప్రకాశము తానే అయిన ప్రకాశమను గోడయందు, స్వేచ్ఛగా-తన ఇష్టానుసారము, తన యందు లీనమై ఉన్న యిచ్ఛాశక్తిచేత, పూర్ణముగా వికారము పొందటానికి ఇచ్ఛతో కూడినదై ముప్పది ఆరు తత్త్వములుగా విభజింపబడుతోంది.

విమర్శకు రెండు ఇచ్ఛలున్నాయి. 1) సామాన్యమైనది. 2) విశేషమైనది. అంటే ప్రకాశమునందు లీనమయ్యేది ఒకటి కాగా సృష్టి చేసేది రెండవది. అలాగే విమర్శకు క్రియా శక్తి యందు వాసనా రూపముగా ఉన్న జగత్తుకు అస్థిత్వము వచ్చినదని అర్థము. ప్రకాశ విమర్శలలో వెలుగు యొక్క స్పష్టత ప్రకాశము. కాగా 'ఇది ప్రకాశము' అని గ్రహించుట విమర్శ. ఈ వికారములను ప్రకృతి కలుగ చేయుచున్నది. విశ్వమునకు ఆరు విధాలయిన స్థితులున్నాయి. వీటినే షడ్భావములు అంటారు. అవి.

1. అస్థి - ఉంటున్నది
2. జాయితే - పుడుతున్నది
3. వర్థతే - పెరుగుతున్నది
4. విపరిణమతే - పరిణామమము చెందుతున్నది
5. అపక్షీయతే - క్షీణించుచున్నది
6. నశ్యతే - నశించు చున్నది.

వీటిలో మొదటిది అస్థి. నిత్యము అంటే ఎల్ల కాలము ఉండేది. కార్య కారణములు రెండూ సమానము. కార్య కారణముల భేదమే మిధ్య. బ్రహ్మ సత్యము. అది నిత్యము. బ్రహ్మ నుంచి వచ్చినదే ఈ జగత్తు. కాబట్టి జగత్తు కూడా సత్యమే. ఒక వేళ జగత్తు మిధ్య అయితే బ్రహ్మకూడా మిధ్యే అవుతుంది. ఎందుకంటే నిత్యము నుండి మిధ్యరాదు. కార్యము లేని కారణముండదు. ఇక విశ్వానికి ఉన్న రెండు, మూడు స్థితులు పుట్టుట, పెరుగుట అనేవి ప్రకాశ, విమర్శలు. ఇవి ఉత్పత్తి, అభివృద్ధి. చిద్రూపిణి అయిన త్రిపుర సుందరియే క్రియాశక్తి.

స్థితి కాలమందు త్రిపురసుందరీ దేవి దశముద్రల రూపము పొంది నవచక్రాత్మకమైన విశ్వమును సర్వ సంక్షోభిణీ మొదలైన ముద్రలచేత పాలించుచున్నది.

పాలు తోడు వేసినపుడు ఏ విధంగా పెరుగుగా మారుతుందో అదే మాదిరిగా విమర్శ శక్తి ప్రకాశ శక్తితో కలిసినప్పుడు వికారము పొందుతున్నది. పాలు వికారము పొందినప్పుడు పెరుగుగా మాత్రమే మారతాయి. కాని విమర్శశక్తి శివాదిక్షితి పర్యంతము వికారము పొందుతున్నదని అమృతానందులవారు తమదీపికా వ్యాఖ్యలో వ్రాశారు.

అయితే విమర్శశక్తి ప్రకాశ శక్తితో అనుమోదము పొందినప్పుడు విశ్వమును ద్రవించు చున్నదని భాస్కర రాయల వారు తమ సేతుబంధనములో వ్రాశారు. అనుమోదము - అనగా సమ్మతము, సంతోషము అని అర్థం. గడ్డ కట్టుకుని ముద్దగా ఉన్న పదార్థమందలి శిధిలమైన బాణాలను విస్తరింపజేయు సంహారకాలమున, విమర్శ శక్తి యందు బీజ రూపముగా ఉన్న విశ్వము (గడ్డ కట్టుకుని ఉన్న శిధిల భాగము) వమనము (కక్కుట) చేయుట చేత విస్తరించ బడుతుంది.

## త్రిఖండముద్రా స్వరూపము

*ముద్రాఖ్యా సాయదా సంవి దంబికాత్రికలామయీ* **57**

*త్రిఖండా రూపమాపన్నా సదాసన్నిధి కారిణీ*

*సర్వస్య చక్ర రాజస్య వ్యాపికా పరికీర్తితా ॥* **58**

క్రియాశక్తి కన్న వేరు కానట్టిది, జ్ఞాన స్వరూపిణి అయిన త్రిపురసుందరి మూడు కళలతో కూడినది. సృష్టి ప్రారంభంలో వామ, జ్యేష్టా రౌద్రీల సమిష్టి రూపమైన అంబిక గాను, ఇచ్ఛా జ్ఞాన క్రియాశక్తుల సమిష్టి రూపమైన శాంతగాను, మొదట ఆవిర్భవించుచున్నది. అప్పుడు పరమేశ్వరి త్రిఖండా రూపము పొందుచున్నది. విమర్శశక్తి శివాది క్షితి పర్యంతమైన విశ్వ రూపంతో విహరించదలచినప్పుడు క్రియాశక్తిగా మారి, తన యొక్క వికారమే అయిన విశ్వము యొక్క పరచిదానంద లక్షణమైన మోదనము చేత, ఆ సంబంధమైన ఏకరస లక్షణము చేత, అనగా ద్రావణము చేత ముద్రా అని పేరు పొందుచున్నది.

కుడిచేతి వ్రేళ్ళు వామా జ్యేష్ఠా రౌద్రీ శక్తులు. ఎడమ చేతివ్రేళ్ళు ఇచ్ఛా జ్ఞాన క్రియా శక్తులు. ఈ రెండు చేతుల వ్రేళ్ళూ మూడు ఖండాలుగా కలియటమే త్రిఖండాముద్ర అనబడుతుంది. వీటిలో

| | | |
|---|---|---|
| ప్రథమ ఖండము | - | చిటికెన వ్రేళ్ళు రెండూ కలపటము |
| ద్వితీయ ఖండము | - | ఎడమ చేతి చూపుడు వ్రేలును కుడి చేతి మధ్యవేలు, ఎడమచేతి మధ్యవేలును కుడిచేతి ఉంగరపు వ్రేలు, ఎడమ చేతి ఉంగరపు వ్రేలును కుడిచేతి చూపుడు వ్రేలు తాకాలి. |
| తృతీయ ఖండము | - | బొటన వ్రేళ్ళు రెండూ కలపటము. |

ఇది త్రిపురసుందరి రూపము. త్రిపురసుందరి చక్రమంతా వ్యాపించి ఉంటుంది. కాబట్టి ఈ ముద్ర ఆ దేవి సన్నిధి కలుగుచేస్తుంది. ఈ ముద్ర అన్ని చక్రములందు వ్యాపించి ఉన్నది. కాబట్టి బిందువులో ఉన్న త్రిపుర సుందరితో పాటుగా అన్ని ఆవరణల దేవతలను ఆహ్వానించటానికి త్రిఖండా ముద్ర ఉపయోగపడుతుంది.

## సర్వ సంక్షోభిణీముద్ర (భూపురము)

*యోని ప్రాచుర్యత: సైషా సర్వ సంక్షోభికా పున:*
*వామాశక్తి ప్రధానేయం ద్వార చక్రే స్థితాభవేత్* 59

క్రియాశక్తి అయిన త్రిపుర సుందరీ దేవి అనేక యోనులుగా - మానవ, పశు, పక్షి, క్రిమికీటకాదులలో జరుగుతున్న సృష్టిగా మారి, త్రిఖండా భావము వదలి సర్వ సంక్షోభిణీముద్రా రూపము పొందుతున్నది. ఈ ముద్రా శక్తి శ్రీచక్రంలోని భూపురాన్ని పాలిస్తున్నది. అసలు సృష్టి అనేదే సంక్షోభము. ఈ ముద్రలో వామాశక్తి ప్రధానమైనది. వామాశక్తి అనేది. ఇచ్ఛాశక్తికి ఉప లక్షణము. అనగా - ఇచ్ఛాశక్తికి బదులుగా వామాశక్తి గ్రహించబడినది. ఈ శక్తి మూడు చతురస్రములు, నాలుగు ద్వారములు గలిగిన భూపురము అనబడే త్రైలోక్య మోహన చక్రాన్ని పాలిస్తున్నది.

**ముద్రా రూపము:** ఒక్కొక్క అంగుష్ట మందు కనిష్టికా, మధ్యమల కొనలను కలుపుట చేత ఒక్కొక్క చేతియందు మూడు యోనులు చొప్పున ఏర్పడతాయి. ఈ రకంగా రెండు చేతుల యందు కలిసి ఆరు యోనులు ఉంటాయి. కాగా రెండు చేతుల తర్జనులను పైకి చూపిస్తూ మిగిలిన వ్రేళ్ళను అంగుష్ఠము పై పెట్టి రెండు అంగుష్టములను చేర్చి పట్టుకోవాలి. అని తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు గారు వ్రాశారు.

## సర్వ విద్రావిణీ ముద్ర (షోడశ దళము)

*క్షుబ్ధ విశ్వస్థితి కరీ జ్యేష్ఠా ప్రాచుర్యమాశ్రితా ।*
*స్థూలనాద కలారూపా సర్వానుగ్రహకారిణీ ॥* 60
*సర్వాశా పూరణాఖ్యేతు సైషా స్ఫురితవిగ్రహా*

సృష్టించబడిన జగత్తుకు స్థితి కలిగించేది విమర్శాంశ. అందుచేతనే ఇక్కడ జ్యేష్ఠా శక్తి ఉంటుంది. జ్ఞానశక్తి జ్యేష్ఠాశక్తి ఉపలక్షణము. అంటే జ్ఞానశక్తికి బదులుగా జ్యేష్ఠా శక్తిని చెప్పవచ్చును. జ్ఞానాశక్తి ప్రకాశాంశ భావముకాదు. విమర్శాంశ భావము. పై శ్లోకంలో తర్జనులను వంకర లేకుండా ఉంచి మిగిలిన వ్రేళ్ళను వంచినందున అది వామాశక్తి సవ ూాస్మెంది. కానీ ఇక్కడ సర్వ విద్రావిణీము ద్ర లో నాలుగు వ్రేళ్ళ ఋజుత్వము (వంకర లేకుండు ) వలన మిగిలిన వ్రేళ్ళు ఎక్కువగా లిసి ఉన్నప్పటికీ అది జ్యేష్ఠా శక్తి సమూహమవుతున్నది. సృష్టికి వక్రత్వముస్థితికి ఋజుత్వము సంప్రదాయ సిద్ధము. అకారాది పదహారు స్వరముల రూపము గలది, అన్ని కోరికలు తీర్చే, సర్వానుగ్రహకారిణి, క్రియాశక్తి కన్నవేరుకానిది అయిన త్రిపురసుందరి సర్వ ణి రూ ము పొంది అనుగ్రహించుచు సర్వాశాపరిపూరక చక్రమనే షోడశ దళమందు ప్రకాశించుచున్నది.

**ముద్రా రూపము :** ఋజువుగా ఉండు మధ్యమా తర్జనీలతో కలసి కనిష్ఠికలు, అనామికలు అంగుష్ఠములు కలిపితే ఈ ముద్ర ఏర్పడుతుంది.

## సర్వాకర్షిణీముద్ర (అష్టదళము)

*జ్యేష్ఠావామా సమత్వేన సృష్టేః ప్రాధాన్యమాశ్రితా ॥* *61*

*ఆకర్షిణీతుముద్రేయం సర్వసంక్షభణే ...తా ।*

సృష్టి రూపము వామాశక్తి స్థితి రూపము జ్యేష్ఠాశక్తి. ఈ రెండిటికీ సామాన్యమైనది సర్వాకర్షిణి ముద్ర. వామాశక్తి అంశచేత వంచబడిన తర్జనీ, మధ్యములు, జ్యేష్ఠాశక్తి అంశచేత నిటారుగా ఉన్న అనామికా, కనిష్ఠికలు. వీటన్నిటికీ పైన వంచబడిన అంగుష్టము గలది.

## సర్వవశంకరీ ముద్ర (...)

*వ్యోమద్వయాంతరాళస్థం బిందురూపామహేశ్వరీ ॥* *62*

*శివశక్త్యాత్మ సంశ్లేషాద్ధి వ శేశకరీ స్మృతా ।*

*చతుర్దశార చక్రస్థా సంవిదా వ విగ్రహా ॥* *63*

**ఆకాశములు రెండు :** 1) చిదాకాశము - సహస్రారానికి పై భాగాన ఉండేది. 2) భూతాకాశము - సహస్రారమున గలది. ఈ రెండిటిక మధ్యన బ్రహ్మ రంధ్రమందు ...డి...

బిందుస్థానము (బిందువు) ఉన్నది. పూజచేసేటప్పుడు భూతశుద్ధి చెయ్యాలి. ఆ రకంగా భూతశుద్ధి చేసేటప్పుడు బ్రహ్మరంధ్ర పర్యంతము ఆకాశము యొక్క, బ్రహ్మ రంధ్రము పైన చిదాకాశము యొక్క భావన చెయ్యాలి. ఆ రెండింటికీ మధ్యగల బ్రహ్మ రంధ్రం దగ్గర, బిందుస్థానంలో శివశక్తులు కలిసి ఉండటం చేత ఆనంద స్వరూపులవుతున్నారు. ఇక్కడ క్రియాశక్తి కన్న వేరుకానటువంటి త్రిపురసుందరి ప్రకాశిస్తూ సర్వ వశంకరీ ముద్రారూపంతో ఉండి సర్వ సౌభాగ్య దాయక చక్రమైన చతుర్దశారమును పరిపాలిస్తూ ఉంటుంది. ఈ ముద్రలో వామ, జ్యేష్ఠ శక్తులు ప్రధానంగా ఉంటారు.

## సర్వోన్మాదినీ ముద్ర (బహిర్దశారము)

*బింద్వంతరాళ విలసత్సూక్ష్మ రేఖాశిఖామయీ ।*
*జ్యేష్ఠాశక్తి ప్రధానాతు సర్వోన్మాదన కారిణీ ॥* **64**
*దశార చక్రమాస్థాయ సంస్థితావీరవందితే ॥*

మూలాధారంలో ఒక త్రికోణం ఉన్నది. అలాగే బ్రహ్మరంధ్రంలో ఒక త్రికోణం ఉన్నది. ఈ రెండు త్రికోణాలలోనూ రెండు బిందువులున్నాయి. మూలాధారంలో ఉన్నది స్వయంభూలింగము. బ్రహ్మరంధ్రంలో ఉన్నది పరాలింగము. ఈ రెండింటి లోపల నుండి బిసతంతువు - తామర తూడులోని సన్నని దారము వంటి రేఖ ఉంటుంది. ఈ రేఖ యొక్క శిఖ అంబికా, వాంతా శక్తులతో కలసి ఉండి, జ్యేష్ఠ శక్తితో మిక్కుటమైనదై సర్వోన్మాదిని అవుతున్నది. ఇది అందరినీ ఉన్మత్తులను చేస్తుంది. అంటే అన్ని పనులు వదిలి పరాన్ముఖులై శివశక్తుల సామరస్యాను సంధాన పరులయ్యేటట్లు చేస్తుంది.

మూలాధారం దగ్గర నుండి, బ్రహ్మరంధ్రం చివరి దాకా అంటే సుషుమ్నా నాడి జ్యేష్ఠ శక్తి ప్రధానమైనది. అందుకనే ఋజువుగా ఉంచిన అనామిక, తర్జనీల జంటల చేత నిర్దేశింపబడినదేవతయే సర్వోన్మాదినీ ముద్ర. ఉన్మాదము అంటే తమ తమ పనులు వదలి పెట్టి, అంతర్ముఖులై ఉండటము అని అర్థము-సర్వార్థ సాధక చక్రమనబడు బహిర్దశారమును ఈముద్రాశక్తి పాలిస్తున్నది.

## సర్వ మహాంకుశ ముద్ర (అంతర్దశారము)

వామాశక్తి ప్రధానాతు మహాంకుశమయీ పున: 65

తద్వద్విశ్వం వమంతీ సా ద్వితీయేతు దశారకే ।

సంస్థితా మోదన పరాముద్రా రూపత్వ మాస్థితా ॥ 66

విశ్వమును వమనము చేయు (బయటకు కక్కు) క్రియాశక్తి కన్నా వేరుకానట్టి సంవిత్తే సర్వ మహాంకుశముద్రా రూపము పొంది సర్వరక్షాకర చక్రమైన అంతర్దశారమును పాలించుచున్నది.

## సర్వ ఖేచరీ ముద్ర (అష్ట కోణము)

ధర్మా ధర్మస్య సంఘట్టా దుత్థితావిత్తి రూపిణీ ।

వికల్పోత్థ క్రియాలోప రూపదోషవిఘాతినీ ॥ 67

వికల్ప రూప రోగాణాం హారిణీ ఖేచరీపరా ।

సర్వరోగ హరాఖ్యేతు చక్రే సంవిన్మయీ స్థితా ॥ 68

సృష్టి స్థితి లయాలన్నీ కొన్ని ధర్మాలకు లోబడి ఉంటాయి. కాబట్టి వాటిని నిర్వహించే శక్తి ధర్మము అని చెప్పబడుతుంది. పరమేశ్వరుడు సృష్టి స్థితి లయాలకు అతీతుడు. అందుకనే అతడికి ఏ ధర్మాలూ లేవు. అతడు అధర్ముడు.

ఈ విధంగా చూసినట్లైతే ధర్మము శక్తి, అధర్మము శివుడు. ధర్మా ధర్మాల సమ్మేళనమే. సామరస్యము. ఈ సామరస్యము నుండి ఉద్భవించినదే సంవిద్రూపిణి; జ్ఞాన రూపిణి. అటువంటి పరమేశ్వరి గురువు యొక్క అనుగ్రహము వల్ల మాత్రమే పొందదగినది. తంత్రములు సాధన చెయ్యటం వల్లనే లభ్యమవుతుంది. అందుకనే పరమేశ్వరి సంశయాలను, విద్యుక్త ధర్మాలలోని లోపాలను, అశ్రద్ధ, అనాదరము, వేదపండితుల అనుచిత ప్రవర్తన, మొదలైన పాపములను పోగొడుతుంది. కౌళాచారమునందు ఉన్నటువంటి దోషాలన్నింటినీ ఆమె పోగొడుతుంది. సమయాచారంలో ఉండే లోపాలను ఆవరణ దేవతలు సరిచేస్తారు. క్రియాశక్తి స్వరూపిణి, చిద్రూపిణి అయిన పరమేశ్వరి ఖేచరీముద్రా రూపిణి అయి సర్వరోగహర చక్రమని పిలవబడే అష్టకోణాన్ని పాలిస్తున్నది. ఈ ముద్ర శివశక్తుల యొక్క సంయుక్త రూపము, వామా జ్యేష్ఠా శక్తులు ప్రధానముగా గలది.

## సర్వ బీజ ముద్ర (త్రికోణము)

**శివశక్తి సమాశ్లేష స్ఫుర ద్వ్యోమాంతరేపునః**
**ప్రకాశయతీ విశ్వం సా సూక్ష్మ రూప స్థితం సదా ॥** 69
**బీజరూపా మహాముద్రా సర్వసిద్ధి మయేస్థితా ।**

విత్తనం చాలా చిన్నగా ఉంటుంది. కానీ అందులో మహా వృక్షము దాగి ఉంటుంది. అలాగే శివశక్తుల కలయిక వల్ల ప్రకాశమాన గర్భమందు సూక్ష్మ రూపంలో ఉన్న విశ్వము ప్రకాశించుచున్నది. జ్ఞాన రూపము మొదట భావ వికారముగా ప్రకాశిస్తుంది. క్రియాశక్తి కన్న వేరు కానటువంటి సంవిత్తే బీజరూపమైన ఈ మహాముద్రగా సర్వసిద్ధి ప్రద చక్రమైన త్రికోణమందున్నది.

## సర్వ యోని ముద్ర (బిందువు)

**సంపూర్ణ స్వప్రకాశ స్వలాభ భూమిరియంవపుః ॥** 70
**సంపూర్ణస్య ప్రకాశస్య లాభభూమి రియంపునః ।**
**యోనిముద్రా కలారూపా సర్వానందమయేస్థితా ।**

గతంలో కామకళను గురించి చెప్పేటప్పుడు, హార్ధకళను కూడా వివరించటం జరిగింది. శివశక్తుల సామరస్యము కలిగి, పరమానందమయమైన పరబ్రహ్మను ఉపాసించే స్థానమే బిందువు. సర్వానందమయ చక్రమైన బిందుస్థానమందు యోనిముద్రా శక్తి పరిపాలిస్తున్నది.

**గమనిక:** ముద్రలు భిన్న సంప్రదాయాలలో చెప్పబడుతున్నట్లుగా తెలుస్తోంది. కాబట్టి సాధకులు గురు సంప్రదాయాన్ననుసరించి ముద్రలు తెలుసుకోవటము ఉత్తమము.

## చైతన్య...త్త

**క్రియా చైతన్య రూపత్వా దేవం చక్రమయం స్థితం ॥** 71
**ఇచ్ఛా రూపం పరం తేజః సర్వదా భావయేద్బుధః ।**

క్రియాశక్తి జడరూపంగా ఉండి చైతన్యానికీ, ఉత్పత్తికి కారణమవుతున్నది. ఆనందానుభవం లేకుండా చైతన్యోత్పత్తి కలగదు. అందుకని ఆనందానుభవం వలన కలిగిన

చైతన్య ఉత్పత్తికి కారణమైన క్రియాశక్తి హార్దకళా రూపము పొందుతున్నది. పరాశక్తి తనను తాను చూచుకొనినప్పుడు సృష్టి జరుగుతుంది. పరమేశ్వరి యొక్క ఇచ్ఛతోనే మొత్తము చక్రము (సృష్టి) ఉత్పత్తి జరుగుతోంది. అందుకే ఆవిడ ఇచ్ఛా స్వరూపిణి. ఆవిడే త్రిపుర సుందరి. సాధకులు సర్వకాల సర్వావస్థలలోనూ ఆమెనే ధ్యానించాలి. అయితే సాధకులు అష్టపాశాలతో బంధించబడి ఉంటారు. అష్టపాశములు అంటే

| | | | |
|---|---|---|---|
| 1. | ఘృణా | - | నింద |
| 2. | శంకా | - | అనుమానము |
| 3. | భయం | - | భయము |
| 4. | లజ్జా | - | సిగ్గు |
| 5. | జుగుప్స | - | అసహ్యత |
| 6. | కులం | - | బ్రాహ్మణ్యాకులము |
| 7. | శీలం | - | శీలము |
| 8. | వృత్తం | - | నడవడి |

వీటివలన సంకుచిత భావము, అహంభావములతో కూడి అజ్ఞానులుగా ఉంటారు. ఈ పాశబంధనాలు వదలించుకున్నవారికి ఈ జగత్తు అంతా పరమేశ్వరీ మయమే. శ్రీచక్రంగా పరిణమించిన ఆ పరదేవతయే త్రిపుర సుందరి అనే భావాన్ని సర్వదా గుర్తుంచుకోవాలి.

## చక్ర సంకేతము

*త్రిధా చ నవధాచైవ చక్ర సంకేతకః పునః* 72

చక్ర సంకేతాన్ని మూడు రకాలుగాను, తొమ్మిది రకాలుగాను, మళ్ళీ ఇంకొక విధంగాను చెబుతున్నారు.

**వహ్నినైకేన శక్తిభ్యాం ద్వాభ్యాం చైకోఽ పరః పునః**
**తైశ్చవహ్నిత్రయేణాపి శక్తీనాం త్రితయేన చ** 73
**పద్మద్వయేన చాన్యస్స్యాద్ భూగృహ త్రితయేనచ ।**

పైన ఉన్నటువంటి త్రికోణము, దాని క్రింద ఉండే రెండు శక్తి కోణముల కలయిక వల్ల ఒక చక్ర సంకేతము ఏర్పడుతున్న ది. త్రయోని చక్రము. అంటే త్రికోణంలో మూడు,

అష్ట కోణంలో ఎనిమిది మొత్తం పదకొండు కోణాలుంటాయి. కాని శ్రీచక్రాన్నిగీసేటప్పుడు త్రికోణంలోని రెండు కోణాలు అష్టకోణంలో కలిసిపోవటం వల్ల తొమ్మిది కోణాలు మాత్రమే కనిపిస్తాయి. ఇదే నవయోని చక్రము.

బిందువు, ఐదు కోణములు, రెండు పద్మములు, భూపురము మొత్తము కలిసి ఒక చక్ర సంకేతము.

శ్రీచక్రంలో క్రిందివైపుకు ఉండే ఐదు కోణాలు, పై వైపుకు ఉండే నాలుగు కోణాలు వెరసి తొమ్మిది కోణాలు ఒక చక్ర సంకేతము.

## పూర్ణచక్ర భావన

**పంచశక్తి చతుర్వహ్ని పద్మద్వయ మహీత్రయం** *74*

**పరిపూర్ణం మహాచక్రం తత్ప్రకారః ప్రదర్శ్యతే ।**

శ్రీచక్రంలో ఐదు శక్తి చక్రాలు, నాలుగు శివచక్రాలు ఉంటాయి. వీటిలో

| **శక్తి చక్రాలు** | **శివచక్రాలు** |
|---|---|
| 1. త్రికోణము | 1. బిందువు |
| 2. అష్టకోణము | 2. అష్ట దళము |
| 3. అంతర్దశారము | 3. షోడశ దళము |
| 4. బహిర్దశారము | 4. భూపురము |
| 5. చతుర్దశారము | |

## శ్రీచక్రము - సృష్టి స్థితి సంహారాలు

**తత్రాద్యం నవయోని స్యాత్తేన ద్విదశ సంయుతం ॥** *75*

**మనుయోని పరం విద్యాత్తృతీయం తదనంతరమ్ ।**

**అష్ట ద్వ్యష్ట దళోపేతం చతురస్త్రత్రయాన్వితం ॥** *76*

**చక్రస్య త్రిప్రకారత్వం కథితం పరమేశ్వరీ ।**

ఇక్కడ శ్రీ చక్రము మూడు ప్రకారములుగా చెప్పబడింది.

1. బిందువుతో కూడిన నవయోని చక్రము.

2. బిందువు, నవయోని, అంతర్దశారము, బహిర్దశారము, చతుర్దశారము.

3. బిందువు, నవయోని, అంతర్దశారము, బహిర్దశారము, చతుర్దశారము, అష్టదళ, షోడశీదళ, భూపురములతో కలిసిన పూర్తిచక్రము.

శ్రీచక్రములో చివరి మూడు ఆవరణలు అంటే భూపురము, షోడశదళము, అష్ట దళము కలిసి సృష్టిచక్రము. ఇంకా చెప్పాలంటే

| | | |
|---|---|---|
| భూపురము | - | సృష్టి సృష్టి |
| షోడశ దళము | - | సృష్టి స్థితి |
| అష్టదళము | - | సృష్టి సంహారము |

శ్రీచక్రం మధ్యలో ఉన్నటువంటి చతుర్దశారము, దశార ద్వయములు రెండు కలిసి స్థితి చక్రము. వాటిలో

| | | |
|---|---|---|
| చతుర్దశారము | - | స్థితి సృష్టి |
| బహిర్ద శారము | - | స్థితి స్థితి |
| అంతర్దశారము | - | స్థితి సంహారము |

శ్రీచక్రంలోని మొదటి మూడు చక్రాలు అంటే బిందువు, త్రికోణము, అష్టకోణము అనేవి సంహార చక్రము. వీటిలో

| | | |
|---|---|---|
| అష్టకోణము | - | సంహార సృష్టి |
| త్రికోణము | - | సంహార స్థితి |
| బిందువు | - | సంహార సంహారము |

ఈ విధంగా శ్రీ చక్రంలో సృష్టి స్థితి సంహారాలున్నాయి.

## ఆవరణ పూజ

సృష్ట్యా న్నవయోన్యాది పృథ్వ్యన్తం సంహృతిః పునః ॥ 77

పృథ్వ్యాదినవయోన్యంతమితి శాస్త్రస్య నిర్ణయః ॥

నవయోని చక్రము అనటంచేత బిందు చక్రము సూచించబడుతున్నది. బిందువు నుండి భూపురం వరకు చేసే పూజ సృష్టి క్రమము. భూపురము నుండి బిందువు వరకు

చేసే పూజ సంహార క్రమము. శ్రీచక్రార్చన చేసేటప్పుడు సృష్టి క్రమంలోగాని, సంహార క్రమంలోగాని ఏరకంగానైనా వెయ్యవచ్చు.

కొన్ని సంప్రదాయాలల్లో సృష్టి, సంహారము రెండు రకాల పూజలు చేస్తారు. కాని కొన్ని చోట్ల మాత్రం కేవలం ఒక పూజ మాత్రమే చెయ్యటం జరుగుతోంది. ఇది కేవలం వాళ్ళ సంప్రదాయం. అయితే శ్రీ చక్రం మధ్య నుంచి పూజించటం అనేది మాత్రం లేదు.

**చక్రమిష్టి చక్ర స్వరూపము**

***యత్తత్సమిష్టి రూపంతు త్రిపురా చక్రముచ్యతే ॥*** 78

***యస్య విజ్ఞానమాత్రేణ త్రిపురా జ్ఞానవాన్భవేత్ ।***
***చక్ర స్యనవధాత్వం చ కథయిష్యామి తవప్రియే ॥*** 79

సృష్టిస్థితి సంహారముల యొక్క సమిష్టి రూపమైన శ్రీ చక్రము పరమేశ్వరీ స్వరూపము. శ్రీచక్రాన్ని గురించి గనక పూర్తిగా తెలుసుకున్నట్లైతే, ఆ త్రిపుర సుందరిని గురించి తెలుసుకున్నట్లే పరమేశ్వరి తత్వాన్ని తెలుసుకోవటం కష్టమైన పని కాబట్టి శ్రీ చక్రాన్ని గురించి తెలుసుకుంటే అంతా తెలుసుకున్నట్లే కాబట్టి ఓపరమేశ్వరీ। శ్రీ చక్రములోని నవవిధ చక్రాల గురించి నీకు వివరిస్తున్నాను.

**శ్రీచక్రంలోని తొమ్మిది చక్రాలు**

**ఆదిమం భూత్రయం చక్రస్యా ద్వితీయం షోడశారకం ।**
**అన్యదష్టలం ప్రోక్తం మనుకోణ మనంతరం ॥** 80

**పంచమం దశకోణం స్యాత్ షష్టం చాపి దశారకం ।**
**సప్తమం వసుకోణం స్యాన్మధ్య త్ర్యస్త్ర మధాష్టమం** 81

**నవమం త్ర్యస్త్రమధ్యం స్యాత్ తేషాం నామాన్యతః ॥**

1. భూపురము 2. షోడశదళము 3. అష్టదళము
4. చతుర్దశారము 5. బహిర్దశారము 6. అంతర్దశారము
7. అష్ట కోణము 8. త్రికోణము 9. బిందువు

## చక్రముల పేర్లు

*త్రైలోక్య మోహనం చక్రం సర్వాశాపరి పూరకం ॥* **82**

*సర్వసంక్షోభణం గౌరి సర్వసౌభాగ్య దాయకం ।*

*సర్వార్థ సాధకం చక్రం సర్వ రక్షాకరం పరం ॥* **83**

*సర్వరోగహరం దేవి సర్వసిద్ధిమయం తథా ।*

*సర్వానందమయం చాపి నవమంశృణు సుందరి ॥* **84**

1. **భూపురము :** దీన్ని త్రైలోక్య మోహన చక్రము అంటారు. ఇది మూడు లోకాలకూ ప్రతీక. వాటి మోహనము లేక నిరోధమే త్రైలోక్య మోహనము.

2. **షోడశదళము :** దీన్ని సర్వాశా పరిపూరక చక్రము అంటే అర్థము మొదలైన విషయవాంఛలయందు గల ఆసక్తులను పూర్తి చేయునది.

3. **అష్టదళము :** దీన్ని సర్వ సంక్షోభణ చక్రం అంటారు.

4. **చతుర్దశారము :** దీన్ని సర్వ సౌభాగ్యదాయక చక్రం అంటారు. దీన్ని పూజిస్తే అన్ని సౌభాగ్యాలు కలుగుతాయి.

5. **బహిర్దశారము :** ఇది సర్వార్థ సాధక చక్రము. సర్వవైదిక, తాంత్రిక, క్రియల యొక్క ప్రయోజనమైన పరమశివ ప్రాప్తిని కలుగచేస్తుంది.

6. **అంతర్దశారము :** సర్వ రక్షాకర చక్రము. అన్ని ప్రతికూల పదార్థాల నుండి రక్షను కలుగచేయునది. తానే శివుడనే భావన కలుగచేయునది.

7. **అష్ట కోణము :** సర్వ రోగహార చక్రము. ముప్పై ఆరు తత్త్వాల భావనే రోగము. భగవంతుడు వేరు. తాను వేరు అనే భావన పెద్ద రోగము. అటువంటి రోగాలు హరించేది.

8. **త్రికోణము :** సర్వసిద్ధిప్రద చక్రము. సృష్టి స్థితి లయాలకు ప్రతీక.

9. **బిందువు :** సర్వానందమయ చక్రము. శివశక్తుల సామరస్యమే ఆనందదాయకము. అందుకే ఇది సర్వానందమయ చక్రము.

## పరదేవత

*అత్రపూజ్యా మహాదేవీ మహాత్రిపుర సుందరీ ।*

శ్రీచక్రమందలి వివిధ వివిధ ఆవరణలలో ఉన్న దేవతలందరికన్నా గొప్పదైనటువంటి పరాశక్తి అయిన త్రిపుర సుందరి పరమశివునితో కలిసి ఉంటుంది. అటువంటి త్రిపుర సుందరిని ఆవరణ దేవతలతో పాటుగా శ్రీచక్రంలో అర్చించాలి.

## శ్రీచక్ర పూజాఫలం

*పరిపూర్ణం మహాచక్ర మజరామరకారకం ॥* 85

*ఏవమేవ మహాచక్ర సంకేతః పరమేశ్వరి ।*

*కథితస్త్రిపురా దేవ్యా జీవన్ముక్తి ప్రవర్తకః ॥* 86

ఈ రకంగా శ్రీచక్రము పైన చెప్పబడిన ఆవరణలు, వివిధ లక్షణములు కలిగి ఉన్నది. ఇది శివ శక్తుల విహార స్థానము. అటువంటి విషయాలు చెప్పబడ్డాయి కాబట్టే దీన్ని చక్ర సంకేతము అన్నారు. శ్రీచక్రాన్ని పూజించి అష్ట పాశములను నివృత్తి చేసుకున్న సాధకుడు జీవన్ముక్తుడౌతాడు.



# 2. మంత్ర సంకేతము

## ఉపోద్ఘాతము

*మంత్ర సంకేతకం దివ్యమధునా కథయామి తే ।*
*యద్వేత్తా త్రిపురాకారో వీరచక్రేశ్వరో భవేత్ ॥* **1**

ఇంతవరకూ 86 శ్లోకములలో చక్ర సంకేతము చెప్పి ఇప్పుడు భైరవుడు భైరవికి మంత్ర సంకేతమును వివరిస్తున్నాడు. ఓ భైరవీ ! మంత్ర సంకేతము తెలిసి ఆ పరమేశ్వరిని పూజించ వలసి ఉన్నది. కాబట్టి మంచి లక్షణాలు గలిగిన నీకు ఆ మంత్ర సంకేతాన్ని వివరిస్తున్నాను.

ఈ విషయాలు ఎవరైతే తెలుసుకోగలుగుతాడో వారు త్రిపురసుందరీ ఆ కారులు అవు తున్నారు. తనకు కలిగిన ఆత్మ-జ్ఞానము చేత ఆ పరదేవత యొక్క రూపాన్ని తెలుసుకోగలుగు తున్నాడు. శ్రీవిద్యోపాసుకులను వీరులు అంటారు. పరదేవతారూపము తెలుసుకున్నవాడు అటువంటి వీరులలో శ్రేష్టుడౌతున్నాడు. ఇదే విషయం లలితా సహస్రంలో 'వీరారాధ్యా, వీర వంద్యా' అని చెప్పబడింది. అటువంటి వాడు పరశివమయమైన సద్గురు రూపము పొందిన వాడౌతున్నాడు.

## నవచక్రేశ్వరీ మంత్రములు

*కరశుద్ధికరీ త్వాద్యా ద్వితీయా చాత్మరక్షికా ।*
*ఆత్మాసనగతా దేవీ తృతీయా తదనన్తరం ॥* **2**

*చక్రాసన గతా, పశ్చాత్సర్వ మంత్రాసనస్థితా ।*
*సాధ్య సిద్ధాసనా షష్ఠీ మాయా లక్ష్మీమయీపరా ॥* **3**

*మూర్తి విద్యా చ సా దేవీ, సప్తమీ పరికీర్తితా ।*
*అష్టమ్యావాహినీ విద్యా, నవమీ భైరవీపరా ॥* **4**

*మూలవిద్యా తథా ఖ్యాతా త్రైలోక్య వశకారిణీ ।*

నవచక్రేశ్వరీ మంత్రాలు ఇక్కడ చెప్పబడుతున్నాయి.

**1. ప్రథమ చక్రేశ్వరీ విద్య :** దీన్ని కరశుద్ధ విద్య అంటారు. అంటే ప్రథమ చక్రమైన త్రైలోక్యమోహన చక్రము కర్మేంద్రియాలనూ శుద్ధి చేస్తుంది. అక్షరాలలోని మొదటి రెండవ అక్షరములు బిందు సంయుతములై, బాలా మంత్రంలోని మూడవ బీజంతో కలిసి ఇక్కడ చెప్పబడతాయి. అం ఆం సౌః.

**త్రైలోక్య మోహన చక్రాయనమః**

**2. ద్వితీయ చక్రేశ్వరీ విద్య:** ఇది ఆత్మ రక్షా కరము. సర్వాశా పరిపూరక చక్రమనబడే ఈ చక్రము పరదేవతకూ, ప్రపంచానికీ భేదాన్ని సూచిస్తూ తాను పరదేవత అనే భావంతో ఈ జగత్తును రక్షిస్తుంది. అందుకే ఇది ఆత్మరక్షాకరమని చెప్పబడింది. ఇది బాలా త్రిపురసుందరి యొక్క ప్రత్యక్ష రూపము.

**ఐం క్లీం సౌం:**

**3. తృతీయ చక్రేశ్వరీ విద్య :** ఇది సర్వ సంక్షోభణ చక్రము. ఆత్మాసనగతమైనది. అంటే తనకు చక్రమంత్ర దేవతా ఐక్యాను సంధాన లక్షణమును ఆసనముగా చేసుకుని తనుకూడా స్వయంగా ఆ యొక్క ఐక్యాను సంధానము పొందుతున్నది. దీనిలో మూడు బీజముల మంత్రమైన బాలా మంత్రంలోని మొదటి బీజాన్ని తీసివేసి ఆ స్థానంలో మాయా బీజము చేర్చటం జరుగుతున్నది.

**హ్రీం క్లీం సౌః.**

**4. చతుర్థ చక్రేశ్వరీ విద్య:** ఇది సర్వ సౌభాగ్యదాయక చక్రము. సర్వ సౌభాగ్యములను ఇచ్చేది. ఇది బాల్యాత్ర్యక్షరీ మంత్రంలోని (ఐం క్లీం సౌః) ప్రతి బీజానికీ హకారము చేర్చటం వల్ల ఏర్పడుతుంది.

**హైం, హ్క్లీం, హ్సౌః**

**5. పంచమ చక్రేశ్వరీ విద్య :** ఇది సర్వార్థ సాధక చక్రము. సర్వ మంత్రాసనమైనది. అంటే అందరు ఆవరణ దేవతల యొక్క మంత్రాలను ఆసనముగా గలది. ఈ దేవత ఆత్మాను సంధానము కలుగ జేస్తుంది. బాలాత్ర్యక్షరీ మంత్రానికి హకార సకారములు చేర్చటం వల్ల ఈ విద్య ఏర్పడుతుంది.

**హ్సైం, హ్స్క్లీం, హ్సౌః**

**6. షష్ఠ చక్రేశ్వరీ విద్య:** ఇది సర్వ రక్షా కర చక్రము. సాధ్య సిద్ధాసన. ఆ పరమేశ్వరి యొక్క ప్రకాశవంతమైన కిరణములవంటి రూపము కలిగి, సృష్టి క్రమంలో ఉన్న ఆవరణ దేవతలందరూ సాధ్యులే. వీరు తమ ఆత్మతో లీనమయినప్పుడు సిద్ధులవుతారు. వీరు మొదట సాధ్యులు, ఆ తరువాత సిద్ధులు. వీరియొక్క ఆసనానికి తమ ఆత్మచే అనుసంధానము చేస్తారు. ఇక్కడ మాయా బీజమైన హ్రీం, కామ రాజ బీజమైన క్లీం, బ్లేం బీజముతో కూడిన బాలాత్ర్యక్షరీ మంత్రము చెప్పబడింది.

హ్రీం క్లీం బ్లేం.

**7. సప్త చక్రేశ్వరీ విద్య:** ఇది సర్వ రోగహర చక్రము. ఇది మాయా లక్ష్మీ పరాబీజములతో కూడి ఉన్నది. హ్రీం శ్రీం సౌః. ఇది మూర్తి విద్య. సర్వ దేవతలనూ ఆవాహన చేసేటప్పుడు మూర్తి కల్పనకు ఇది ఉపయోగపడుతుంది. ఇది బ్రహ్మవిద్య.

**8. అష్టమ చక్రేశ్వరీ విద్య :** ఇది సర్వ సిద్ధిప్రద చక్రము. ఇది ఆవాహనీ విద్య. అంటే అందరు దేవతలనూ ఆహ్వానించేటప్పుడు ఈ విద్యను ఉపయోగిస్తారు. ఇందులో బాలా మంత్రాని హకార, రకార, సకారములు కలిపితే ఈ మంత్రము వస్తుంది.

హ్స్రైం హ్స్రీం, హ్స్రౌః

**9. నవమ చక్రేశ్వరీ విద్య:** ఇది సర్వానందమయ చక్రము. ఇక్కడ పరదేవత ఉంటుంది. అంటే సృష్టి, స్థితి, సంహార కారణము వలన భైరవీ అనబడుతున్నది. మూర్తి విద్య మాదిరిగానే భైరవీ విద్యకు కూడా ఉద్ధారము ఎక్కడా చెప్పలేదు. సృష్టి స్థితి సంహారాలలో మూడు లోకాలూ స్వాధీనం అవుతాయి.

## నవ చక్రేశ్వరీ న్యాసము

*ఏవం నవ ప్రకారస్తు పూజాకాలే ప్రయత్నతః ॥* 5

*ఏతాః క్రమేణ న్యస్తవ్యా సాధకే న కులేశ్వరీ ।*

పైన చెప్పబడిన చక్రేశ్వరీ విద్యలు మోక్షము కోరు సాధకుడు పూజాకాల మందు చెయ్యతగ్గవి.

## న్యాసము

*పాదాగ్ర జంఘాజానూరు గుదలింగాగ్ర కేషు చ ॥* 6

*ఆధారే విన్యసేన్మూర్తిం తస్యా మావాహినీ న్యసేత్ ।*

*వ ఏన వ్యాపకన్యాసః కర్తవ్యః పరమేశ్వరీ ॥* 7

పైన చెప్పినచక్రేశ్వరీ విద్యను వరుసగా పాదములు, పిక్కలు, మోకాళ్ళు, తొడలు, గు స్థానమందు, లింగాగ్రమున న్యాసము చెయ్యాలి. అంటే

| | | | |
|---|---|---|---|
| ప్రథమ | చక్రేశ్వరీ విద్య | - | పాదాలు |
| ద్వితీయ | చక్రేశ్వరీ విద్య | - | పిక్కలు |
| తృతీయ | చక్రేశ్వరీ విద్య | - | మోకాళ్ళు |
| చతుర్థ | చక్రేశ్వరీ విద్య | - | తొడలు |
| పంచమ | చక్రేశ్వరీ విద్య | - | గుద స్థానము |
| షష్ఠ | చక్రేశ్వరీ విద్య | - | లింగా గ్రము |
| సప్తమ | చక్రేశ్వరీ విద్య | - | మూలాధార మందు |
| అష్టమ | చక్రేశ్వరీ విద్య | - | ఆధార చక్రానికి పై భా . |
| నవమ | చక్రేశ్వరీ విద్య | - | సర్వాంగములు చెప్పి ... గన చేయాలి. |

మూల విద్య) న్యాస

(

## అం న్యాసము

*అకులాదిషు పూర్వోక్తస్థానేషు పరిచింతయేత్ ।*

*చక్రేశ్వరీ సమాయుక్తం నవచక్రం పురోదితమ్ ॥* 8

| | | |
|---|---|---|
| అకులము | 2. విషు | 3. ఆధారము |
| 4. 1. స్వాధిష్ఠానము | 5. మణి పూరము | 6. అనాహతము |
| 7. విశుద్ధి | 8. ... కాగ్రము | 9. ఆజ్ఞా చక్రము. |

నబడే తొమ్మిది స్థానములలో కూడా తొమ్మిది చక్రాలను న్యాసము చెయ్యా... న్యాస విధ అతః క్రింది విధంగా ఉంటుంది. ...లి.

1. అకుల పద్మే అం ఆం సౌః త్రిపురా చక్రేశ్వరీ
యుక్తాయ, త్రైలోక్య మోహన చక్రాయ నమః

2. విషు పద్మే ఐంక్లీం సౌః త్రిపురేశీ చక్రేశ్వరీ
యుక్తాయ సర్వాశా పరిపూరక చక్రాయ నమః

3. ఆధార పద్మే హ్రీం క్లీం సౌః త్రిపురసుందరీ
చక్రేశ్వరీ యుక్తాయ సర్వ సంక్షోభణ చక్రాయ నమః

4. స్వాధిస్థాన పద్మే హైం హ్క్లీం హ్సౌః ౹పుర వాసినీ
చక్రేశ్వరి యుక్తాయ, సర్వ సౌభాగ్య ౹ ౹యక చక్రాయ నమః

5. మణిపూరక పద్మే హ్సైం హ్స్క్లీం హ్సౌః త్రిపురా శ్రీ
చక్రేశ్వరీ యుక్తాయ, సర్వార్థ సాధక చక్రాయ నమః

6. అనాహత పద్మే హ్రీం క్లీం బ్లేం త్రిపుర మాలినీ
చక్రేశ్వరీ యుక్తాయ, సర్వ రక్షాకర చక్రాయ నమః

7. విశుద్ధి పద్మే హ్రీం శ్రీం సౌః త్రిపురాసిద్ధా చక్రేశ్వరీ
యుక్తాయ సర్వ రోగహర చక్రాయ నమః

8. లంబి కాగ్ర పద్మే హ్సైం హ్స్క్లీం స్సౌః త్రిపురాంబా
చక్రేశ్వరీ యుక్తాయ సర్వ సిద్ధి ప్రద ౹క్రాయ నమః

9. ఆజ్ఞా పద్మే క ఏ ఈ ల హ్రీం। హ స క హ ల హ్రీం।
స క ల హ్రీం। శ్రీ మహా త్రిపుర సుందరీ చక్రేశ్వరీ
యుక్తాయ సర్వానందమయ చక్రాయ నమః

బాహ్య పూజలో తత్వముద్ర చేత న్యాసము చెయ్యాలి. అనామిక, అం ష్ఠములు కలిపితే ౹్వ ముద్ర అవుతుంది. శ్రీ చక్రము నందు పుష్పాలతోనూ, అంతః పూ ంగు హావనా మాత్రః తత్వ న్యాసము చెయ్యాలి. ౹జలి

ము

## నవ చక్రేశ్వరీల ...

తాసాంనామాని వక్ష్యామి యథాను క్రమశః ...గత: ।
తత్రాద్యా త్రిపురాదేవీ, ద్వితీయా త్రిపు ...రీ ॥ 9

తృతీయా చ తథా ప్రోక్తా దేవీ త్రిపురసుందరీ ।
చతుర్థీచ మహాదేవీ దేవీ త్రిపురవాసినీ ॥ 10

పంచమీ త్రిపురా శ్రీ: స్యాత్ షష్ఠీ త్రిపు ...లినీ ।
సప్తమీ త్రిపురాసిద్ధారష్టమీ త్రిపురాంబికా ...రమ: 11

నవమీతు మహాదేవీ మహా త్రిపురసుందరీ ।

శ్రీచక్రంలోని తొమ్మిది చక్రాలలోనూ ఉండే చక్ర...ల పేర్లు ఈ విధంగా ఉన్నాయి.

1. త్రిపురా దేవి 2. త్రిపురేశ్వరీ 3. త్రిపురసుందరీ
4. త్రిపుర వాసినీ 5. త్రిపురాశ్రీ 6. త్రిపుర మాలినీ
7. త్రిపురాసిద్ధా 8. త్రిపురాంబా 9. మహా త్రిపుర సుందరీ

## పూజా స్థానము

పూజయే చ్చక్రమాదేతా నవచక్రే పురోదితే ॥ 12

శ్రీ చక్రంలో ఈ చక్రేశ్వరులను చతురస్రము దగ్గర నుండి బిందువు వరకు, ఒక్కొక్క చక్రమందు ఒ...క్క చక్రేశ్వరి చొప్పున పూజించాలి.

**పరమేశ్వరుని శ...**

ఏవం నవప్రకారాద్యా పూజాకాలే తు ...తి ।
ఏ... ...రా హ్యాద్యశక్తి రజరామర కారిణీ ...ర్య 13

ఆది పురుషాకారాన పరమేశ్వరుని యొక్క శక్తి పూజా ...లమందు తొమ్మిది రకాలుగా ఉన్నప్పటికీ, అవి అన్నీ ఒకే విధమైనవి. ఈ విషయము తెలుసుకున్న సాధకుడికి జనన మరణాలు ఉండవు. అంటే అతడు జీవన్ముక్తుడౌతాడు. సృష్టి సంహారక్రమాలలో తొమ్మిది విధాలుగా పూ... పబడినప్పటికీ, పరాపూజలో అంటే ...దు పూజలో ఒకే ఆకారమున్నది.

## మంత్ర సంకేతము

*మ  త సంకేతకస్త స్యా నానాకారోవ్యవస్థితః ।*

*నానాంబ్రంత్ర క్రమేణైవ  పారం పర్యేణ లభ్యతే  ।*

మంత్ర సంకేతము అంటే శ్రీవిద్యా స్వరూపము రహస్యార్థమే ॥ తో కూడి ఉన్నది. ; 14 నానా ప్రకారమైనది అ  ఇక్కడ ఆరు రకాలైనది. లోపాముద్రా, కామరాజము మొదలైన శ్రీవిద్యా మంత్ర  మంగాంటేప్పడింది. ఆ మంత్రాల యొక్క అర్థం గురుపరం పర  మాత్రమే తెలుసుకోవాలి. గురు పరంపర లేకుండా శ్రీవిద్యను పొందినవాడు జ్ఞాన మాత్రప్వాం చేతనే గర్వితులౌతున్నారు. ఆవరణ శక్తులు కూడా వారి మీద కినుక వహిస్తాయి.

## మంత్రార్థము

*ష  ర స్తంతు దేవేశి కథయామి తవానఘే ।*

*భావర్థ్య సంప్రదాయార్థో నిగర్భార్థశ్చ కౌళికః ॥* 15

*తథా సర్వ రహస్యార్థో మహా తత్వార్థ ఏవచ ।*

*అక్షరార్థోహి భావార్థః కేవలః పరమేశ్వరి ॥* 16

ఓ పరమేశ్వరీ ! కాది విద్యామంత్రము యొక్క రహస్యార్థము ఆరు రకాలుగా చెప్పబడతోంది. అవి.

1. భావార్థము  2. సంప్రదాయార్థము  3. నిగర్భార్థము
4. కౌళికార్థము  5. సర్వ రహస్యార్థము  6. మహా తత్వార్థము

ఇప్పుడు భావార్థము వివరించబడుతోంది. ఏదైనా ఒక మాట యొక్క అర్థాన్ని తెలుసు కోవాలంటే శబ్దము, ఉపమానము, వ్యాకరణము మొదలైన వాటి  యం కావాలి. కాని వీటి సహాయం లేకుండా కే  ం అక్షరాల స్వభావం చేతనే తెలి సహయాన్ని అక్షరార్థము అంటారు. అదే భావార్థము వలనబడుతుంది. అక్షరాలు శ్రీవిద్యక  స్తే యువాల వంటివి. పంచ దశీ మహామంత్రానికి  క్షరాలు పదిహేను. ఈ మంత్రము  కాది విద్యలలో అనేక రకాలుగా ఉన్నది. అయినప్పటికీ, అన్ని విద్యలూ పరదేవతా సూచకంగా ఒకే  న్ని చెబుతాయి.

అర్థ

*తేషు ద్వౌ మమరాజౌతు వరిష్ఠౌ వింధ్య మర్దన*

*లోపాముద్రా కామరాజా వితి ఖ్యాతి ముపాగతౌ ॥*

*హాదిస్తు లోపాముద్రా స్యాత్కామ రాజస్తు కాదికః*

*తయోస్తు కామరాజోఽ యం సిద్ధి దోభక్తి శాలినః ॥*

శ్రీ విద్యను మనువు, చంద్రుడు, కుబేరుడు, లోపాముద్ర, మన్మధుడు, అగస్త్యుడు, నందికేశ్వరుడు, సూర్యుడు, ఇంద్రుడు, విష్ణువు, శివుడు, దుర్వాసుడు మొదలైనరందరూ వివిధ రకాలుగా ఉపపాసించారు. వీటిలో హాది మతంలో లోపాముద్రము, కాది మతంలో కామరాజము శ్రేష్ఠమైనవి. ఈ రెంటిలో కూడా కాది విద్య అయిన కామరాజ మంత్రమే శ్రేష్టమైనది. అందుచేతనే కామరాజ మంత్రాన్ని అనుసరించే వ్యాఖ్య చెయ్యబడుతోంది.

## భావార్థము

*యోగినీభిస్తథా వీరై ర్వీరేంద్రై స్సర్వదాప్రియే ।*

*శివశక్తి సమాయోగా జ్జనితో మంత్రరాజకః ॥* **17**

**యోగినీ :** వీరియందు ఎప్పుడూ శివసంబంధము ఉంటుంది. కాబట్టి యోగినులు అనబడతారు అని అమృతానందులు తమ దీపికా వ్యాఖ్యలో వ్రాశారు.

**వీరులు :** శాంతా అంశతో ఉన్న ఇచ్ఛా జ్ఞానక్రియా శక్తులు భారతీ, పృధ్వీ, రుద్రాణీలు అంబికాంశులైన వామా జ్యేష్ఠా రౌద్రీరూపాలు. అవే బ్రహ్మ విష్ణు రుద్రులు.

**వీరేంద్రులు :** శాంతా, అంబింకాత్మకులైన సమిష్టి మిధునములు.

పంచదశీ మహామంత్రము మూడు కూటములుగా ఉన్నది. అందుచేతనే దీన్ని కూటత్రయము అంటారు.

| | | |
|---|---|---|
| ఏ ఏ ఈ లహ్రీం | ప్రథమ కూటమి | సృష్టి రూపము |
| హ స క హ ల హ్రీం | ద్వితీయ కూటమి | స్థితి రూపము |
| స క ల హ్రీం | తృతీయ కూటమి | సంహార రూపము. |

వీటిలో ఒక్కొక్క కర్మ తిరిగి మూడు విధాలుగా ఉంటుంది.

1. సృష్టి కర్మ - సృష్టి సృష్టి స్థితి, సృష్టి సంహారము
2. స్థితి కర్మ - సృష్టి స్థితి స్థితి, స్థితి సంహారము
3. సంహార కర్మ - సంహార సృష్టి సంహార స్థితి, సంహార సంహారము.

సృష్టి కర్మకు - బ్రహ్మ, భారతి
స్థితి కర్మకు - విష్ణువు, పృథివీ
సంహారకర్మకు - రుద్రుడు, గౌరి అధిపతులు

దీని ప్రకారము ప్రథమ కూటమిలో (సృష్టి కూటమి)

క కారము - బ్రహ్మ స్వరూపము
ఏ కారము - భారతీ స్వరూపము
ఈ కారము - విష్ణు స్వరూపము
ల కారము - పృథివీ స్వరూపము
హ్రీ కారములోని హ కారము - రుద్ర స్వరూపము
రేఫ - రుద్రాణీ స్వరూపము
ఈం కారము - శాంతా, అంబికల సమిష్టి రూపము.

ద్వితీయ కూటమి అయిన స్థితి రూపములో మధ్యన ఉన్న హకారమును వదలి వేసి చూస్తే 'హసకల హ్రీం' అవుతుంది. అందులో .....

హ కారము - బ్రహ్మ స్వరూపము
స కారము - భారతీ స్వరూపము
క కారము - విష్ణు స్వరూపము
ల కారము - పృథ్వీ స్వరూపము
హ్రీం కారములోని హకారము - రుద్ర స్వరూపము
రేఫ - రుద్రాణీ స్వరూపము
ఈం కారము - శాంతా, అంబికల సమిష్టి స్వరూపము

తృతీయ కూటమి అయిన సంహార కూటమిలో - గతంలో ద్వితీయ కూటమిలో వదలి వేసిన హకారాన్ని ఈ కూటమికి ముందు చేర్చితే 'హసకల హ్రీం' మిగులుతుంది. అందులో ద్వితీయ కూటమిలో చెప్పిన మాదిరిగానే ..... అవు

హ కారము - బ్రహ్మ స్వరూపము

స కారము - భారతీ స్వరూపము

క కారము - విష్ణు స్వరూపము

ల కారము - పృథివీ స్వరూపము

హ్రీం కారములోని హకారము - రుద్ర స్వరూపము

రేఫ - రుద్రాణీ స్వరూపము

ఈం కారము - శాంతా, అంబికల సమిష్టి స్వరూపము.

ఈ రకంగా ప్రతి కూటమి బ్రహ్మ, భారతి మొదలైన సప్త దేవతా వాచకములయిన ఏడు అక్షరాలతో కూడి ఉన్నాయి. అని చె[illegible] ఈ పంచదశీ మహామంత్రము యొక్క భావార్థాన్ని వివరించటం జరిగింది. అక్షరాల [illegible] భావార్థము అని గ్రహించాలి.

పంచదశీ మహామంత్రము శివశక్తుల క[illegible]ిక చేతనే శ్రీవిద్య అవుతున్నది. శివుడు అకార [illegible]పుడు. శక్తి హ కారరూపిణి. వారి [illegible] కలయిక యే కామకళ.

బ్ర[illegible]ండ పురాణము, లలితా త్రిశతిల[illegible]ందు

**కత్త్రయం హద్వయం చైవ శైవభాగః ప్రకీర్తితః**

**శక్త్యక్ష రాణి శేషాణి హ్రీంకార ముభయాత్మకః**

అని చెప్పబడింది. అంటే .....

మూడు క కారములు రెండు హ కారములు - శివరూపము

ఏ, ఈ, ల, స, ల,. స, ల కారములు - శక్తి రూపము.

[illegible]ం కారములు మూడు - శివ, శక్తి స్వరూపాలు.

[illegible] చెప్పబడింది. కాగా కొందరు ల కారములు మూడు, సకా[illegible]ులు [illegible]డు, ఏకార[illegible] ఈ కారము మొత్తం ఏడు అక్షరా[illegible] - సరస్వతి పృథ్వి, గౌరీ[illegible]వచకము[illegible]

[illegible]కారములు రెండు, క కారములు మ[illegible] మొత్తం ఐదు. అక్షరాలు వీరపద[illegible] సూచిం[illegible]డుతున్న బ్రహ, విష్ణు, రుద్ర వాచ[illegible]లు.

[illegible] కారములు మూడు - శాంతా అ[illegible] సమిష్టి మిధున వాచకము.

[illegible] కొందరి ప్రకారము వీరేంద్రులు అ[illegible]హ్మా, విష్ణు, రుద్రులు. వీరి ప్రకా[illegible]ు.

ప్రథమ కూటమికి - బ్రహ్మ, సరస్వతి

ద్వితీయ కూటమికి - విష్ణువు, పృథివి

తృతీయ కూటమికి - రుద్రుడు, గౌరి అధిపతులు.

హ్రీం కారానికి - అంబికా శాంతా మిధునము.

ఇంకా కొంత మంది ప్రకారము మూడు హ్రీంకారములూ త్రిపుర సుందరీ వాచకము. రెండవ కూటమి మధ్య గల హకారము కామకళలోని హ కారానికి మూల బీజము. అంటే హ్రీం కారానికి హ కారము మూల బీజము. అలాగే రెండు, మూడు కూటమిలలోని రెండు సకారాలకు అకారము మూల బీజము.

మంత్రంలోని మూడు హ్రీం కారాలు, రెండు సకారాలు మొత్తం ఐదు అక్షరాలు పోగా మిగిలిన పది అక్షరాలూ యోగినీ త్రయము, ఉపాసక త్రయము, బ్రహ్మాది త్రయము, తురీయమిధున స్వరూపములు. 3 + 3 + 3 + 1 = 10

**నవాక్షరీ మంత్రము**

**మహా త్రిపురసుందర్యా మంత్రా మేరు సముద్భవా ।**
**శ్రీ విద్యా మంత్రాలనీ మేరు సముద్భూతాలే. ॥**
**భూమి శ్చంద్ర శ్శివో మాయాశక్తిః కృష్ణాద్యమాదనౌ ।**
**అర్ధ శ్చంద్రశ్చ బిందుశ్చ నవార్ణో మేరు రుచ్యతే ॥**

1. ః మి - ల 2. చంద్ర - స 3. శివ - హ

4. మాయా: ఈ 5. శక్తి - 6. కృష్ణాద్య - రేఫ

7. ః దన - క 8. అర్ధ చంద్ర - నాదఏ ః 9. బిందువు

ఈ తొ మ్మిది అక్షరముల సముదాయమే పంచదశీ మహా మంత్రము. అందు ...కనె జ్ఞానార్ణవ త ం...మి.....

**మహా (త్రిపురా సుందర్యాః మంత్రాః మేరు సముద్భవాః** అని చెప్పబడింది.

అంద ే కామరాజ విద్యలోని ప్రథమ కూటమిలో ......

1. క కరయకా 2 ఏ కారము 3. ఈ కారము

4. ల కారము 5. హ కారము 6. రేఫ

7. ః కారము 8. బిందువు 9. అర్ధ చంద్రము (అః)

అనబడే తొమ్మిది అక్షరాలున్నాయి. ఇక్కడ అర్థ చంద్రము నుండి వెనుకకు లెక్క వేయగా వచ్చే ఎనిమిది  క్షరాలు అర్థ చంద్రము అనబడతాయి.

ప్రథమ కూటమిలో తొమ్మిది అక్షరాలున్నాయి. - క ఏ ఈ ల హ్రీం. అనబడే ఈ కూటమిలోని  చ్చులను, హల్లులను విడివిడిగా లెక్కపెట్టినట్లైతే తొమ్మిది అక్షరాలు వస్తాయి.

| | | |
|---|---|---|
| క్ + అ = క | - | 2 అక్షరాలు |
| ఏ | - | 1 అక్షరము |
| ఈ | - | 1 అక్షరము |
| ల్ + అ = ల | - | 2 అక్షరాలు |
| హ్ + ర + ఈం = హ్రీం | - | 3 అక్షరాలు |
| మొత్తం | | 9 అక్షరాలు |

అలాగే  ీయ కూటమిలో పది అక్షరాలున్నాయి. ఇం  మధ్య నున్న హకారము మూడవ కూట ద్వి ముదట చేర్చాలి. హ్రీం కారములోని 'ఈం'ను మలో లి వెయ్యాలి. అప్పుడు 'హ స క ల హ్ర' మి వుతుంది. దీనిలో

| | | |
|---|---|---|
| హ్ + అ = హ | - | 2 అక్షరాలు |
| స్ + అ = స | - | 2 అక్షరాలు |
| క్ + అ = క | - | 2 అక్షరాలు |
| ల్ + అ = ల | - | 2 అక్షరాలు |
| హ్ + ర = హ్ర | - | 2 అక్షరాలు |
| మొత్తం | | 10 అక్షరాలు |

ఈమూడవ కూటమికి ముందు రెండవ కూటమిలో వదలి వేసిన హ కారము చేర్చాలి. అప్పుడు 'హ స క ల' అవుతుంది. దీనిలో ఎనిమిది అక్షరాలున్నాయి.

| | | |
|---|---|---|
| హ్ + అ = హ | - | 2 అక్షరాలు |
| స్ + అ = స | - | 2 అక్షరాలు |
| క్ + అ = క | - | 2 అక్షరాలు |
| ల్ + అ = ల | - | 2 అక్షరాలు |
| మొత్తం | | 8 అక్షరాలు |

ఈ రకంగా మూడు కూటములలోనూ కలిపి 9 + 10 + 8 = 27 అక్షరాలవుతున్నాయి.. వీటిలో ఒక సారి లెక్కపెట్టిన అక్షరాలను తిరిగి లెక్కపెట్టకుండా ఉంటే మొత్తం తొమ్మిది అక్షరాలే ఉంటాయి. అవి.

| | | |
|---|---|---|
| 1. క కరాము | 2 ఏ కారము | 3. ఈ కారము |
| 4. ల కారము | 5. హ కారము | 6. రేఫ |
| 7. బిందువు | 8. నాదము | 9. స కారము |

ఈ తొమ్మిది అక్షరాలూ కలిసి మేరు మంత్రము అవుతున్నాయి. ఇదే నవాక్షరీ మంత్రము. ఈ మంత్రము యోగినుల నుండి, వీరుల నుండి వీరేంద్రుల నుండి పుట్టింది అని కొంతమంది అభిప్రాయము. యోగిని మొదలైన వారు మంత్రోపాసకులు. అంతే గాని మంత్ర స్రష్టలు కాదు. మనువు, చంద్రుడు, కుబేరుడు మొదలైనవారు మాత్రమే మంత్ర స్రష్టలు.

## పర దేవత - సృష్ట్యాది రూపత్వము

**తన్మయీం పరమానంద నందితాం స్పంద రూపిణీం**
**నిసర్గ సుందరీం దేవీం జ్ఞాత్వా స్వైరముపాసతే** ***18***

పరదేవత - తానే మంత్రము, మంత్రమే తాను అయి ఉన్నది. శక్తి స్వరూపిణి అయిన దేవి ప్రకాశాంశతో సామరస్యము పొంది పరమానందము పొందుచూ సృష్టికి సిద్ధమవుతున్నది. ప్రకాశ శక్తి నుంచి విడివడి జగద్రూపము పొంది, సృష్టించబడిన జగత్తుకు స్థితి కర్త అవుతున్నది. సంహార కాలమందు పరమ శివునిలో లీనమవుతున్నది. ఈ రకంగా ఆ దేవత సృష్టిస్థితి సంహార రూపములుగా ప్రకాశించుచున్నది.

## పరదేవత - మంత్రము

**శివశక్త్యాత్మ సంఘట్ట రూపే బ్రహ్మణి శాశ్వతే**
**తత్ప్ర ధా ప్రసరాశ్లేష భువి త్ర్యేన్ద్రో ప లక్షితే ॥** ***19***

**జ్ఞాతృజ్ఞాన మయాకార మననాన్మంత్ర రూపిణీ ।**
**తేషాం సమిష్టి రూపేణ పరాశక్తి స్తు మాతృకా ॥** ***20***

శివశక్తుల యొక్క సామరస్యము శాశ్వతమైనది. నిత్య సిద్ధము. అదే పరబ్రహ్మము. తురీయ బిందు రూపము గలది. ఆమెయే 'పరమానన్ద నందితా' అని లోగడ చెప్పబడింది. అటువంటి బ్రహ్మ యొక్క ప్రకాశ ప్రసారమే విశ్వము. ఈ సృష్టితో పరబ్రహ్మకు ఏ రకమైన సంబంధమూ లేదు. జగత్తు పరబ్రహ ు ఉపలక్షణము మాత్రమే. ఈ రెండూ విశిష్టముగా కలసి ఉండవు. అలాగని వేరువేరుగ్గాా కనిపించవు. సాధకులను అనుగ్రహించటానికి జగద్రూపము చేత స్వేచ్ఛగా స్వీకరించబడిన లీలా విగ్రహమే పరబ్రహ్మము. విమర్శ శక్తి స్పంద రూపిణి. బ్రహ్మకు వేరుగా ఉంటుంది. పరదేవతను తెలుసుకోవాలనుకునే సాధకుడు సర్వకాల సర్వావ స్థల యందు మననము చేస్తూ ఉంటాడు. అటువంటి సాధకుడికి జ్ఞాన మయాకారము కలుగచేస్తుంది. 'మననాత్ త్రాయత ఇతి మంత్రః' । కొన్ని అక్షరాలను పదే పదే మననము చెయ్యటం వలన రక్షించేది కాబట్టి ఆ అక్షరాలకు మంత్రము అని పేరు వచ్చింది. ఈ విధంగా మంత్రాన్ని లేక మంత్ర రూప దేవతని - మననము చేయు వారిని రక్షిస్తుంది కాబట్టి మంత్రానికీ, దేవతకీ ఏకరూపత్వము చెప్పబడింది. అంటే మంత్రమూ, దేవతా రెండూ ఒక్కటే. సత్పురుషులు అటువంటి పరదేవతను తెలుసుకుని ఆత్మతో అనుసంధానము చేసి ఉపాసిస్తున్నారు.

మాటలతో చెప్పటానికి వీలైనటువంటి బ్రహ్మ, భారతీ మొదలైన దేవతల నందరినీ మంత్రములోని క కారము మొదలైన అక్షరాల రూపంతో ఒకటిగా చేసి ధ్యా చటం జరుగుతోంది. అందుచేత పరాశక్తి పైన చెప్పబడిన దేవతలందరి లక్షణములు గలిగి ఉనింప. అలాగే అక్కడ అక్షరాలకు దేవతారూపము చెప్పబడింది. కాబట్టి మాతృకలకు, శ్రీవిద్యకూ భేదము లేదు. 'శివశక్తి సమాయోగాత్ జనితో మ ః రాజకః' శకివశక్తుల సామరస్యము వల్ల మంత్రము ఉద్భవిస్తున్నది. మట్టికీ, మట్టితో తయాంత్ర కుండకీ ఏ విధంగా తేడాలేదో, ఆ విధంగానే మంత్రానికీ, పరదేవతకూ, మాతృకలకూ - శ్రీవిద్యకూ తేడా లేదు.

## తురీయ బిందువు

***మధ్య బిందు విసర్గాంతః సమాస్థానమయే పరే ।***
***కుటిలారూపకే తస్యాః రూపే వియత్కలే ॥*** ***21***

అకారము శివరూపము. హ కారమ(పతిక్తి రూపము. శివశక్తుల సమావేశమే కామకళ. ఈ రెండు అక్షరములు త్రికోణమ బిందువై ఉన్నాయి. ఇదే తురీయ దువు.

సహస్రారమందు ఉంటుంది. ఇదే కామేశ్వరుని అంక ప్రదేశము. అక్షరాలలో అకారము మొదటిది కాగా హకారము చివరది. హ కారము తరువాత ఉండే ళ కారము ల కార రూపమే. క్ష కారము క ష ల మిశ్రమ రూపము. అందుచేత ఆ రెం వదలి వేయబడినాయి.

ఆధార చక్రము కులము. సహస్రారకమలము అకులము. కుండలినీ శక్తి ఈ రెంటి మధ్య తి తూ ఉంటుంది. అందుచేతనే కుటిలా రూపము గలది అని చెప్పబడింది. ఇది కామకళ రూపాంతరము. ఇదే వియత్కళ. యత్ అంటే ఆకాశము. ఆకాశము శూన్యము. శూన్య స్వరూపము కాబట్టే బిందువు ఆకాశమని చెప్పబడింది. కళ అనే శబ్దంతో కళను కలిగిన హకార రూపమైన విసర్గ గ్రహింపబడింది. హకారములో హల్లు, అచ్చు హ్+ అ ఉన్నాయి. ఈ రెండూ శివశక్తులు. కాబట్టి ఆ రెండింటి సమాయోగ రూపమైన కామకళా అక్షరము నుండి మంత్రము ఉద్భవించింది.

## అకార హకారములకు మ ్యమందు స్థితి

**మధ్య ప్రాణ ప్రధారూప స్పందవ్యో మ్నిస్థితా పునః**
**మధ్యమే మంత్ర పిండేతు తృతీయే పిండకే పునః** *22*
**రాహలకుటా ద్వయస్ఫూర్జ చ్ఛలత్తా సం స్థితస్య తు**

పంచదశీ మహా మంత్రంలోని రెండవ కూటమి మధ్య గల హకారము ప్రాణమువంటిది. విసర్గను ఉచ్చరించినప్పుడు హకారము ఉచ్చ లో బడుతు . అందుచేతనే విసర్గ మ హకారము సూక్ష్మ రూపంలో ఉన్నదని చెప్పబడింది. ఇదే ందిదవ్యోమము లేక స్థూలవ్యకారము. ఇది శక్తి స్వరూపము.

మూడవ కూటమిలో గ్రహన్యాసములోని శష సహలతో కూడిన హు కూటమి చెప్పబడిం గ్రహన్యాసము ఈ విధంగా ఉన్నది.

1. ది. నుంచి అః వరకు అచ్చులు - సూర్య గ్రహ స్వరూపము
2. క వర్గ - కుజ గ్రహ రూపము
3. చ వర్గ - బుధ హ స్వరూపము
4. ట వర్గ - గురు గ్రహ స్వరూపము
5. వర్గ - శుక్ర గ్రహ స్వరూపము

6. ప వర్గు - శని గ్రహ స్వరూపము

7. య వర్గు (య ర ల వ) - చంద్ర గ్రహ స్వరూపము

8. శ వర్గు (శ ష స హ) - రాహు గ్రహ స్వరూపము

9. క్ష వర్గు ( క్ష కారము) - కేతు గ్రహ స్వరూపము.

రాహు కూటమిలో మూడవది అయిన స కారమునందున్న అకారము శివుడు. మొదట శివశక్తి సమాయోగముతో పుట్టిన మంత్రాన్ని చెప్పి, శివశక్తి సమాయోగ రూపమైన దేవి యొక్క విశేషణము చెప్పబడింది. పరమానందనందితా, నిసర్గ సుందరీ అనేవి సృష్టి సంహార పరమైన పదాలు. జగత్తు యొక్క అవస్థా విశేషాలను చెప్పేవి. శివశక్తులను ఈ పదములచే వర్ణించటం వలన వారు వేరువేరు అనే భావము ఎక్కడా చెప్పబడలేదు. అందుచేతనే పరమేశ్వరి మంత్ర రూపిణి అని చెప్పబడుతోంది.

## విద్యకూ జగత్తుకూ అభేదము

*చలత్తా సంస్థితస్యతు*

*ధర్మా ధర్మ స్య వాచ్యస్య విషామృత మయస్య చ* 23

*వాచకాక్షర సంయోగాత్ కథితా విశ్వరూపిణీ ।*

చ లత్తా అంటే జగత్తు అని అర్థం. ధర్మ వాచకముతో దర్శి అయిన శక్తి చెప్పబడుతున్నది. శక్తి సంసార రూపము గలది కాబట్టి విషము. శివుడు మోక్ష రూపము కాబట్టి అమృతము. లౌకికములైన మోహములచేత మోక్షమును దూరము చేసేది కాబట్టి సంసారము విషము. మరణము లేకుండా చేసేది అమృతము. మరణ రహితం అమృతం. మరణము లేకుండా చేస్తుంది అంటే ముక్తిని ప్రసాదిస్తుంది అని అర్థం. ఆ రకంగా ముక్తిని ప్రసాదించేవాడు ఈశ్వరుడు.

విషాన్ని, అమృతాన్ని సూచించేవే అకార హకారాలు. దర్శించదగినది శక్తి. సృష్టి స్థితి లయాలచేత దర్శించటానికి వీలైనది. కాని శివుడు సృష్టి స్థితిలయాలకు అతీతుడు. కాబట్టి అతడు అదర్శుడు. ఈ రకంగా అకారహరరూపులైన శివశక్తులు అవినాభావ సంబంధము గలవారు. పరమేశ్వరి విశ్వరూపిణి, జగద్రూపిణి. అందుచేతనే విద్యకు, జగత్తుకూ అభేదము చెప్పబడింది.

తేషాం సమష్టి రూపేణ పరాశక్తిం తు మాతృకాం 24

కూటత్రయాత్మికాం దేవీం సమష్టి వ్యష్టి రూపిణీం ।

ఆద్యాం శక్తిం భావయన్తో భావార్థ మితిమన్వతే ॥ 25

దేవతా మంత్ర జగత్తుల ఐక్యముచేత అనగా వీటి సమిష్టి రూపంతో పరాశక్తి అనే పేరు కల కామకళ బోధించబడుచున్నది. ఆమె వాగ్రూపిణి అయినప్పటికీ కామకళా రూపంతోనే ఆమెను ధ్యానించాలి. తురీయ బిందు స్వరూపము అవాఙ్మానస గోచరము. అంటే కంటికిగాని, మనసుకు గాని కనిపించదు. అందుచేతనే దాన్ని కామకళారూపంగానే ధ్యానించాలి.

కూటత్రయ రూపిణి అయిన పరమేశ్వరిని జగత్తు పరంగా సృష్టి స్థితి సంహారములు కలదిగా భావించాలి.

పరమేశ్వరిని వ్యష్టి రూపిణిగానూ, సమిష్టి రూపిణిగానూ కూడా భావించవచ్చును. పంచదశీ మహామంత్రములో మూడు కూటములున్నాయి. ఉపాసనాపరంగా చూసినట్లైతే వీటిలో ఒక్కొక్క కూటమిని మాత్రమే ఉపాసించే విధానం కూడా ఉన్నది. మంత్రములోని ప్రథమ కూటమివల్ల బ్రహ్మవర్చస్సు, సద్బుద్ధి కలుగుతాయి. ద్వితీయ కూటమివల్ల అభీష్ట సిద్ధి కలుగుతుంది. తృతీయ కూటమి వల్ల మోక్ష సాధన జరుగుతుంది. కాబట్టి ఈ కూటములను విడివిడిగా ఉపాసించే వారి కోసమే వ్యష్టి రూపము చెప్పబడింది. మూడు కూటములు కలిపి సమిష్టిగా ఉపాసించే వారికి మహావాక్యార్థం గోచరిస్తుంది. వ్యష్టిఉపాసకులకు విశేష లాభము కలగటానికే హృల్లేఖాత్రయము చెప్పబడింది. అని సేతుబంధమునందు వ్రాయబడింది.

దేవతా మంత్ర జగత్తులకు భేదము లేదని చెప్పటమే మంత్రము యొక్క భావార్థము. అకార హకార రూపాలైన శివశక్తులు తురీయ బిందువునందు పరస్పరాలింగనము చేసికొని ఉన్నారు అనే స్ఫురణ జ్ఞానరూపమైనటువంటిది. ఇదే ఉపనిషత్తులలో చెప్పబడిన పరబ్రహ్మ. జగత్తును సృష్టిచేయవలసినప్పుడు పరమేశ్వరుడు తనయొక్క అర్ధభాగాన్ని చూశాడు. అప్పుడు ప్రకాశాంశ అకారరూపుడు అయిన పరమేశ్వరుని నుంచి శ్వేత బిందువు, రక్తబిందువు గల హకారరూపిణి అయిన విమర్శాంశలో ప్రవేశించింది. రెంటియొక్క సమ్మేళనము వల్లనే అహం అనే మిశ్రమ బిందువు ఆవిర్భవించింది. ఇది మనోహరమైనది. మహాయోగులచే

కోరబడుచున్నది. చంద్రాగ్నులే శరీరంగా కలది. ప్రకాశాత్మకమైన విమర్శశక్తి స్వరూపము. ఇదే కామకళ. మంత్రము యొక్క మూడవ ఖండములోని సకారమునందు, రెండవ ఖండములోని రెండవ హకారమందు మంత్రము వ్యక్తమవుతున్నది. అందుచేత దేవతామంత్ర జగత్తులకు భేదము లేదని యోగినులు మొదలైనవారు భావిస్తున్నారు. ఇది మంత్రము యొక్క భావార్థము.

## సంప్రదాయార్థము

*సంప్రదాయో మహాబోధ రూపో గురుముఖే స్థిత:*
*విశ్వాకార ప్రధాయాస్తు మహత్వం చ యదాశ్రయమ్* **26**

గురువు నుంచి విద్యను స్వీకరించటానికి మూడు పద్ధతులు చెప్పబడినాయి. 1) శుశ్రూష. 2) గురువుకు కావలసిన ధనమివ్వటము. 3) తనకు తెలిసిన దానిని గురువుకు చెప్పి అతడి నుంచి కావలసిన దానిని తెలుసుకోవటము. కాని శ్రీవిద్యను ఉపాసించటానికి మొదటి రెండే మార్గాలు. మూడవది పనికిరాదు. అయితే ఆ రెంటిలోనూ కూడా మొదటి పద్ధతే సంప్రదాయమైనది.

శివశక్తుల సామరస్యమే మహాబోధ. అటువంటి జ్ఞానమే రూపంగా కలవాడు గురువు. ఈ జ్ఞానము ఆదినాథుడైన పరమేశ్వరుని దగ్గరనుంచి ఇప్పుడున్న గురువు వరకు పరంపరగా వస్తోంది. దీన్ని కేవలము గురువు నుండి మాత్రమే తెలుసుకోవాలి. వంశపారంపర్యంగా వచ్చే ఆస్తులకు మల్లేనే, గురువు నుంచి వచ్చిన జ్ఞానాన్ని తాను స్వయంగా అనుభవించి, శిష్యులు చేసిన సేవలకు మెచ్చి ఆ జ్ఞానాన్ని గురువు శిష్యులకు అందచేస్తాడు. ఈ కారణంగా సంప్రదాయానుసారంగా మాత్రమే ఈ జ్ఞానాన్ని గురువు నుంచి పొందాలి. అంతేకాని వేరు దారిలేదు.

## జగత్తునందు విద్యా వ్యాప్తి

*శివశక్త్యాద్యయా మూలవిద్యయా పరమేశ్వరీ*
*జగత్కృత్స్నం తయావ్యాప్తం శృణుష్వా వహితాప్రియే ॥* **27**

అకార స్వరూపుడు శివుడు. హకార రూపిణి శక్తి. చరాచర జగత్తుకు వారే ఆది దంపతులు. వారే ప్రథములు. సమస్త సృష్టికీ కారణ భూతులు. శివశక్తుల సమాయోగము

చేతనే కామకళాక్షరము పుట్టింది. దానివల్లనే మూలవిద్య ఏర్పడింది. ఆ మూలవిద్య వల్లనే సమస్త జగత్తూ వ్యాపించింది. అని భైరవుడు భైరవికి శ్రీవిద్యను వివరిస్తూ ఆమెను 'ప్రియే' అని సంబోధించాడు. అంటే శుశ్రూష చేసి గురువును మెప్పించే శిష్యులకు మాత్రమే సంప్రదాయ రహస్యములు చెప్పాలనే విషయం వ్యక్తమవుతున్నది.

## పంచభూతమయత్వము

*పంచభూతమయం విశ్వం తన్మయీ సాదానఘే*
*తన్మయీ మూలవిద్యాచ తదద్య కథయామితే ॥* 28

నేల, నీరు, నిప్పు, గాలి, ఆకాశము, ఇవి పంచభూతాలు. ఈ జగత్తు అంతా పంచభూతాలతో కూడి ఉన్నది. ఈ భూతాలు అన్నీ ఆ పరమేశ్వరి నుంచే ఆవిర్భావం చెందినాయి. మూల విద్య అయిన సౌభాగ్య విద్య కూడా పంచభూతాలతో కూడి ఉన్నది. పంచభూతత్వాను అంటే పంచభూతాలకు చెందిన శబ్ద స్పర్శ రూప రస గంధములనబడే గుణములు. లోగడ చెప్పిన ముప్పదిఆరు తత్వములలోనూ పంచభూతాలు, వాటి గుణాలు కూడా ఉన్నాయి. ఇవన్నీ ఒకదాని నుంచి ఒకటి పుట్టినాయి.

ఆకాశాద్వాయుః - ఆకాశమునుంచి వాయువు పుట్టింది.
వాయోరగ్నిః - వాయువు నుంచి అగ్ని పుట్టింది
అగ్నేరాపః - అగ్ని నుంచి నీరు పుట్టింది.
ఆపో పృథివి - నీటి నుంచి నేల పుట్టింది.

## విద్యకు, మంత్రానికి, దేవతకు ఐక్యత

*హకారా ద్వ్యోమ సంభూతం కకారాత్తు ప్రభంజనః*
*రేఫాదగ్నిః సకారాచ్చజలతత్వస్య సంభవః* 29
*లకారా త్పృథివీజాతా తస్మాద్విశ్వమయీ చసా ।*

విమర్శ శక్తి నుంచి మొదటగా హ కారము పుట్టింది. ఆ తరువాత
హ కారము నుండి - ఆకాశము ఉద్భవించింది.
కామకళాక్షరమైన క కారము నుండి - వాయువు ఉద్భవించింది.
ర కారము నుండి - అగ్ని ఉద్భవించింది.

స కారము నుండి - జలము ఉద్భవి ంది.

ల కారము నుండి - భూమి ఉద్భవించింది.

అదే విధంగా

మ కారము నుండి - ముద్రలు

జ కారము నుండి - జాలంధర మొదలైన పీఠవ పుట్టినాయి.

ఈ కారణం చేత, పంచభూత వాచకమైన అక్షరాల స్వభావం చేత పరమేశ్వరి, సౌభాగ్య విద్య చ కారము న విశ్వవిద్యాకారణమైన దేవి గ్రహించబడుతున్నది. ఇక్కడ విశ్వమయీ అంటే హ కారము దలైన అక్షరములచేత పుట్టి పంచభూతముల రూపిణీ అని అర్థము. ఈ రకంగా పంచభూతాలతో కూడి ఉండటం చేత విద్యకూ, మంత్ర , దేవతకు ఐక్యత చెప్పబడింది.

## పంచ భూతముల గుణములు

*గుణాః పంచదశప్రోక్తా భూతానాం తన్మయీ శివా* 30

పంచభూతా యొక్క గుణాలు పదిహేనుగా చెప్పబడు న్నాయి. అసలు పంచభూతాల గుణాలు ఏవి ?

ఆకాశము - శబ్దము

వాయువు - స్పర్శ

అగ్ని - రూపము

నీరు - రసము

నేల - గంధము

ఈ ఐదు గుణములు వ్యాప్య వ్యాపక భావములచేత పదిహేను అవుతున్నాయి. అవి ఈ విధంగా ఉంటాయి. ఆకాశము సర్వవ్యాపి కాబట్టి ఆకాశము యొక్క గుణమైన శబ్దము మిగిలిన అన్ని భూతములందు ఉంటుంది. అలాగే వాయువు యొక్క గుణమైన స్పర్శ వాయువుతో పాటుగా మిగిలిన మూడు తములందు ఉంటుంది. ఆ విధంగా చూస్తే

ఆకాశము నందు - ము

వాయువు నందు - శబ్దము, స్పర్శ

| | | |
|---|---|---|
| అగ్ని యందు | - | శబ్దము, స్పర్శ, రూపము |
| జలము నందు | - | శబ్దము, స్పర్శ, రూపము, రసము |
| భూమి యందు | - | శబ్దము, స్పర్శ, రూపము, రసము, ధము |

ఈ రకంగా

| | | |
|---|---|---|
| ఆకాశగుణమైన శబ్దము | - | ఐదు భూతములందు |
| వాయుగుణమైన స్పర్శ | - | నాలుగు భూతములందు |
| అగ్ని గుణమైన రూపము | - | మూడు భూతములందు |
| జలగుణమైన రసము | - | రెండు భూతములందు |

**పృథ్వీ గుణమైన గంధము :** ఒక్క భూతమునందు మాత్రమే ఉన్నా . ఈ రకంగా మొత్తం కలిసి పదిహేను సూక్ష్మాంశములుగా విభజించబడ్డాయి. ఈ పదిహేను సూక్ష్మాంశాలే పంచదశీ మహామంత్రంలోని పదిహేను క్షరాలు అని కామకలావిలాసవ ని పదిహేనవ సూత్రంలో వివరించబడింది.

**శబ్ద స్పర్శౌ రూపం రస ేతి భూతసూక్ష్మాణి**
**వ్యాపకమాద్యం వ్యాప్యం తూత్తరమేవం క్రమేణ పంచ**

శబ్ద స్పర్శరూపరస గంధాలనబడే పంచతన్మాత్రలు మొదటి వ్యాపకమని, తర ది వ్యాప్తమనీ ఈ రకంగా పదిహేను గుణాలవుతున్నాయి. దీనిమీద వివరణక చే వ్రాయబడిన శ్రీ విద్యా సర్వస్వము (కామకలా విలాసానికి తెలుగు వ్యాఖ్య) చూడండి. ఈ రకంగా

| | | |
|---|---|---|
| హ కారములు | - | ఐదు |
| ఈ కారములు | - | నాలుగు |
| రేఫలు | - | మూడు |
| స కారములు | - | రెండు |
| ల కారము | - | ఒకటి |

మూల మంత్రంలో ఈ అక్షరాలన్నీ ఉన్నాయి.

**మంత్రం : క ఏ ఈ ల హ్రీం । హ స క హ ల హ్రీం । స క ల ।**

1) **హ కారములు :** రెండవ కూట లో రెండు, మూడు హ్రీంకారవ లోన హ్రీం బాడు మొత్తం ఐదు.

2) **ఈ కారములు :** మొదటి కూటమిలో ఒకటి. మూడు హ్రీం కారములందు మూడు. మొత్తం నాలుగు.

3) **రేఫలు :** మూడు హ్రీం కారములందు మూడు.

4) **స కారములు :** రెండవ కూటమియందు ఒకటి. మూడవ కూటమియందు ఒకటి.

5) **ల కారములు :** ప్రతి కూటమిలోనూ ఒక్కొక్కటి చొప్పున మూడు కూటములందు మూడున్నాయి. అయితే పైన చెప్పిన ప్రకారము లకారము ఒక్కటే ఉండాలి. ఇది ఏ విధంగా అంటే -

శ్రీచక్రములోని భూపురంలో మూడు రేఖలున్నాయి. మూడు లకారాలు ఆ మూడు రేఖలకు సంకేతాలు. కాని ఆ మూడింటినీ కలిపి ఒకటిగానే లెక్కపెట్టాలి. అందుచేతనే సూక్ష్మాంశంలో ల కారము ఒకటిగానే చెప్పబడింది. ఈ రకంగా జగత్తు అంతా ఆ పరమేశ్వరితో నిండి ఉన్నది.

## భూతగణములను సూచించని అక్షరములు వ్యర్థము కావు

*యస్యయస్య పదార్థస్య యా యా శక్తి రుదీరితా*
*సా సా సర్వేశ్వరీ దేవీ స స సర్వోమహేశ్వరః* 31

ప్రతి వస్తువుకూ కొంత సామర్థ్యం ఉంటుంది. అదే దాని శక్తి. ఈ రకంగా విశ్వంలోని అన్ని పదార్థాలలోనూ శక్తి ఉన్నది. జగత్తు పదిహేను గుణములతోనూ, ముప్పైఆరు తత్త్వములతోనూ నిండి ఉన్నది.

భూతముల గుణాలు పైన చెప్పబడ్డాయి. వాటిలో లేని పదార్థాలు కొన్ని ఉన్నాయి. ఆ పదార్థాలను సూచించే అక్షరాలు విద్యలో లేవు. అయితే జగత్తులోని పదార్థాల యందు కొంత శక్తి ఉన్నది. శక్తి దేవీ స్వరూపము. పదార్థము శివ స్వరూపము. కాబట్టి భూతముల యొక్క గుణాలను సూచించని అక్షరాలైన అ కారము, క కారము మొదలైనవి వ్యర్థము కావు.

## సప్తత్రింశతి (37) వర్ణములు

*వ్యాప్తా పంచదశార్ణైస్సా విద్యాభూత గుణాత్మికా ।*
*పంచభిశ్చ తథాషడ్భిశ్చతుర్భి రపి చాక్షరైః ॥* 32

స్వరవ్యంజన భేదేన సప్తత్రింశత్ప్ర భేదినీ।
సప్త త్రింశత్ప్రభేదేన షట్త్రింశ త్త్వరూపిణీ॥ 33
తత్వాతీత స్వభావా చ విద్యైషా భావ్య సదా।

భావార్ధము ప్రకారము మూడు కూటములందు ...తే

సృష్టిస్థితి సంహార రూపములైన 5 + 6 + 4 = 15

అక్షరవ తో శ్రీ విద్య వివరించబడింది.

ఇప్పుడు ...ంచదశీ మహామంత్రములో ము...ఏడు వర్ణాలున్నాయని నిరూపించబడుతోంది. ఇక్కడ చెప్పేది పంచదశీ మహామంత్ర...రించే అనటానికి పంచభిశ్చ (ప్రథమ కూటమి) షడ్భిశ్చ (ద్వితీయ కూటమి) చతుర్భిరపి (తృతీయ కూటమి) అని చెప్పటం జరిగింది.

కాది వి ...లో అచ్చులు, హల్లులను విడదీయగా మొత్తం ముప్పైఏడు అవుతున్నాయి. అది ఏ రకంగా అద్యా- క ల హ స క హ ల స క ల - అనే హల్లులలో అచ్చులు కూడా కలిసి ఉన్నాయి.

క్ + అ = క

ల్ + అ = ల

హ్ + = హ

స్ + అ = అ...

ఈ రకంగా చూసినట్లైతే వాటిలోని .....

| | | |
|---|---|---|
| అచ్చులు | - | 10 |
| హల్లులు | - | 10 |
| ఏకారము | - | 1 |

ఈ కారములు (మొదటి కూటమిలో ఒకటి,

| | | |
|---|---|---|
| హ్రీం ... ములలో మూడు) | - | 4 |
| హకారము...(హ్రీంకారములలోవి) | - | 3 |
| రేఫలు ...ంకారములలో) | - | 3 |
| బిందు... (హ్రీంకారములలో) | - | 3 |
| పాదవ...వులు | - | 3 |
| మొత్తం ...లు | | 37 |

వీటి మధ్యన   స్త్రింశ తత్త్వాత్మకమైన పరమేశ్వరి విరాజిల్ల   ౦. తత్త్వాతీతమైన
శుద్ధ బ్రహ్మ ముప్పైష్ట్రనది.                    స్తుతున్నది

**ఏవం సప్తత్రింశ, త్సంఖ్యాక పదైర్మహా విద్యా ।**
**షట్త్రిం॰   త్వానాం తత్త్వాతీత స్యచా విధాత్రీయమ్**

మూలవిద్యలో శ్రత్తపదములున్నాయి. వీటినే 37 బీజవ   ౦ ౹ ॥ గారు. అవి వరుసగా
ఎల అం

హ కారములు - 5
ఈ కారములు - 4
రేఫలు - 3
స కారములు - 2
ల కారములు - 3
క కారములు - 3
అ కారములు - 10
బిందువులు - 3
నాదములు - 3
ఏ కారము - 1
మొత్తం బీజాలు 37

వీటిలో తత్త్వాలు - 36. కాగా 37వది పరబ్రహ్మ స్వరూపము. అవి ....

పంచభూతాలు - 5
తన్మాత్రలు - 5
జ్ఞానేంద్రియాలు - 5
కర్మేంద్రియాలు - 5
మనస్సు, బుద్ధి, అహంకారము - 3
ప్రకృతి, పురుష ౦ - 2
కళ, విద్య, రాగ స్గ
కాలము, నియత - 5
మాయ, శుద్ధ వి
మహేశ్వరుడు, ౕ ద్య, శివుడు - 4
శివుడు, శక్తి సదా - 2
మొత్తం తత్త్వాలు - 36

ఈ తత్త్వాలన్నీ శ్రీ వి ద్యా తో సమన్వయం చెందుతున్నాయి.

| | తత్త్వములు | | బీజములు | |
|---|---|---|---|---|
| 1. | శివ, శక్తి, శుద్ధ విద్య, ప్రకృతి | 4 | బిందువులు | 4 |
| 2. | సదాశివ, ఈశ్వర, మాయ, కలా, విద్య, రాగ, కాలము, నియతి, పురుషుడు | 9 | నాదములు | 9 |
| 3. | తన్మాత్రలు | 5 | హకారములు | 5 |
| 4. | భూతములు | 5 | ర్యంజములు | 5 |
| 5. | ఇంద్రియాలు | 10 | శ్రీ కంఠులు | 10 |
| 6. | అహంకారము, బుద్ధి, మనస్సు | 3 | కకారములు | 3 |
| | | 36 | | 36 |
| 7. | తత్త్వాతీతమైన పరబ్రహ్మ | 37వది | ఏకారము | 37వది |

వీటిని చక్ర సంకేతములోని 13వ శ్లోకంలో వివరించటం జరిగింది.

హాది విద్యలో మొత్తం అక్షరాలు ముప్పై తొమ్మిది అవుతాయి.

హ స క ల। హ స క హ ల। స క ల।

ఈ అక్షరాలలో అచ్చులు పన్నెండు, హల్లులు పన్నెండు. మొ ఇరవై నాలుగు.

హ్రీంకారమందు - హ కారము, రేఫ, ఈ కారము బిందువు, [illegible] త్తం మొత్తం ఐదు.

ఈ రకంగా మూడు హ్రీంకారములందు పదిహేను. మొత్తం ము [illegible] హద్రది అవుతాయి.

## వ్యాపకము, వ్యాప్యములు

**పృథివ్యాదిషు భూతేషు వ్యాపకం చోత్తరోత్తరం ॥ 34**

**భూతం త్వధస్తనం వ్యాప్యం తద్గుణా వ్యాపకాశ్రయాః ।**

**వ్యాప్యేష్వవస్థితా దేవి స్థూల సూక్ష్మ విభేదతః ॥ 35**

పంచభూతములందు మిగిలిన [illegible] ములు వ్యాపకము. అంటే కారణము తరువాత వచ్చేవి వ్యాప్యము. అంటే కార్యము. ఆకాశభూతం ఆశ్రయించిన శ [illegible] ఐదు [illegible] తటు,

ఒకటి ఆకాశమందు, మిగిలిన నాలుగు భాగాలు నాలుగు భూతాల యందు ఉంటాయి. అలాగే వాయు గుణము నాలుగు భాగాలై ఒకటి వాయువు నందు, మిగిలిన మూడూ, మూడు భూతాల యందు ఉంటాయి. ఈ రకంగా ......

| | | |
|---|---|---|
| శబ్దము | - | ఐదు భాగాలు |
| స్పర్శ | - | నాలుగు భాగాలు |
| రూపము | - | మూడు భాగాలు |
| రసము | - | రెండు భాగాలు |
| ంధము | - | ఒక భాగము |

ః గత్తం పదిహేను గుణాలవుతున్నాయి.

## హ కారము

***తస్మాద్వ్యోమగుణశ్శబ్దోవాయ్వాదీన్ వ్యాప్యసంస్థితః ।***
***వ్యోమ బీజైస్తు విద్యా స్తైర్లక్షయేచ్ఛ బ్దపంచకం ॥*** 36

ఆకాశ గుణమైన శబ్దము ఏ రకంగా మిగిలిన భూతము లందు వ్యాపించి ఉన్నదో, అదే విధంగా పంచదశీ మహామంత్రంలో ఆకాశబీజమైన హ కారము శబ్ద పంచకమును సూచిస్తున్నది. అంటే హ కారము ఐదుసార్లు చెప్పబడింది.

## హకారము పరారూపము

***తేషాం కారణరూపేణ స్థితం ( )మయం పరం***
***భవేద్గుణవతాం బీజం గుణానావ్యసి వాచకం ॥*** 37

కాది వి( )ో ఐదు హ కారాలున్నాయి.

వీటి మ ( )్యలో జగత్తుకు కారణభూతమైన హ ( ) ము ( ) రూపంలో ఉన్నది. అంటే రెండవ కుధ్య ( )లోని రెండవ హ కారవ ( ) ఐదు హ కారము ( )చైతన్య ధ్య నున్నది. అది పరాపశ్యంతీ మొదలైన వాటిలో మొదటిదైన ( )ు అని చెప్పబడుతులకు. లిపి అంతా వైఖరీ స్వరూపము. కాబట్టి స్థూలమైన హ కారానికి పర ( ) శబ్ద ( ) క్షణము ఆ హ కారము యొక్క నాదాత్మకమైన పరారూపము యొక్క విసర్గ ( ) కలిగినా ( ) లక్షి.

శబ్దము మొదలైన గుణాలు కలిగిన ఆకాశము మొదలైన భూతాల యొక్క వాచక బీజాలే శబ్దము మొదలైన వాటికి కూడా వాచకములు. అంటే పంచభూతాలకు గల బీజాలే తన్మాత్రలకు కూడా వర్తిస్తాయి అని అర్థం.

## వాచ్యలక్షణము

**కార్యకారణ భావేన తయోరైక్యం వివక్షయా ।**

శబ్దము అనేది ఆకాశము యొక్క కార్యము. అంటే ఆకాశం కారణం. శబ్దము కార్యము. ఈ రెంటికీ కార్యకారణ సంబంధమున్నది. ఈ విషయాన్ని తాంత్రికులు, తార్కికులు కూడా అంగీకరిస్తున్నారు. తన్మాత్రలవల్లనే పంచభూతాలు పుట్టినాయని తాంత్రికుల వాదన. ఈ రకంగా పంచభూతాలకు, తన్మాత్రలకు ఐక్యత ఉన్నది కాబట్టి హకారము మొదలైనవి ఆకాశాదులకు ఏ రకంగా వాచ్యములో, అదే విధంగా శబ్దము మొదలైన తన్మాత్రలకు కూడా వాచ్యములే.

## స్పర్శ చతుష్టయము

**మహామాయా త్రయేణాపి కారణేనచ బింద ॥ 38**

**వాయ్వగ్నిజల భూమీనాం స్పర్శానాం చచతుష్టయమ్**
**ఉత్ప భావయేద్దేవీ స్థూల సూక్ష్మవిభేదతః 39**

ఈ కారము మకళా బీజము. ఈ బీజము మూడు హ్రీం కారములందు, ప్రథమ కూటమిలో విడిగానూ ఉన్నది. ఈ రకంగా ఈ కారము నాలుగుగా ఉన్నది. ఇక వాయువు నందున్న స్పర్శ నాలుగు భాగాలై ఒకటి వాయువు నందు, మిగిలిన మూడు భాగాలు సూక్ష్మ రూపంలో నిప్పు, నీరు, నేలయందున్నాయి. వాటి విభేదము వల్లనే గాలి, నిప్పు, నీరు, నేల అనే భూతములు వాటి యొక్క స్పర్శ, కాంతి, రసము, గంధములు పుట్టినాయి.

## రూపత్రయము

**రూ గాం త్రితయం తద్వ్యత్రిభీరేఫైర్విభా ।**
**ప్రధానం తేజసో రూపం తద్బీజేన హి జ తే 40**
**వ్యతే ।**

హ్రీంకారమందున్న మూడు రేఫలూ అగ్ని బీజములు. ఇవి అగ్ని జలము, భూమి యందుంటాయి. రూపము తేజస్సుకు ప్రధానము. ఇది వాయువునందు, ఆకాశమందు లేదు. కాబట్టి మొదటగా తేజస్సుతోనే ఉంటూ, తరువాత జలభూములందు చేరి వాటి విశేష గుణములచే కలిసిపోతున్నది. ఆ కారణము చేతనే రేఫ నుంచి తేజస్సు పుట్టింది అని చెప్పబడింది.

## రస ద్వయము

*విద్యాస్తైశ్చంద్ర బీజైస్తు స్థూలసూక్ష్మోరసస్మృతః*
*సంబంధో విదితో లోకే రసస్యాప్యమృతస్య చ ॥* **41**

చంద్ర బీజము స కారము. కాది విద్యలో ఇవి రెండు ఉన్నాయి. అంటే మంత్రములో రెండు స కారాలున్నాయి. జలమునందు రసత్వము రెండు భాగాలై ఒకటి జలము నందు, రెండవది పృథివి యందు ఉంటాయి. ఇక్కడ జలము కారణము, భూమి కార్యము. జలమునందు ఉండే రస భాగము స్థూలమైనది. భూమియందుండే రస భాగము సూక్ష్మమైనది. అగ్ని సూర్యుల తేజస్సు వలెనే చంద్రుని యందు కూడా తేజస్సు ఉన్నది. అందుచేతనే చంద్రబీజమైన సకారానికి తేజస్సుతో కూడిన గురురూప లక్షకత్వము చెప్పబడింది. చంద్ర మండలము తేజోరూపమైనది కాదు. జలరూపమైనది. సూర్యకిరణముల సంబంధం కలిగినందున అంటే సూర్యకిరణములు చంద్రుని మీద పడటం వలన అవి చల్లబడి వెన్నెలగా మారుతోంది. అందుచేత జలాత్మకమైన చంద్ర మండల వాచకమైన సకారము జలసంబంధమైన రస లక్షణకమైనది అని చెప్పబడింది. హాది విద్యలో మూడు స కారములున్నాయి. అక్కడ మూడు సకారములతోనూ రెండు రసములు చెప్పబడుతున్నాయి.

## గంధనిరూపణ

*వసుంధరా గుణోగంధస్తల్లి పిర్గన్ధవాచికా*
*భువన త్రయ సంబంధాత్త్రిథాత్వంతు మహేశ్వరీ ॥* **42**

ల కారము పృథివీ వాచకము. దాని గుణము గంధ లక్షకము. గంధము భూమియందే ఉంటుంది. అంతేకాని ఇతర భూతములందు ఉండదు. అయితే లోకాలు మూడు. 1) ఊర్ధ్వలోకము 2) మధ్యలోకము 3) రథో లోకము. అందుచేత పృథివీ బీజమైన లకారము

మూడుగా చెప్పబడింది. అంటే కాది, హాది విద్యలు రెండింటియందు కూడా మూడు ల కారములున్నాయి. 'పృథివ్యా ఓషధయః', 'ఓషధీభ్యోన్నం', 'అన్నాత్పురుషః' అంటే భూమినుంచి ఓషధులు పుట్టినాయి. ఓషధుల నుంచి అన్నము, అన్నము నుంచి పురుషుడు పుట్టారు. ఈ రకంగా పృథివికి ఓషధి రూపత్వము, అన్న రూపత్వము చెప్పబడింది. భూః - భూలోకము, భువః - భువర్లోకము, సువః - సువర్లోకము. అనే మూడు లోకాలకు పృథివీ, ఓషధి, అన్నముల సంబంధమున్నది. అందుచేతనే పృథివీ లక్షణమైన గంధము మూడు రకాలు అని చెప్పబడుతోంది. శ్రీ చక్రంలోని భూపురంలోని మూడు రేఖలు మూడు లోకాలకు ప్రతీకలు.

ఈ రకంగా పంచభూతాల వలన, వాటి బీజాలైన హకారాదుల వలన ఇరవై ఐదు తత్త్వములు చెప్పబడినాయి.

## కకారత్రయము - సాధక త్రయము

***అశుద్ధ శుద్ధ మిశ్రాణాం ప్రమాతౄణాం పరం వపుః ।***
***క్రోధీశత్రితయేనాథ విద్యా స్తేన ప్రకాశ్యతే ॥ 43***

పంచదశీ మహామంత్రములో మూడు క కారములున్నాయి. అవి మూడు సాధకులను సూచిస్తున్నాయి. సాధకులు మూడు రకాలుగా చెప్పబడుతున్నారు. 1) శుద్ధులు 2) అశుద్ధులు 3) మిశ్రములు.

**1) శుద్ధులు :** తానే పరమేశ్వరుడు అనే భావన కలవారు, జ్ఞాన స్వరూపులు. వీరిని విజ్ఞాన కేవలులు అంటారు. వీరు పరమేశ్వరిని సహస్రారమందు మాత్రమే ఆరాధిస్తారు. వీరినే నిష్కలులు అని కూడా అంటారు.

**2) అశుద్ధులు :** తాను వేరు, భగవంతుడు వేరు అని భావన కలవారు. కేవలము కర్మిష్ఠులు. ఐహిక వాంఛలలో మునిగి ఉంటారు. వీరిని 'కలా' అంటారు. వీరు శ్రీ చక్రాన్ని ఆధార చక్రం నుండి ఆజ్ఞా చక్రం దాకా భావన చేస్తారు. వీరిని సకలులు అని కూడా అంటారు.

**3) మిశ్రులు :** వీరు జ్ఞానము కలిగి ఉంటూనే కర్మలనాచరిస్తారు. వీరిని ప్రళయాకలలు అంటారు. వీరు శ్రీ చక్రాన్ని బిందువు దగ్గర నుండి ఉన్మన దాకా భావన చేస్తారు. వీరిని సకల నిష్కలులు అని కూడా అంటారు. వీరు శుద్ధాశుద్ధ మిశ్రులు. భేదాభేద దృష్టి గల ఉపాసకులు.

ఈ రకంగా మూడు క కారములు సాధకులను గురించి చెబుతున్నాయి.

## అకారదశకము - జడులైన జీవులు

*శ్రీ కంఠదశకం తద్వదవ్యక్త స్య హి వాచకః ।*

శ్రీ కంఠములు అంటే అకారములు ఇవి పది. మంత్రములోని అచ్చులను హల్లులను వేరు చేయగా పది అ కారాలున్నాయని ముందే చెప్పబడింది. 'క ల హ స క హ ల స క ల' - అనే అక్షరాలలోని అకారములు పది. మూడవ కూటమిలోని మొదటి అక్షరమైన సకారములోని అకారము పరాపశ్యంతీ మధ్యమావైఖరిలలోని వైఖరీ అంశ గలిగిన జీవుడు అనబడుచున్నాడు. పరారూపము యొక్క అంశ శివచైతన్య వాచకము.

## ఏకారము - పురుషత్వము

*ప్రాణరూప స్థితో దేవి తద్వదేకా దశః స్వరః ॥* **44**
***ఏకః సన్నేవ పురుషో బహుధా జాయతే హి స : ।***

ప్రాణ రూపుడైన పురుషుడు శరీరమంతా వ్యాపించి ఉన్నాడు. అందుచేతనే శరీరము చేష్టలు కలిగి పని చేస్తున్నది. పురుషుడు (జీవుడు) ఒక్కడే అనంతమైన శక్తి గలవాడు. తత్వముల యందు ప్రాణము విడిగా చెప్పబడలేదు. ఎందుచేతనంటే పురుషుడు ప్రాణరూపుడు. పురుషుణ్ణిగనక చెప్పినట్లైతే ప్రాణము గురించి చెప్పినట్లే అవుతుంది. ఈ రకంగా ప్రాణ రూపుడైన పురుషుడు అచ్చులందు ఏకాదశముగ ఉన్నాడు. అంటే అకారాది స్వరాలలో పదకొండవది ఏకారము ప్రాణ స్వరూపము.

పంచదశీ మహామంత్రంలోని బీజాక్షరాలకు వివరణ కాది విద్యను అనుసరించే చెప్పబడింది.

## ఇతర వర్ణములు - తత్వములు

*రుద్రేశ్వరసదే శాఖ్యాదేవతామిత విగ్రహా : ॥* **45**

***బిందుత్రయేణ కథితా అమితా మితవిగ్రహాః ।***

***శాంతిశ్శక్తిశ్చ శంభుశ్చ నాదత్రితయ బోధనా : ॥*** **46**

రుద్రుడు తేజోమయుడు. అందుచేతనే రుద్ర శబ్దము తేజస్సుకు పర్యాయ పదము ఇక్కడ పురుష దగ్గర నుండి మాయ వరకు గల ఏడు తత్వాలు తీసుకోవాలి. అవి తేజస్తత్వములు.

పురుషుడు (ట) నియతి (ఞ) కాలము (ఝ) రాగము (జ) అవిద్య (ఛ) కలా (చ) మాయా (ఙ) ఈశ్వరుడు తిరోదాన కర్త. సదాశివుడు అనుగ్రహ కర్త. సదాశివుడు అహం అనే భావముతో జగత్తు అంతా ఉంటాడు. 'ఇదమహం' అనేది ఈశ్వరతత్త్వము. 'అహమిదం2 - అంటే నేనే ఈ విశ్వమంతయూ అయి ఉన్నాను. 'ఇదమహం' - అంటే ఈ విశ్వమంతా నేనే అయి ఉన్నాను. వీటిలో మొదటి దానికి - నేను ఈ విశ్వమంతా ఆవరించి ఉన్నాను. రెండవ దానికి - ఈ విశ్వమంతా నాలోనే ఉన్నది అని అర్థము. ఈ రెండింటికీ మధ్య గల భేదమే మాయ.

పరమేశ్వరుని యందున్న 1) సర్వ కర్తృత్వ 2) సర్వజ్ఞత్వ 3) పూర్ణత్వ 4) నిత్యత్వ 5) విభూతి అనబడే ఐదు శక్తులు మాయతో సంకుచితము అయి, 1) కలా 2) అవిద్యా 3) రాగము, 4) కాలము 5) నియతి అవుతున్నాయి. పరమేశ్వరుడు మాయ సంబంధము గలవాడై పురుషుడు అవుతున్నాడు. ఈ పురుషుడే గతంలో ఏ కారముతో చెప్పబడినాడు.

బ్రహ్మశక్తి శివుడు అనే ముగ్గురూ దేశ కాల వస్తువుల చేత అపరిచ్ఛిన్న స్వరూపులు.

వాగ్భవ బీజముపై నున్న బిందువుతో - శాంతి

కామరాజ బీజముపై నున్న బిందువుతో - శక్తి

పరాబీజముపై నున్న బీజముతో - శివుడు

సూచించబడుతున్నారు అని అమృతానందుల వారు తమ దీపికా వ్యాఖ్యలో వ్రాశారు. ఈ ముగ్గురికీ తేడా లేదు. ఈ ముగ్గురూ బిందువుకు పైన ఉన్న

1) అర్ధ చంద్రము, 2) రోదిని, 3) నాదము, 4) నాదాన్తము, 5) శక్తి, 6) వ్యాపికా 7) సుమనా, 8) ఉన్మనా లను సూచిస్తారు. వీరి లక్షణము శివశక్తుల సామర ఘు - నిర్విశేష బ్రహ్మ - సృష్టి సంకల్పముతో శివుడు - సృష్టి ప్రారంభ సమయమ ం శక్తిస్వరూపిణి ముప్పై ఆరు తత్త్వాలు ందు

1) క్షిత్యాది శ్ ంతము 2) ప్రకృత్యంతము మాయాంతము సదా శివాంతము 5) క్షిత్యాది శ్రానాంతము ఐదు భాగాలవుతున్నా3) . ఈ విధంగా పర4) శివుని చేత విద్య యందు ముప్పై ఆరు తత్వములు ప్రతిపాదించబడినాయి.

## సర్వమంత్రమయత్వము

*వాగురామూల వలయే సూత్రాగ్రాః కవలీకృతః ।*

*తథా ః త్రాసముస్తాశ్చ విద్యాయా మత్ర స్థితాః ॥* 47

వాగురా అంటేపక్షులు పట్టే వల. ఈ వలకు మధ్య ఒక సన్నని కడియము వంటిది ఉంటుంది. దాన్ని ఆధారముగా చేసుకునే దారాలు వ్రేలాడుతుంటాయి. ఆ ధారాల చివర ఇనప గుళ్ళు ఉంటాయి. ఈ దారాలన్నింటికీ ఇనుప కడియము ఏ రకంగా మూలమో, అలాగే సమస్త మంత్రాలకీ శ్రీ విద్య మూలము. అన్ని మంత్రాలు శ్రీ విద్యయందే ఉన్నాయి.

*గురుక్రమేణ సంప్రాప్త స్సంప్రదాయార్థ ఈరితః*

ఈ రకంగా సంప్రదాయార్థము ఆది నాథుడైన పరమేశ్వరుని దగ్గర నుంచి సాధకుని గురువు వరకు పారంపర్యంగా, ఉపదేశానుక్రమంగా వచ్చింది. శ్రీ భైరవీ ! నేను కూడా నీకు ఆ విధంగానే ఈ విద్యను చెబుతున్నాను. నీవు ఈ విద్యను మంచి శిష్యులకు మాత్రమే ఉపదేశించవలసినది. అని భైరవి పరంగా మనకు ఉపదేశిస్తున్నాడు. గురు శిష్య దగ్గర ఉపదేశం లేకుండా కేవలము శ్లోకాలు, అర్థాలు చదివినట్లైతే ఈ విద్య నిరర్థకమవుతుంది. అని చెబుతూ పరమేశ్వరికీ, జగత్తుకూ, మంత్రానికీ తేడా లేదని ఇక్కడ నిరూపించబడింది.

## నిగర్భార్థము

*నిగర్భార్థో మహాదేవి సర్వాత్మ గోచరః ॥* 48

నిగర్భము - పూర్తిగా దాగి ఉన్నది. అతి రహస్యము - నిగూఢమైనది - ఇతర అర్థములకన్న పరమ రహస్యమైనది.

శివుడు - అవాఙ్మానస గోచరమైన పరబ్రహ్మ.

గురువు - పరబ్రహ్మను ఆత్మతో దర్శించినవాడై సకల ఆగామార్థాలు తెలుసుకున్న జ్ఞాని. ఆత్మ - గురువు యొక్క దయ వలన సంసార బంధములు తెంచుకుని శివైక్యానుభవము పొందిన శిష్యుడు.

ఈ ముగ్గురూ భేదము లేకుండా దేనియందు గోచరిస్తారో అది నిగర్భము. శివ గురు ఆత్మలచే తనే గోచరమయ్యేది.

## స్వానుభవము

*తత్ప్రకారం చ దేవేశి దిఙ్మాత్రేణ వదామితే ।*
*శివ గుర్వాత్మనామైక్యాను సంధానాత్త ధాత్మకం ॥* 49

శివ గురు ఆత్మల యొక్క ఐక్యము అభ్యాసము చేతనే పొందదగినది. గర్భ హేతువైన సామరస్య సుఖము ఏ రకంగా ఇతరులకు అర్థంకాదో, అలాగే ఆత్మ శివతాదాత్మ్యము కూడా. ఇది కేవలము అనుభవము వలన మాత్రమే తెలుసుకోవాలి.

## గురువే పరమేశ్వరుడు

*ని లత్వం శివే బుద్ధ్వా తద్రూపత్వం గురోరపి ।*
*తన్ని ష్కణ సామర్థ్యా దాత్మనశ్చ శివాత్మ తాం ॥* 50
*భావయేద్భక్తి నమ్రస్సన్ శంకోచోన్మేషా కళంకితః ।*

శివుని యందు గల ని లత్వమును తెలుసుకొని, గురువుకు ూష చేసి అతని అనుగ్రహము వలన సకల పాపప్పులు పోగొట్ట బడి శిష్యుడు జ్ఞాన ుశ్రుచున్నాడు. గురువు అంటే కేవలము మానవ చర్మము ధరించిన శివుడు అష్ట పాశ ము ప కాదు. అష్ట పాశములు అనగా బద

*ఘృణా శంకా భయం లజ్జా జుగుప్సా చేతి పంచమీ ।*
*కులం శీలం చవ్యత్తం చేత్య ష్టా పాశాః ప్రకీర్తితా ॥*
*పాశబద్ధః పశుప్రోక్తాః పాశయుక్త స్సదాశివః ॥*

నింద, అనుమానము, భయము, సిగ్గు, ద్వేషము, కులము, శీల వడవడి అనున అష్ట పాశములు అనబడతాయి. ఈ పాశములకు బద్ధుడైనవాడు పశ ము, ుల నుండి వి విముక్తి పొందినవాడు సాక్షాత్తు పరమేశ్వరుడు. వు.

## కౌళికార్థము

*కౌళికంకథయిః ప క దేవత యో* 51
*విద్యా గుర్వాత్మనాస్యైం తత్ప్రకారః ప్రదర్శ్యతే ।*

శ్రీచక్రానికి, దేవతకు, శ్రీవిద్యకు, గురువుకు శిష్యుడికీ భేదము లేదని చెప్పటమే కౌళికార్థము. కులము అంటే ఒకే జాతికి చెందినవి. ఒకే ధర్మాలు కలవి, గణేశ, గ్రహ, నక్షత్ర, యోగినీ, రాసి, పీఠములనే ఆరు రకాలైన ధర్మాలు పరదేవతకున్నాయి ! ఈ ఆరింటితోనూ కూర్చిన ప్రధానార్థమే కౌళికార్థము.

## భూపుర, వృత్త, దళములు

*లకారైః శ్చతురశ్రాణి వృత్తత్రితయ సంయుతం ॥* **52**

*సరోరుహద్వయం శాక్తైః రగ్నే షో మాత్మకంప్రియే ।*

మంత్రములోని మూడు లకారములు శ్రీచక్రములోని మూడు భూపుర రేఖలను సూచిస్తున్నాయి. ఇక వృత్త త్రయము ఒకే చోట కాకుండా వేరువేరుగా చెప్పబడింది. భూపురంలో ఒక వృత్తము. దానిలోపల షోడశ దళము. ఇది సోమాత్మక పద్మము. దానిలోపల వృత్తము. ఆ లోపల అష్ట దళము. ఇది అగ్న్యాత్మకము. దీనిలోపల మరియొక వృత్తము షోడశదళ, అష్టదళములు రెండూ కలిసి ఉభయాత్మకము. అగ్ని సోమాత్మకము. ఈ రకంగా వృత్తత్రయము, షోడశదళ, అష్టదళ పద్మాలు చెప్పబడ్డాయి. ఈ రకంగా అగ్ని సోమ పద్మములచే అలంకరించబడింది కాబట్టి వృత్త త్రయము జలతత్వ వాచకమై సకారము చేత పుట్టినవి. ఇక్కడ శక్తి అంటే సకారము అని అర్థము. ఎందుకంటే 'శివోహకార ఇత్యుక్తః సకారః శక్తి రవ్యయః' ఇక్కడ వృత్త త్రయముతో కూడిన షోడశదళ, అష్టదళములు సకార ద్వయముచే చెప్పబడ్డాయి.

## నవ యోని చక్రము

*హ్రాల్లేఖాత్రయ సంభూతైః రక్షరైర్నవ సంఖ్యకైః ॥* **53**

*బిందుత్రయయుతైర్జాతం నవయోన్యాత్మకం ప్రియే ।*

బిందుత్రయము అనగా నాదముతో కూడిన నాదముతో కలిసిన బిందుత్రయము. ఈకారము బిందువు రెండూ కలసి ఒకటి గానే లెక్కించాలి. హ్రీం కారములో హకారము, రేఫ, ఈం కారములుంటాయి. ఈ రకంగామూడు హ్రీంకారములతోనూ కలిపి తొమ్మిదక్షరాలుంటాయి. వీటివల్ల వసుకోణాత్మక త్రికోణము అంటే నవయోని చక్రము పుట్టింది.

## మండల త్రయము

**మండల త్రయ యుక్తం తు చక్రం  శ్శనలాత్మకం ॥** 54

**వ్యోమ బీజత్రయే ణైవ .......**  శక్తి

మండల త్రయము - అంటే చతుర్ధశారము, అంతర్ధ శారము, బహిర్ధ శారములు. వ్యోమ బీజత్రయముతో అంటే రెండు ఇకారములు, ఏ కారమువల్ల పుట్టాయి.

## బిందువు

**....... ప్రమాతృ త్రితయాన్వితం ।**

**ఇచ్ఛా జ్ఞాన క్రియా రూప మాదన త్రయ సంయుతం ॥** 55

**సదాశివాసనందేవి మహా బిందుమయం పర ।**

ప్రమాతృ త్రితయము అంటే వామజ్యేష్ట రౌద్రాత్మకమైన బ్రహ్మ విష్ణు ( ) ల చేత, అన్వితం - ఇచ్ఛా జ్ఞాన క్రియా రూపమైన, మాదన త్రయము - మూడుముద్రారముల (కకారము మదన బీజముల)తో కూడిన ప్రథమ కూటస్థమైన శాంతా అంబికల సమిష్టి రూపమైన కామకళా క్షరము సదాశివతత్త్వమైన ఆసనముగా గల బిందువు మొత్తం చక్రం మీద ఉన్నందున గొప్పదైనది.

వరి  రహస్యంలో భాస్కరరాయలవారు బిందువు మూడు క కారముల వలన, ఏ కారము వశ్శాపుట్టింది అని వ్రాశారు.

## మంత్ర చక్రముల కభేదము

**కం మ  మయం చక్రం దేవత  మూః పరం  పుః** 56

పైన  శ్చిన విధంగా శ్రీ చక్రము మంత్రమయా ు. మంత్రానికీ చక్రానికీ  ం లేదు. ఈ రెండూ దేవతకు మరొక రూపము. భేద

| | | |
|---|---|---|
| దేవత | - | స్థూల రూపము |
| మం  ు | - | సూక్ష్మ రూపము |
| యంత్రము | - | కారణ రూపము |

కాబట్టి ఈ మూడు ఒక్కటే ! వీటికి భేదము లేదు.

## పరదేవత - గణేశత్వము

*ఏకాదశాధిక శత దేవాతాత్మ తయా పునః*

*గణేశత్వం మహా దేవ్యాః.........* 57

గణములకు ఈశ్వరుడు గణేశ్వరుడు. ఇక ఇక్కడ ఉన్న గణాలు ఏవంటే.

| | | | |
|---|---|---|---|
| 1. | భూపురం ప్రథమ రేఖలోని అణిమాది సిద్ధులు | - | 10 |
| 2. | రెండవ రేఖలో బ్రాహ్మి మొదలైన శక్తులు | - | 8 |
| 3. | మూడవ రేఖలో ముద్రా దేవతలు | - | 10 |
| 4. | షోడశ దళంలో ఆకర్షణ దేవతలు. | - | 16 |
| 5. | అష్టదళంలో అనంగకుసుమ మొదలైనవి | - | 8 |
| 6. | చతుర్దశారంలో సర్వ సంక్షోభిన్యాదులు | - | 14 |
| 7. | బహిర్దశారంలో సర్వసిద్ధి ప్రదాదులు | - | 10 |
| 8. | అంతర్దశారములో సర్వజ్ఞాదులు | - | 10 |
| 9. | అష్ట కోణములో వశిన్యాదులు | - | 8 |
| 10. | త్రికోణంలో కామేశ్వరి మొదలైనవి | - | 3 |
| 11. | ఆయుధ దేవతలు కామేశ్వరునికి | - | 4 |
| | " కామేశ్వరికి | - | 4 |
| 12. | అంగ దేవతలు | - | 6 |
| | మొత్తము గణాలు | | 111 |

ఈ గణాలన్నింటికీ పరమేశ్వరియే అధిపతి కాబట్టి ఆమెకు గణేశత్వం లభించింది.

## నవ గ్రహాత్వం

*...... స సోమ రవి పావకైః ॥*

*ఇచ్ఛా జ్ఞానక్రియాభిశ్చ గుణత్రయ యుతైపునః* 57

*(గ్రహా) రూపా చ సా దేవీ ....*

పరమేశ్వరి నేత్రములయిన - రవి చంద్రాగ్నులు, శిరస ుధ్య భాగము, పాదములు - ఇచ్ఛా జ్ఞాన క్రియా శక్తులు, సత్వ రజ స్తమో గుణములు. మ్యొత్తం తొమ్మిది కావ టం చేత దేవతకు గ్రహత్వం వచ్చింది.

## నక్షత్ర రూపం

*....... జ్ఞాన కర్మేంద్రి యైరపి ॥ 58*

*తదర్ధై దేవ దేవేశి కరణై రాంతరైః పునః ।*

*ప్రకృత్యా చ గుణేనాపి పుంస్త్వ బంధేన చాత్మనా ॥ 59*

*. త విగ్రహోజాతా ......*

| | | | |
|---|---|---|---|
| 1. | జ్ఞానేంద్రియాలు | - | 5 |
| 2. | కర్మే ంద్రియాలు | - | 5 |
| 3. | తన్మాత్రలు | - | 5 |
| 4. | వచనాదులు (వచన దానా గమన విసర్గ ఆనందాలు) | - | 5 |
| 5. | మనస్సు, బు ్ధి అహంకారము | - | 3 |
| 6. | ప్రకృతి (వ్యక్తబుద్ధి అవ్యక్తము) | - | 2 |
| 7. | చిదాభాస (అంతఃకరణలో ప్రతిబింబించినది.) | - | 1 |
| 8. | అంతః కరణకు అధిష్టానమైన కూటస్థుడు | - | 1 |
| | మొత్తం | | 27 |

ఇవన్నీ పర ేత నుంచే పుట్టినాయి. కాబట్టి ఆమెకు నక్షత్ర రూపం వచ్చింది.

దేవ

## యోగినీ రూపము

*..... యో ిత్వ మథో ్తే ।*

*త్వగాది ధాతు నాథాభి ర్డాకిన్యాదిభి రప్యసౌ 6*

*వర్గాష్టకై ిష్టాభిర్యోగినీ భిశ్చ సంయుతా ॥ 60*

*యోగినీ ర్వ మాస్థాయ రాజతే విశ్వవిగ్రహ 61*

శరీరంలో షట్చక్రాలున్నాయి. ప్రతి చక్రానికి మధ్యన వజ్రేశ్వరి మొదలైన దేవతలున్నారు. వీరినే యోగినులు అంటారు. డాకినీ, రాకినీ, మొదలైనవారు. ఈ దేవతలు సప్తధాతువులకు ప్రతీకలు. ఆ వివరాలు ఈ విధంగా ఉంటాయి.

| | చక్రము | దేవత పేరు | యోగిని పేరు | ధాతువు పేరు |
|---|---|---|---|---|
| 1. | విశుద్ధి చక్రము | వజ్రేశ్వరి | డాకినీ | చర్మము |
| 2. | అనాహతము | వామదేవి | రాకినీ | రక్తము |
| 3. | మణిపూరకము | వరహావస్త్రావివర్జితా | లాకినీ | మాంసము |
| 4. | స్వాధిష్ఠానము | సిద్దేశ్వరి | కాకిని | మేదస్సు |
| 5. | మూలాధారము | సిద్ధవిద్యా | సాకినీ | ఎముకలు |
| 6. | ఆజ్ఞా చక్రము | సిద్ధమాతా | హాకినీ | మజ్జ |

పరమేశ్వరి సుందరి పైన అంటే బ్రహ్మ రంధ్రం దగ్గర ఉంటుంది. అందుకే ఆమెకు యోగినీత్వం వచ్చి విశ్వమోహిని అయింది.

## రాశి రూపము

*ప్రాణాపానౌ సమానశ్చో దాన వ్యానౌ తథాపునః*
*నాగః కూర్మోథ కృకరో దేవదత్తో ధనుంజయః ॥* 62
*జీవాత్మపరమాత్మా చేత్యేతై రాశి స్వరూపిణీ ।*

శరీరంలోని వాయువులు ఐదు. ఉపవాయువులు ఐదు. జీవాత్మ, పరమాత్మ. మొత్తం పన్నెండు.

| వాయువు | ఉపవాయువులు |
|---|---|
| 1. ప్రాణ వాయువు | 1. నాగ వాయువు |
| 2. అపాన వాయువు | 2. కూర్మ వాయువు |
| 3. వ్యాన వాయువు | 3. కృకర వాయువు |
| 4. ఉదాన వాయువు | 4. దేవదత్తము |
| 5. సమాన వాయువు | 5. ధనుంజయము |

ఇది గాక జీవాత్మ, పరమాత్మలు రెండు వరసి పన్నెండు. ఈ రకంగా విటితో కూడ పరదేవత రాశి స్వరూపిణి అవుతో .

## ...ణేశత్వము

*... ాది త్రి పంక్త్యా ... ాూది క్రమేణ చ ॥* 63

*గణేశోఽకథాన్మహా విద్యా పరావాగాది వాఙ్మయీ ।*

మూల ...్యలో మూడు కూటములున్నాయి. 1) శక్తి కూటమి. 2) కామరాజకూటమి. 3) వాగ్భవ కు... వివి అక్షరాలను మూడు భాగాలుగా విభజించారు.

1. అ నుం... ...రకు - పదహారు అక్షరాలు
2. క నుం... తచి ...కు - పదహారు అక్షరాలు
3. థ నుం... సచి ...కు - పదహారు అక్షరాలు

త్రికోణ... ...లచి మూడు రేఖల యందు ఉండగా హ ళ క్ష కారవ... మూడు కోణాల యందు ఉంటాయి. అందుచేత "అకథాదిత్రి రేఖాత్మకం, హ ళ క్షకోణం" అని చెప్పబడింది. ...గా ఒకరేఖ యందు ...నే

1. అ నుంచి అన...రకు, హ కారము కోణమందు
2. క నుం... త వరకు, ళ కారము కోణమందు
3. థ నుంచి సచి ...రకు, క్ష కారము కోణమందు ఉంటాయి.

పర, పశ్యంతి, మధ్యమా, వైఖరీ అనే వాగ్గణాలు వ్యష్టి సమిష్టి భేదములచేత విద్యా స్వరూపము.

ఈ ర...గా వర్ణ గణ స్వరూపం కలది కాబట్టి మంత్రానికి గణేశత్వం లభించింది.

కం.

## ...గ్రహ రు... ...త్వము

*... బిందు ధ్వనీనాం ... ...కూటేషు గ్రహాత్రికా ॥* 64

మంత్రము బీజ ప్రతి కూటమిలోనూ బిందువు, నాదము, నాదము లేని బీజవ ఉన్నాయి. ఈ రకంగా మూడు కూటములందు తొమ్మిది ఉన్నాయి. అందుచేత మంత్రానికి ... గ్రహత్వము చెప్పబ... ...ది.

అయితే వరివశ్యా ...డింస్యములో ఈ వివరణ బాగున్నది.

బిందుత్రయ నాదత్రయ తదన్యకూటత్రయై ర్గహత్వమిహ

1. బిందు త్రయము - మూడు కూటముల చివరనున్న బి ువులు.
2. నాద త్రయము - బిందువు తరువాత ఉండు అర్ధ చంద్రార్ధ కము
3. బిందు నాదములు లేని కూటములు - మూడు. కలసి తొమ్మిది అవుతున్నాయి.

## నక్షత్ర పము

హ్రుల్లేఖాత్రయ సంభూతై స్తిధి స రు స్తధాక్షరైః ।
అన్యైరన్యైర్ద్వా దశభిర్వ ర్ణై రేషా నక్షత్ర రూపిణీ ॥ 65

సంప్రదాయ ప్రకరణములో మూల విద్యకు 37 అక్షరాలు చెప్పటం జరిగింది. కాని ఇక్కడ అచ్చులను విడదీయకుండా లెక్క పెడితే అవి 27 అక్షరాలవుతాయి. అందుచేత పరమేశ్వరికి నక్షత్ర రూపం చెప్పబడింది.

హ్రీం కార్ఠములో హకారము, రేఫ, ఈ కారము, బిందువు, నాదము అనే ఐదు భాగాలున్నాయి. ఈ రకంగా మూడు హ్రీం కారాలలోను అవి పదిహేను అవుతున్నాయి. మిగిలిన అక్షరాలు పన్నెండు. మొత్తం 27 అవుతాయి.

## యోగినీ రూపము, రాశి రూపము

విద్యాంతర్భూత శక్త్యాద్యై శ్శాక్తై షడ్భి రధాక్షరైః
యోగినీత్వం చ విద్యయా రాశిత్వం చాన్య వర్జితైః 66

మంత్రములో హృల్లేఖలు అంటే హ్రీంకారాలు మూడు. అవి లేని కూటములు మూడు. మొత్తం ఆరు. డాకిని, రాకిని, లాకిని, కాకిని, సాకిని, హాకిని అనబడే యోగినులు ఆరుగురు. ఈ రకంగా మంత్రానికి యోగినీ రూపం వచ్చింది.

మంత్రములోని హ్రీంకారాలను తకు ముందున్న లకారములో నము చేస్తే లే అక్షరాలు పన్నెండు. అందుచేత ంత్రానికి రాశి రూపం చెప్పబడింది.

**పీఠ రూపత్వము :** మంత్రానికి గణేశరూపం - 1, గ్రహాలు - 9, నక్షత్రాలు 27. ిసులు - 6. రాశులు - 12 మొత్తం 55 శక్తి పీఠాలు ఉన్నాయి. అందుకే పరమేశ్వరి పంచాశత్పీఠ రూపిణి అనబడింది. మా పీఠాలు 51. అవి క ఓఢ్యా జాలంధర, , కామరూప అనే నాలుగు కలసి 55 పీఠాలున్నాయి.

## శ్రీచక్రము - గణేశాది రూపాలు

**ఏవం విశ్వ ప్రకారా చ చక్ర రూపా మహేశ్వరీ ।**

పరమేశ్వరి పైన చెప్పిన విధంగానే శ్రీచక్రరూపిణి కూడా అవుతున్నది. అయితే పాఠకులకు వీలుగా ఉండేందుకై శ్రీ చక్రానికి గణేశాది రూపాలను వివరించటం జరుగుతోంది.

## గణేశ రూపము

**రేఖాదళకోణగణై ర్ఘటనాచక్రే గణేశత్వమ్ ।**

శ్రీచక్రంలో భూపురంలోని రేఖలు, అష్టదళము, షోడశ దళమునందలి దళములు, త్రికోణము మొదలు చతుర్దశారము వరకు ఉన్న కోణములు గణాలుగా చెప్పబడ్డాయి. ఈ గణాలన్నీ సమూహంగా ఉండటం చేత శ్రీచక్రానికి గణేశత్వము వచ్చింది.

## యోగినీ రూపము

**స్థితి సంహృతి చక్రేద్వే, పద్మేద్వే, వృత్త భూగృహేచద్వే**

**ఏవం షడ్భిర్యోగాత్ శ్రీచక్రం, యోగినీ రూపమ్ ।**

శ్రీచక్రాన్ని మూడు భాగాలుగా విభజించవచ్చును.

1. అష్టదళము, షోడశదళము, భూపురము - సృష్టి చక్రము.
2. అంతర్దశారము, బహిర్దశారము, చతుర్దశారము - స్థితి చక్రము
3. బిందువు, త్రికోణము, అష్టకోణము - సంహృతి చక్రము.

వీటిలో స్థితి చక్రము, సంహార చక్రము. అష్ట దళము, షోడశ దళము, షోడశదళము చివరనున్న వృత్తము, భూపురము మొత్తం ఆరు. డాకిని, రాకిని, లాకిని, కాకిని, సాకిని, హాకిని యోగినులు ఆరుగురు. ఈ రకంగా శ్రీచక్రానికి యోగినీత్వం వచ్చింది.

## నవ గ్రహాత్మకము

**త్రైలోక్య మోహనాద్యై ర్నవభిశ్చక్రై ర్గ్రహత్వం చ**

శ్రీ చక్రంలోని చక్రాలు లేదా ఆవరణలు తొమ్మిది.

1. భూపురము - త్రైలోక్య మోహన చక్రము
2. షోడశదళము - సర్వాశా పరిపూరక చక్రము
3. అష్టదళము - సర్వ సంక్షోభిణీ చక్రము
4. చతుర్దశారము - సర్వ సౌభాగ్య దాయక చక్రము
5. బహిర్దశారము - సర్వార్థ సాధక చక్రము
6. అంతర్దశారము - సర్వరక్షాకరచక్రము
7. అష్టకోణము - సర్వ రోగహర చక్రము
8. త్రికోణము - సర్వ సిద్ధిప్రద చక్రము
9. బిందువు - సర్వానందమయ చక్రము.

ఈ రకంగా శ్రీచక్రంలో తొమ్మిది ఆవరణలున్నాయి. గ్రహాలు తొమ్మిది. అందుచేత శ్రీచక్రానికి గ్రహత్వం వచ్చింది.

## రాశి స్వరూపము

**పంచ చతుశ్శక్తనలాబిందుః వృత్తం చ భూబింబమ్**
**ఏవం ద్వాదశ సంఖ్యై ర్ఘటనాచ్చక్రస్య రాశిత్వస్సే**

శ్రీచక్రంలో క్రింది వైపు కోణాలు ఐదు, పై వైపు కోణాలు నాలుగు, వృత్తత్రయం ఒకటి, భూపురము, బిందువు. మొత్తం పన్నెండు. రాసుల సంఖ్య పన్నెండు. అందుచేత శ్రీచక్రానికి రాశిస్వరూపం వచ్చింది.

## నక్షత్ర రూపము

**వృత్తత్రయధరణీ త్రయ మన్వశ్రాణాం విభజ్యగణనేన ।**
**సప్తభిరితరై శ్చక్రై నక్షత్ర రూపత్వమ్ ॥**

శ్రీచక్రంలోని వృత్తాలు 3, భూపుర రేఖలు - 3, చతుర్దశారంలోని కోణాలు - 14, బిందువు, త్రికోణము, అష్టకోణము, అంతర్దశారము, బహిర్దశారము, అష్ట దళము, షోడశదళము మొత్తం ఇరవై ఏడు. నక్షత్రాలు ఇరవై ఏడు, కాబట్టి శ్రీచక్రానికి నక్షత్ర రూపం చెప్పబడింది.

## గురు శిష్యులకు గణేశాది రూపము

*దేవ్యా దేహో యధా ప్రోక్తో గురుదేహస్త థైవ చ ॥* 67

*తత్ప్రసాదా శ్చ శిష్యోఽపి తద్రూపస్సన్ ప్రకాశతే.*

పరదేవత, మంత్రము మాదిరిగానే గురుశిష్యులకు కూడా గణేశాది రూపత్వమున్నది అని చెప్పటం జరిగింది.

## కౌళికార్థ ఉపసంహారము

*ఇత్యేవం కాళికార్థస్తు కధితో వీరవందితే ॥* 68

వీరులనబడే ఉపాసకుల చేత నమస్కరించబడు ఓ భైరవీ, ఈ ప్రకారము కౌళికార్థము చెప్పబడినది.

## సర్వ రహస్యార్థము

*తధా సర్వ రహస్యార్థం కధయామి తవానఘే*

పైన భావార్థము చెప్పిన విధముగానే అతి గోప్యమైన సర్వ రహస్యములను చెప్పుచున్నాను.

## రహస్యములు

*మూలాధారే తటి ద్రూపే వాగ్భవాకారతాంగతే ॥* 69

*అష్టత్రిశత్కళా యుక్త పంచాశద్వర్ణ విగ్రహా ।*

*విద్యా కుండలినీ రూపా మండల త్రయ భేదినీ ॥* 70

*తటిత్కోటినిభ ప్రఖ్యా బిసతంతు నిభాకృతి:*

*వ్యోమేంద్రు మండలాసక్తా సుధా స్రోత: స్వరూపిణీ ॥* 71

*సదావ్యాప్త జగత్కృత్స్నా సదానంద స్వరూపిణీ ।*

*ఏషా స్వాత్మేతి బుద్ధిస్తు రహస్యార్థో మహేశ్వరి ॥* 72

వాగ్భవాకారము అంటే ఏ కారము. సంస్కృతములో ఈ అక్షరానికి మూడు రేఖలు ఉంటాయి. అందుచేత త్రికోణము అని చెప్పబడింది. మూలాధార చక్రమందు త్రికోణమున్నది.

దానియందు విద్యుత్ కాంతులలో సమానమైన కాంతి గల కుండలిని ముప్పది ఎనిమిది కళలతో కూడి ఉన్నది.

1. అకారము నుంచి అః వరకు చంద్ర కళలు - 16
2. క నుంచి భ వరకు రెండు అక్షరములకు ఒక కళ చొప్పున సూర్య కళలు - 12
3. య నుంచి క్ష వరకు అగ్ని కళలు - 10

మొత్తం కళలు 38

| | | |
|---|---|---|
| మంత్రములో మొదటి కూటమి | - | అగ్ని మండలము |
| రెండవ కూటమి | - | సూర్య మండలము |
| మూడవ కూటమి | - | చంద్ర మండలము |

ఈ విధమైనది శ్రీవిద్య. ఇదే కుండలినీ రూపమైనది. మూలాధారములో కుండలిని స్వయం భూలింగానికి మూడున్నరచుట్లు చుట్టుకుని అధోముఖంగా నిద్రిస్తూ ఉంటుంది. సాధకుడి ప్రయత్నముతో కుండలిని జాగృతమై, ఊర్ధ్వ ముఖంగా సుషుమ్న గుండా బయలు దేరి, గ్రంధి త్రయాన్ని భేదించుకుని కోట్ల మెరుపుల కాంతి వంటి కాంతితో శిరస్సుకు రెండు అంగుళాల ఎత్తు ఉండే సహస్రారము చేరుతుంది. సహస్రారము అధోముఖంగా ఉంటుంది. సరి అయిన సాధనతో అది ఊర్ధ్వ ముఖము అవుతుంది అని అనుభవజ్ఞులు చెబుతున్నారు. సహస్రారంలో చిత్ అనే చ [illegible] మండలమున్నది. కుండలిని ఎప్పుడైతే సహస్రారము చేరిందో అప్పుడు అక్కడి నుండి చంద్రధారలు వర్షిస్తాయి. అప్పుడు కుండలిని ఆ ప్రవాహ రూపిణిగా మారి, అమృత బిందు రూపమైన మాతృకాక్షరములచేత ఆజ్ఞా [illegible] ము నుండి ఆధార చక్రం దాకా అన్ని దళాలను అక్షర రూపంలోతడుపుతుంది. ఈ రకంగా బ్రహ్మానంద మనుభవించి, తిరిగి ఆధార [illegible]ం చేరి నిద్రిస్తుంది. శక్తితో కూడిన ఈ కుండలినియే సాధకుని ఆత్మ. ఈ రకంగా [illegible] భావన ఉండటమే సర్వరహస్యము. వి[illegible] కుండలినీ, ఆత్మ ఈ మూడు ఒక్కటే. వీటికి తేడా లేదు.

## మ[illegible] త్వార్థము

**మహాతత్వార్థ ఇతి [illegible] హోత [illegible]యామితే ।**

ఇప్పుడు మహాతత్వార్థము వివరించబడుతోంది.

నిష్కళే పరమే సూక్ష్మే నిర్లక్ష్యే భావవర్జితే ॥ 73

వ్యోమాతీతం పరేతత్వే ప్రకాశానంద విగ్రహే ।
విశ్వోత్తీర్ణే విశ్వమయే తత్వే స్వాత్మని యోజనం ॥ 74

పరతత్వము నిష్కళ - అంటే అవయవములు లేనిది. అన్నిటికన్నా గొప్పది. సూక్ష్మాతి సూక్ష్మమైనది. నిర్లక్ష్యే - కంటికి కనిపించనిది. భావ వర్జితే - అవాఙ్మానస గోచరమైనది. ఆకాశానికి కూడా కారణమైనది. అవ్యక్తమైనది. శాశ్వతమైనది. సచ్చిదానంద రూపమైనది. జగత్తు అంతా వ్యాపించినది. వెలుగులకు వెలుగు. కాంతులకు కాంతి అయినది. ఇటువంటి పరమాత్మయందు సాధకుడు గురువు వలన, దేవతల వలన, శాస్త్రములు చదువుట వలన, జ్ఞానము పొంది, దాని వలన కలిగిన ఐక్య భావము చేత కలిగే అఖండమైన రసత్వమే మహా తత్వార్థము అని చెప్పబడినది.

భావార్థము, శాస్త్రార్థము, వాచ్యార్థము, లక్షణార్థము, ఆప్త వాక్యము, ధ్వన్యర్థము మొదలైనవి శివుణ్ణి గురించి మాత్రమే చెప్పాయి. అంతే కాని శక్తిని గురించి కాదు అని కొందరి వాదన. ఇక్కడ శివశక్తులకు భేదము లేదు. ఇద్దరూ కలిసి ఒకటిగానే ఉంటారు. విడివిడిగా కాదు. కాబట్టి ఏ అర్థం ఎవరిని గురించి చెప్పినా ఇద్దర్ని గురించి చెప్పినట్లే అని గుర్తుంచుకోవాలి.

## స్వాత్మ తత్త్వము

తదా ప్రకాశ మానత్వం తేజసాం తమసామపి ।
అవినా భావ రూపత్వం తస్మాదైక్యస్య సర్వతః ॥ 75

చరా చర జగత్తులో ఏ వస్తువు ప్రకాశించాలన్నా దానికి కారణము పరమేశ్వరుని ప్రకాశమే. సాధకుని యొక్క ఆత్మ, అంతఃకరణలు, ఇంద్రియాలు, సూర్యుడు, అగ్ని, జడ స్వభావము కలిగిన ఘటాదులు వీటన్నింటి ప్రకాశానికీ పరమేశ్వరుడే కారణము. ఆత్మ ఏ విధంగా ప్రకాశిస్తున్నదో విశ్వము కూడా అదే విధంగా ప్రకాశిస్తున్నది. ఆత్మ పరమేశ్వరుని కన్న వేరైనది కాదు. అటువంటి ఆత్మ విషయంలో అనుభవమే ప్రమాణము.

## సాధన

*ప్రకాశతీ మహాతత్వం దివ్య క్రీడా రసోజ్వలే ।*

ఈ రకంగా జీవుడికి, పరమేశ్వరుడికి అభేదము చెప్పటమే మహాతత్వము. ఇది శివశక్తుల సామరస్యంచేత నిర్మలమైన సాధకుని మనస్సులో ప్రకాశిస్తున్నది. ఈ విధమైన తత్వము (ఉపాసన) సాధన చేతనే ప్రాప్తిస్తుంది. మహాతత్వము స్వయం ప్రకాశము కలది.

## మహాతత్వ సాధనా ఫలము

*నిరస్త సర్వ సంకల్ప వికల్ప స్థితి పూర్వక: ॥* 76

*రహస్యార్ధోమహాగుప్త స్సద్య: ప్రత్యయ కారక: ।*

సాధకులు తమ సందేహాలు తీర్చుకున్న తరువాత వారికి పైన చెప్పిన భావార్ధము మొదలైన ఆరు రకాల అర్ధాలు మనస్సుకు గోచరిస్తాయి. దీని గురించి ఏ విధమైన సందేహాలు లేని వారు మాత్రమే దీనికి అర్హులు. మనసా వాచా కర్మణా నమ్మకమున్న వారికి మాత్రమే దీని మీద అధికారముంటుంది. ఈ సాధన చేస్తే వెంటనే ఫలితము కనిపిస్తుంది. 'శివోహమస్మి' నేనే శివుడను అనే భావము కూడా అతడికి ఉదయిస్తుంది.

*మహాజ్ఞానార్ణవే దృష్ట శ్శంకా తత్రవ పార్వతి ॥* 77

*విద్యా పీఠ నిబంధేషు సంస్థితో దివ్య సిద్ధిద:*

మహాజ్ఞానార్ణవ తంత్రంలో దివ్య క్రీడా సాధనలో నేను చెప్పిన విషయాల మీద ఏ మాత్రం అనుమానము ఉండకూడదు. ఇది చాలా రహస్యమైనది. శ్రీవిద్యలో  చెప్పబడిన పీఠములు, కకారాది వర్ణములు, ఆధార చక్రము మొదలు ఉన్మని వరకు గల స్థానములందు ధ్యానము చేయుట మొదలైన విషయములన్నీ అగస్త్య, పరశురామ సూత్రములందు వివరించబడినాయి.

ఈ విద్య దివ్యసిద్ధినిస్తుంది. స్వర్గమందు పుట్టింది కాబట్టి దివ్యమైనది. అంటే పరమ శివమైనది. పరమేశ్వరుడు తనకన్న వేరు కాదను భావనే దివ్యసిద్ధి.

## అర్థాలు

కౌళాచారపరైర్దేవి పకా భావనాపరై : ॥ 78

యోగినీ మేళనోడపాద్యః ప్రాప్త దివ్యాభిషేచనైః ।

శంకాక క విగప్స్యేర్దాముదిత మానసైః ॥ 79

పారంపర్యంప్తా విజ్ఞాత రహస్యార్థ విశారదైః ।

లభ్యతే నాన్యధాదేవి త్వాం శపే కులసుంద ॥ 80

కులార్ణవ తంత్రంలోని ఏకాదశోల్లాసములో చెప్పబడిన సమయాచారులు కూడా కౌళాచారపరాయణులే. పాదుకా అంటే ప్రకాశ విమర్శ సమష్టి రూపమైనది. కౌళాచారులు ఎప్పుడూ మంత్ర చక్రపాదుకా భావనాపరులై ఉండాలి. అటువంటి వారి సమూహాన్ని 'యోగినీ మేళనము' అంటారు. మాతృమాన మేయ ప జ్ఞానము పూర్తిగా కలవారు యోగిన్యులు. అటువంటివారు అంతర్ముఖ భావన చేసి ఆత్మసాక్షాత్కారము పొ ందుతారు. యోగినీ మేళనము టే చక్రార్చనకు సంప్రదాయ విరుద్ధమైన భావాలు లేనివారందరు అని కూడా అర్థం. ఒక చోట చేరి చక్రార్చన చేసే వారందరినీ 'యోగినీ మేళనము' అంటారు. వీరు పరమేశ్వర స్వరూపులైన గురువుల కరుణను పూర్తిగా పొంది ఉన్నారు. వీరికి అర్చన యందు, సాధన యందు, హోమాలయందు, అర్చనా ఫలమందు, తనకు పరమేశ్వరునికీ భేదము లేదనే భావమునందు, మరి ఏ ఇతర విషయములందూ ఏ రకమైన అనుమానములుండవు. వీరిని 'ముదితులు' అంటారు. అంటే సాంసారిక బంధనాలపై విరక్తి పొందినవారు. నిత్యానుసంధాన పరులు. గురువు నుంచి పారంపర్యంగా రహస్యములు తెలుసుకొన్నవారు. భావార్థాది షడర్థ రూపులు. విద్య యందు ప్రవీణులైన వారి నుంచి మాత్రమే ఈ విషయాలు తెలుసుకోవాలి. అం ని ఇతరుల వల్ల తెలుసుకోలేరు అని ఓ భైరవి ని మీద ఒట్టు పెట్టి చెబుతున్నాను. పరమేశ్వరి కౌళాచార రసికురాలు కాబట్టి కులసుందరి అని సంబో ధించబడి నది.

## పారంపర్యము

పారం వివీ మే జ్ఞానమాత్రేణ గర్వితాః ।

తేషాంపర్యయన్నా పేన వికుర్వంతి మరీచ : ॥ 81

గురు పరంపరలేనివారు కేవలము పుస్తకాలు చదివి విషయం తెలుసుకున్నవారు గర్వితులౌతున్నారు. వారికి సమయాచార పరిజ్ఞానముండదు. మంత్రోచ్ఛారణ సరిగా ఉండదు. కాబట్టి పరదేవత యొక్క మరీచి రూపశక్తులు, డాకిన్యాది యోగినులు అటువంటి వారి మనస్సు వికారము పొందిస్తాయి. రోగాలు కలిగిస్తాయి. పరలోక సుఖము లేకుండా చేస్తాయి.

## చక్రార్చన ఎప్పుడు చెయ్యాలి ?

*యస్తు దివ్య రసాస్వాద మోదమాన వివర్ధన : ।*
*దేవతా తిథి నక్షత్రే వారేఽవిచ వివస్వతః ॥* 82

*మరీచిన్ ప్రీణయత్యేవ మదిరానంద ఘూర్ణితః ।*
*సర్వదా చ విశేషేణ లభతే పూర్ణ బోధితామ్ ॥* 83

శివ సామరస్యముచే ఉత్పన్నమైన రసము ఆనందదాయకమైనది. దేవతా తిథులు అష్టమి, చతుర్దశి. దేవతా నక్షత్రము - పుష్యమి. సాధకుని నామనక్షత్రము, జన్మ నక్షత్రము పవిత్రమైనవి. స్త్రీ పురుషుల నక్షత్రాలలో పురుషులకే ప్రాధాన్యత ఉన్నది. గురు, ఆదివారములు యుక్తమైనవి. ఈ దినములలో యోగినీ మేళనము చెయ్యాలి. ఆ రకంగా నియమ ప్రకారము చక్రార్చన చేసినట్లైతే అణిమాది అష్టసిద్ధులు సాధకుణ్ణి అనుగ్రహిస్తాయి. శివశక్తి సామరస్య రసము అనుభవించిన సాధకుడు మంత్ర పూరితమైన మదిరను సేవించి మదఘూర్ణితుడు కావాలి. నియమ ప్రకారము చక్రార్చన చేస్తే ఆత్మబోధ కలుగుతుంది.

## ఆత్మబోధ

*ఏవం భావస్తు దేవేశి దేశి కేంద్ర ప్రసాదతః ।*
*మహాజ్ఞానమయోదేవి సద్యః సంప్రాప్యతే నరైః ॥* 84

ఈ రకమైన భావన, లేక పూర్ణ బోధ కేవలము గురువు యొక్క అనుగ్రహము వల్ల మాత్రమే కలగాలి. గురువు యొక్క కరుణ చేతనే సంసార బంధము తెగి, ఆత్మ జ్ఞానము కలుగుతుంది. గురువు కేవలము పరమేశ్వర స్వరూపుడు. ఈ అనుభవము అతడి నుంచే పొందాలి. అంతే గాని పుస్తకాలు చదివితే రాదు.

ఏవమే తత్ప్రదం జ్ఞానం విద్యార్ణాగ మగోచరమ్ ।
దేవి గుహ్యప్రియేణైవ వ్యాఖ్యాతం దుర్గి షడ్విధమ్ । 85
సద్యో యస్య ప్రబోధేన వీరచక్రేశ్వరో భవేత్ ॥

ఈ విధమైన మంత్ర సంకేత ప్రకారమైన పరిపూర్ణ బోధ యొక్క శివత్వము గురుకటాక్షము లేకుండా రాదు. విద్యలోని కకారము మొదలైన అక్షరాలు - అగమాలు. అవి అపౌరుషేయాలు. మంచిని బోధిస్తాయి. ఈ విషయము పంచకోశపరమైన హృదయస్థానంలో పరా రూపంగా ఉంటుంది. దీనివల్ల అన్ని విషయాలు తెలుస్తాయి కాబట్టి జ్ఞానము అని చెప్పబడింది. 'ప్రియేణైవ' అని చెప్పటంవల్ల శుశ్రూష మొదలైన వాటి చేత కలిగిన ప్రేమచేతనే ఈ విషయాలు చెప్పబడతాయి.

ఈ జ్ఞానము కలిగిన వీరులైన ఉపాసకులకు వెంటనే ఈశ్వర భావము కలుగుతుంది.

పంచదశీ మహామంత్రానికి యోగినీ హృదయంలో ఆరు అర్థాలు మాత్రమే చెప్పబడ్డాయి. కాని ఇంకా అనేక అర్థాలున్నాయి.

అథాత: పూర్ణగాయత్ర్యా: ప్రతిపాద్యోర్థ ఆదిమః ।
భావార్థ స్సంప్రదాయార్థో నిగర్భార్థ స్తురీయక : ॥
కౌళికార్థో రహస్యార్థో మహాతత్త్వార్థ ఏవ చ ।
వామార్థ శ్శబ్ద రూపార్థశ్చార్థో నామైక దేశగ: ॥
శాక్తార్థ స్సామరస్యార్థ స్సమస్త సగుణాత్మకా ।
మహావాక్యార్థ ఇత్యార్థా పంచదశ్యా: స్వసమ్మితా: ॥

1. గాయత్ర్యర్థము 2. భావార్థము 3. సంప్రదాయార్థము 4. నిగర్భార్థము
5. కౌళికార్థము 6. రహస్యార్థము 7. మహాతత్త్వార్థము 8. నామార్థము
9. శబ్దార్థము 10. నామైక దేశార్థము 11. శాక్త్యార్థము 12. సామరస్యార్థము
13. సమస్తార్థము 14. సగుణార్థము 15. మహా వాక్యార్థము

వీటి మీద వివరణ కోసం నాచే వ్రాయబడిన "శ్రీవిద్యా పంచదశి" యందుగాని, భాస్కరరాయల వారు వ్రాసిన వరివస్యా రహస్యమునందుగాని చూడగలరు.

# 3. పూజా సంకేతము

## ఉపోద్ఘాతము

**పూజా సంకేత మధునా కథయామి తవానఘే ।**
**యస్య ప్రబోధమాత్రేణ జీవన్ముక్తః ప్రమోదతే ॥ 1**

గతంలో చక్రసంకేతము, మంత్ర సంకేతములందు కొన్ని ... త్రాలు చెప్పబడినాయి. ఈ రెండింటినీ తెలుసుకుని పూజించటం వలన పూజా సంకే ... మం...లన కలిగే ఫలము కలుగుతుంది. కేవలము పూజా సంకేతము వల్లనే జీవన్ముక్తి స్థితిప్రచేటప్పుడు సంకేత త్రయము వల్ల కలిగే ఫలితము చెప్పనలవికాదు.

## పూజా విభజన

**తవ నిత్యోదితా పూ... తిభిర్భేదైర్వ్యవస్థితా ।**
**పరాచాప్యపరా గౌరి తృతీయా చ పరాపరా 2**

పరమేశ్వరి పూజ మూడు ... కాలు 1) పరాపూజ 2) అ... ...జ 3) పరాపర పూజ. పూర్వ చతుశ్శతిలో పూజ మూడు ర...లు అని చెప్పబడింది. 1) నిత్యాపూజ 2) కామ్యపూజ 3) నైమిత్తిక పూజ. దీనిలో నిత్యపూజ తిరిగి మూడు రకాలు. 1) పరా 2) అపరా 3) పరాపర అయితే కొంతమంది

నిత్యపూజ - పరా ప్రధానమైనది

కామ్య పూజ - అపరా ప్రధానమైనది

నైమిత్తిక పూజ - ... ...ర ప్రధానమైనది అంటారు

మూడు రకాలైన పూజలందురాహడా జపము, సాధన మొ... న వాటివల్ల ఫలితము సిద్ధిస్తుంది. దేవతకు మూడు రు... ...న్నాయి. 1) స్థూల రూపము ...దసూక్ష్మ రూపము 3) పరా రూపము. నిత్య పూజలో ఈ ...మూడింటికీ సంబంధ... ...ది ...న్న... కాబట్టి ఉపాసకులు ఈ మూడు రూపాలు ధ్యానించాలి.

స్థూల రూపంలోనే దేవత ఫలితమిస్తుంది కాబట్టి కామ్య పూజలో స్థూల రూపానికే ప్రాధాన్యత ఉన్నది. అందుచేత కామ్యపూజలో సూక్ష్మ, పరాపూజలు అంగములు. నిత్య, నైమిత్తిక పూజలయందు సాధకుడికి అధికార భేదము చేత మూడు రూపాలకూ ప్రాధాన్యత ఉన్నది. అవి కేవలము మోక్షము కోసం చేసేవి.

ఉత్తమాధికారులకు పరాస్వరూపము ప్రధానము. మిగిలిన రెండు పూజలు ఉపయోగమును బట్టి అంగములుగా మారతాయి.

మధ్యమాధికారులకు సూక్ష్మ రూపమే ప్రధానము. మిగిలినవి అంగములు.

అధమాధికారులకు (తానువేరు, దేవత వేరు అనే భ్రాంతి కలవారు )స్థూల రూపమే ప్రధానము. మిగిలినవి అంగములు.

కామ్యపూజలో కూడా దేవతార్పణముగా పూజ చేసినట్లైతే మోక్ష సాధనకుపయోగిస్తుంది. సాధకుడు ద్వైతభావన పోవటం కోసం చేసే పూజ పరాపరపూజ.

*ప్రథమాద్వైత భావస్థా సర్వప్రసరగోచరా ।*
*ద్వితీయా చక్ర పూజాచ సదా నిష్పాద్యతే మయా ॥* 3
*ఏవం జ్ఞానమయే దేవి తృతీయా తు పరాపరా*
*ఉత్తమా సా పరా జ్ఞేయా విధానం శృణు సాంప్రతం ॥* 4

**రూపము :** ఒక వస్తువును గురించి తెలుసుకోవటంగాని, చూడటంగాని ఇంద్రియాలవల్లనే జరుగుతుంది. దీనికి మూలము సచ్చిదానంద స్వరూపము. దీన్నే రూపము అంటారు.

*అస్తిభాతి ప్రియం రూపం నామచేత్యం శ పంచకం ।*
*ఆద్యత్రయం బ్రహ్మరూపం జగద్రూపం తతోద్వయం ॥*

దీన్ని అంశపంచకము అంటారు.

అస్తి - ఉంటున్నది, భాతి - ప్రకాశించుచున్నది. ప్రియం - ప్రియమైనది, ఈ మూడూ పరబ్రహ్మ స్వరూపాలు. రూపము, నామము అనేవి జగద్రూపాలు. అద్వైత భావనలో పరబ్రహ్మ ఒక్కడే. అంటే జగత్తు అంతా బ్రహ్మమయం. ఈ విధమైన మనః ప్రవృత్తితో చేసే పూజ పరాపూజ. ఇది మొదటిది.

రెండవది : పూజ. భూపురం దగ్గర నుండి బిందువు వరకు శ్రీ చక్రమునాచేత పూజింపబడుతోందన్నుకొని చేసే పూజను అపరాపూజ అంటారు. ఇది పూర్వ జన్మ సుకృతము వలన మాత్రమే కలుగుతుంది. ద్వైత భావనలో - అపరాపూజ, అద్వైత భావనలో - పరాపూజ జరుగుతాయి. ద్వైత భావన నశించే దశలో పరాపర భావన కలుగుతుంది. వీటిలో పరాపూజ ఉత్తమమైనది. పరాపర పూజ మధ్యమము, అపరాపూజ - అధమము.

ఈ విధంగా పూజించే వారి ఉపాధులు మూడు రకాలుగా ఉంటాయి. వాటిని బట్టి వారిని ఉత్తములు, మధ్యములు, అధములు అని చెప్పవచ్చును.

## పరాపూజ

***మహా పద్మవనాంతస్థే వాగ్భవే । గురుపాదుకాం ।***
***ఆప్యాయిత జగద్రూపాం పరమామృత వర్షిణీం ॥*** 5

మహా పద్మము అంటే సహస్ర దళ పద్మము. దాని మధ్యలో వాగ్భవము అంటే ఏకారము లేక త్రికోణమున్నది. ఆ త్రికోణంలో గురుపాదుకా మంత్రముచేత చెప్పబడిన పరశివ రూపముతో కుండలినీ శక్తి కలవటంచేత అమృతపు బిందువులు జడివానగా కురిసి శరీరంలోని డెబ్బది రెండు వేల నాడీ మండలాన్ని తడుపుతుంది.

సాధకుడు యోగసాధనతో కుండలినీ శక్తిని గనక జాగృతం చేసినట్లైతే, అది సుషుమ్నా నాడిగుండా సహస్రారం చేరి, సహస్ర దళకమలాన్ని నోటితో కరిచి పట్టుకుంటుంది. కుండలిని అగ్నితత్త్వం కావటం చేత సహస్ర దళకమలంలో ఘనీభవించిన అమృతము ఆ వేడికి ద్రవించి శరీరంలోని డెబ్బది రెండు వేలనాడీ మండలాన్నీ తడుపుతుంది. ఈ అమృతము మాతృకాక్షరముల రూపంలో ఉంటుంది. కాబట్టి మాతృ కాక్షరముల రూపంలో ఉన్న అమృతము చరాచరాత్మకమైన సాధకుని శరీరంలోని సమస్త నాడీ మండలాన్నీ తడుపుతున్నది. ఈ శరీరము చరాచరాత్మకమైనది. ఈ శరీరంలో మన ఇష్టానుసారము కదిలే కాళ్ళు, చేతులు మొదలైనవి చరములు. ఇష్టానుసారము కదలని హృదయము వంటివి అచరములు.

## గురుపూజా ప్రాధాన్యత

***సంచిన్త్య పరమాద్వైత భావనామృత ఘూర్ణిత: ।***
***దహరాంతర సంసర్పన్నాదాలోక మృత్పర: ॥*** 6

తన స్వరూపమే అయిన కుండలిని భావించి, సాధకుడు తన ఆత్మ, గురువు, మంత్రము ఒకటే భావనతో గురువును అర్చించాలి. అదే గురుపూజ. తరువాత గురు ప్రసాదము తీసుకోవాలి. గురువు యొక్క అనుగ్రహమునే గురువు ఇచ్చే ప్రసాదము అంటారు. ఆ అనుగ్రహముతో కలిగే పరమ అద్వైత భావనతో కలిగే ఆనందముతో సంతుష్టుడై పరిపూర్ణుడు కావాలి. హృదయాకాశము నుంచి వచ్చిన నాదము - అనాహత ధ్వని. ఇది సర్వమంత్ర ప్రకృతి. దీని నుంచే అన్ని వర్ణములూ ఉద్భవించాయి. అందుచేతనే ఇది అన్ని మంత్ర కూ ప్రకృతి భూతమైనది. ఆ నాదా అనుసంధానము చె య్యటంలో సాధకుడు నియజ్ఞాల కావాలి.

## తాదాత్మ్యము

**వికల్ప రూప సంజల్ప విముఖో ఉన్తర్మ స్సదా ।**
**చిత్కల్లోల్లాస దలిత సంకోచస్స్వతిసుందరః ॥**
**ఇం( రు ప్రీణ నద్రవ్యైర్విహిత స్వాత్మపూజన ః ॥** 7

జపం చేసేటప్పుడు మంత్రంలోని బీజాక్షరాలను పదే ఉచ్చరిస్తూ ఉంటాము. ఆ అక్షరాల వలన నాదము పుడుతుంది. అయితే వర్ణానికీ వర్ణానికీ మధ్య, పదానికీ పదానికీ మధ్య ఈనాదము వికల్పమవుతుంది. కొన్ని సందర్భాలలో మనస్సే వికల్పము పొందుతుంది. కాబట్టి జపము అనేది వాచ్య పరంగానూ, మానసికపరంగానూ, నాదము యొక్క వికల్పమైన వర్ణోచ్చారణ రూపము. సాధకుడు అటువంటి జపాన్నుంచి విముఖుడై అంటే ఆ మంత్ర జపాన్ని వదలివేసిన వాడై అనాహత ధ్వనిని అనుసంధానము చెయ్యాలి. ఈ అనుసంధానముచేత చిత్కల ఉద్భవి ది. అంటే పరమేశ్వరి తనకన్న వేరు కాదని భావము ఉదయిస్తుంది. ఆ భావము చేత సా పరమానందము పొందుతాడు. ఈ రకంగా సాధకుడు సహస్రారంలోని గురువుకూ, అనా ం ధ్వనికీ, చిత్కలా రూపమైన ప వతకూ, తనకూ భేదము లేదని తెలుసుకుని తా త్మ్యము చెందుతాడు.

ఇంద్రియాద్రా ప్రీతి కలిగించు గంధము, ధూపము మొదలైన వస్తువుల చేత, తన ఆత్మ కంటే వేరుకాని పరదేవతను పూజించటమే లమిత్యాది పంచపూజ

## షోఢాన్యాసములు

*న్యాసం నిర్వర్తయేద్దేహే షోఢాన్యాస పురస్సరం ।*
*గణేశై: ప్రధమోన్యాసో ద్వితీయస్తు గ్రహైర్మత: ॥* **8**

*నక్షత్రైశ్చ తృతీయస్యా ద్యోగినీ భిశ్చతుర్థక : ।*
*రాశిభి: పంచమోన్యాస: షష్ఠ: పీఠైర్ని గద్యతే ॥* **9**

*షోఢాన్యాస స్త్వయం ప్రోక్త: సర్వత్రైవాపరాజిత: ।*

పూజానంతరము శరీరమున షోఢాన్యాసము చెయ్యాలి. సాధకుడు ముందుగా సంధ్యావందనము, బ్రహ్మ యజ్ఞము నిర్వర్తించి, పూజా గృహానికి వెళ్ళి ద్వార పూజ చెయ్యాలి. ఆ తరువాత పూజాగృహము లోపలికి వెళ్ళి దీపనాధుని పూజించాలి.

*ఏ హ్యేహి దీపదుర్గేమమ సర్వ సౌభాగ్యం కురుకురు స్వాహా ॥*

తరువాత అంతర్మాతృకాన్యాసము, బహిర్మాతృకా న్యాసము చెయ్యాలి. ఆ తరువాత షోఢాన్యాసము చెయ్యాలి. షోఢాన్యాసము ఆరు విధాలు.

| | | |
|---|---|---|
| 1. గణేశన్యాసము | 2. గ్రహన్యాసము | 3. నక్షత్ర న్యాసము |
| 4. యోగినీ న్యాసము | 5. రాశి న్యాసము | 6. పీఠన్యాసము |

ఈ న్యాసము గనక చేసినట్లైతే సాధకుడికి అపజయము అనేది ఉండదు. అన్నిటా విజయం పొందుతాడు.

షోఢాన్యాసాలను గురించి వామకేశ్వర తంత్రంలో కూడా చెప్పటం జరిగింది. అక్కడ పై శ్లోకాలు చెప్పిన తరువాత

*షోఢాన్యాస ప్రకారం చ కథయామి తవానఘే ॥*

అని చెప్పబడింది.

## న్యాస మహిమ

*ఏవం యో న్యస్త గాత్రస్తు స పూజ్య: సర్వయోగిభి :* **10**

*నాస్త్యస్య పూజ్యో లోకేషు పితృమాతృ ముఖోజన: ।*

*స ఏవ పూజ్య: సర్వేషాం స స్వయం పరమేశ్వర: ॥* **11**

షోఢాన్యాస విహీనం యం ప్రణమే దేవ పార్వతి ।
సోఽచి రామృత్యుమాప్నోతి కం చ ప్రపద్యతే ॥ 12

షోఢాన్యాస ప్రకారం చ కథయస్వ తవానఘే ।

ఈ న్యాసాలను ఎల్లప్పుడు భావించటం చేత సాధకుడు సాక్షాత్తూ పరమే ఏడౌతాడు. అందరిచేత పూజింపబడతాడు. అటువంటి క్తిని తనకు నమస్కారం చెయ్యకుండా ఎవరైనా బల తం చేసినట్లైతే అటువంటివాడు ఇష్వ్యస్త్రాలలో పతితుడవుతాడు. కొద్దికాలంలోనే మరవంచి నరకానికి పోతాడు.

## గణపతి మాలు

విఘ్నేశో విఘ్నరాజశ్చ వినాయ శివోత్తమా ॥ 13
విఘ్నకృద్విఘ్న హర్తా చ గణరాట్ గణనాయక : ।
ఏకదంతో ద్వి దంతశ్చ గజవక్త్రో నిరంజనః ॥ 14
కపర్దవాన్ దీర్ఘముఖః శంకుకర్ణో వృషధ్వజః ।
గణనాథో గజేంద్రశ్చ శూర్పకర్ణ స్త్రిలోచనః ॥ 15
లంబోదరో మహానాద శ్చతుర్మూర్తి స్సదాశివః ।
ఆమోదో దుర్ముఖశ్చైవ సుముఖంచ సదాశివః ॥ 16
ఏకపాదో ద్విజిహ్వాశ్చ శూరో శ్చ షణ్ముఖ : ।
వరదో వామదేవశ్చ వక్రతుండ ద్విరండక : ॥ 17
సేనానీర్గ్రామణీర్మత్తో విమత్తో మత్తవాహనః ।
జటీముండీ తథాఖడ్గీ వరేణ్యోవృష కే ః ॥
భక్ష్యప్రియో గణేశశ్చ మేఘనాథో గణేతనః । 18

ఈ నామాలలో తేడాలు కనిపిస్తున్నాయి. శ్వ

## గణేశ ...

తరుణారుణ సంకాశాన్ గజవక్త్రాన్ త్రి నాన్
పాశాంకుశవరాభీతి హస్తాన్ శక్తి సమన్వితాన్ । 19

**ఏతాం స్తువిన్యసేద్దేహే మాతృకా స్థాన్ముత్ప్రియే ॥** 20

పైన చెప్పిన గణేశులను మాతృకా స్థానాలు న్యాస్పబడిన యాభై ఒక్క స్థానాలలోనూ న్యాసము చెయ్యాలి. న్యాసము చెయ్యటము అంగా ఉంచటము అని ర్థము. మంత్రము చెబుతూ నిర్దేశించిన స్థానాన్ని తాకాలి. అలా చేసి ఆ దేవతను, ఆ స్థానంలో ఉంచటం జరుగుతుంది. గం అం విఘ్నేశ్వరాయ శ్రీయై నమః లలాటే ఈ రకంగా యాభై ఒక్క స్థానాలలోనూ గణపతిని ప్రతిష్టించాలి.

**శ్రీశ్చ హ్రీశ్చైవ తుష్టిశ్చ శాంతి: పుష్టి: సరస్వతీ ॥**
**రతిర్మేధా తథా కాంతి: కామినీ మోహినీ జటా ।**
**తీవ్రాచ జ్వాలినీ నందా సురసా కామరూపిణీ ॥**
**ఉగ్రాచ జయినీ సత్యావిఘ్నేశానీ స్వరూపిణీ ।**
**కామదా మదజిహ్వాచ వికటాఘూర్ణితాననా ॥**
**భూతిర్భూమి : సతీరమా మానుషీ మకరధ్వజా ।**
**వికర్ణా భృకుటీ లజ్జా దీర్ఘఘోణా ధనుర్ధరా ॥**
**తథైవ యామినీ రాత్రిశ్చంద్ర కాంతా శశి ప్రభా ।**
**లోలాక్షీ చపలాబుద్ధి ర్దుర్భగా సుభగా తథా ॥**
**దుర్గా గుహప్రియాకాళీ లలజిహ్వా చ శక్తయః**

ఇందాక చెప్పిన గణేశ నామాలకు ఈ శక్తులను చేర్చి న్యాసము చెయ్యాలి.

| | |
|---|---|
| గం అం విఘ్నేశ శ్రీభ్యాం నమః | గం ఋం విఘ్నరాడ్రతిభ్యాం నమః |
| గం ఆం విఘ్నరాజ హ్రీభ్యాం నమః | గం ౠం గణనాయక మేధాభ్యాం నమః |
| గం ఇం వినాయక తుష్టిభ్యాం నమః | గం ఌం ఏకదంత కాంతిభ్యాం నమః |
| గం ఈం శివోత్తమ శాంతిభ్యాం నమః | గం ౡం ద్వి దంత కామినీభ్యాం నమః |
| గం ఉం విఘ్నకృత్పుష్టిభ్యాం నమః | గం ఏం గజ వక్త్ర మోహినీభ్యాం నమః |
| గం ఊం విఘ్న హృత్సరస్వతీభ్యాం నమః | గం ఐం నిరంజన జటాభ్యాం నమః |

గం ఓం కపర్దభ్య గాభ్యాం నమః
గం ఔం దీర్ఘ ముక్తీజ్వాలినీభ్యాం నమః
గం అం శంకు కర్ణ నందాభ్యాం నమః
గం అః వృష ధ్వజ సురసాభ్యాం నమః
గం కం గణనాధ కామరూపాభ్యాం నమః
గం ఖం గజేంద్రోగ్రాభ్యాం నమః
గం గం శూర్పకర్ణజయినీభ్యాం నమః
గం ఘం త్రిలోచన సత్యాభ్యాం నమః
గం ఙం లంబోదర విఘ్నేశానీభ్యాం నమః
గం చం మహానాద సురూపాభ్యాం నమః
గం ఛం చతుర్మూర్తి కామదాభ్యాం నమః
గం జం సదాశివ మదజిహ్వాభ్యాం నమః
గం ఝం ఆమె వికటాభ్యాం నమః
గం ఞం దుర్మద గాదర్ణితాననా భ్యాం నమః
గం టం సుముఖభూతిభ్యాం నమః
గంఠం ప్రమోదభూమిభ్యాం నమః
గం డం ఏకపా తిభ్యాం నమః
గం ఢం ద్విజిహ్వాదసకాభ్యాం నమః
గం ణం శూరమానుషీభ్యాం నమః

గం తం వీరమకర ధ్వజాభ్యాం నమః
గంథం షణ్ముఖ వికర్ణాభ్యాం నమః
గం దం వరద భ్రుకుటీభ్యాం నమః
గం ధం వామదేవ లజ్జాభ్యాం నమః
గం నం తుండ దీర్ఘ గోణాభ్యాం నమః
గం పం వక్రకుండ ధనుర్ధరాభ్యాం నమః
గం ఫం స్వేలని యామినీభ్యాం నమః
గం బం గామణి రాత్రిభ్యాం నమః
గం భం గ్రీత్త చంద్రకాంతాభ్యాం నమః
గం మం విమత్త శశి ప్రభాభ్యాం నమః
గం యం మత్తవాహన లోలాక్షీభ్యాం నమః
గం రం చపలాభ్యాం నమః
గం లం జటిడి బుద్ధిభ్యాం నమః
గం వం ఖడ్గిదుర్భగాభ్యాం నమః
గం శం ణ్యా సుభగాభ్యాం నమః
గం షం వరేకేతన శివాభ్యాం నమః
గం సం భక్తప్రియ దుర్గాభ్యాం నమః
గం హం శేశ గుహ ప్రియాభ్యాం నమః
గం ళం వే గణనాద కాళీభ్యాం నమః
గం క్షం శ్వర లలజ్జిహ్వా భ్యాం నమః
గణే

## గ్రహ న్యాసము

స్వరైస్తు సహితం సూర్యం హృదయాధః ప్ర న్యసేత్ ।
బిందుస్థానే సుధాసూతిం యాదివర్ణ చతు షై : ॥ 21

భూ ం లోచనద్వంద్వం కవర్గాధిపతిం ష్టయే ।
హృదుపుత్రరిన్యసేచ్ఛుక్రమ్ చ వర్గాధిపతిం ప్రం ॥ 22

హృదయోపరి విన్యస్యేట్టవర్గాధిపతిం బుధం పునః
బృహస్పతిం కంఠదేశే త వర్గాధిపతిం ప్రియే ॥ 23

నాభౌశనేశ్వరందేవి పవర్గేశం సురేశ్వరి ।

వక్త్రేశాది చతుర్వర్ణైః సహితం రాహుమేవచ ॥ 24

క్షకార సహితం కేతుం పాయూదేవేశి విన్యసేత్ ।

| | | | | |
|---|---|---|---|---|
| సూర్యుని | - | అ నుంచి అః వరకు స్వరములతో | - | హృదయానికి కిందగా |
| చంద్రుని | - | య వర్గుతో | - | బిందు స్థానమైన లలాట మందు |
| కుజుని | - | క వర్గుతో | - | నేత్ర ద్వ ముున |
| బుధుని | - | చ వర్గుతో | - | హృదయానికి అక్రస్త భాగాన |
| బృహస్పతిని | - | ట వర్గుతో | - | కంఠ స్థ ుందు |
| శుక్రుని | - | త వర్గుతో | - | హృదయమధ్య నన |
| శనీశ్వరుని | - | ప వర్గుతో | - | నాభిస్థా ున |
| రాహువును | - | శ వర్గుతో | - | వక్త్రమం నమోటి యందు) |
| కేతువును | - | క్ష కారముతో | - | పాయువు నందు (గ |

న్యాసము చెయ్యాలి.

## గ్ర హ వర్ణములు (రంగులు)

రక్తం స్వేతం తథారక్తం శ్యామం పీతం చ పాండు ॥ 25

కృష్ణం ధూమ్రం ధూమ్ర ధూమ్రం భావయే ద్రవి రంన్ ।

కామరూప ధరాన్ దేవి దివ్యాంబర విభూషణాన్ ॥ పూర్వ 26

వా ు న్యస్త హస్తాంశ్చ దక్షహస్త వరప్రదాన్ ।

నవగ్రహాల రంగులు, హపాలు ఈ విధంగా ఉంటాయి.

| | | |
|---|---|---|
| సూర్యుడు | - | స్వర వర్ణము |
| చంద్రుడు | - | శ్వేత వర్ణము |
| కుజుడు | - | ఎరుపు రంగు |
| బుధుడు | - | నీలము రంగు |

| | | |
|---|---|---|
| గురువు | - | పసుపు పచ్చ రంగు |
| శుక్రుడు | - | తెలుపు రంగు |
| శని | - | నలుపు రగు |
| రాహువు | - | కృష్ణ వర్ణము |
| కేతువు | - | ధ  ు వర్ణము |

వీరు కామరూపులై, దివ్యాభరణవస్త్రము ధరించి ఎడమ తొడయందు ఎడమ హస్తము, కుడిచేత వరముద్ర ధరించి ఉంటారు.

## నక్షత్ర న్యాసము

*లలాటే దక్షనేత్రేచ వామే[illegible]ద్వయే పునః ॥* 27
*పుటయో ర్నాసికాయాశ్చ కంఠే స్కంధద్వయే పునః ।*
*పశ్చాత్కూర్పర యుగ్మేచ మణి బంధద్వయే పునః ॥* 28
*స్తనయోర్నాభి దేశేచ కటిబంధే తతః పరం ।*
*ఊరుయుగ్మే తథాజాన్వోర్జంఘ యోశ్చ పదద్వయే ॥* 29
*యుగ్మమేకంత్రయం వేదా ఏకమేకం ద్వయం తతః ।*
*ఏకం యుగ్మం యుగ్మమేకం యుగ్మం యుగ్మం యుగం క్రమాత్ ॥30*
*ఏకం యుగ్మం త్రయం చైకం త్రయమేకైక మేకకం ।*
*యుగ్మమేకం యుగంత్రీణి యుగ్మం బిందు విసర్గయుక్ ॥* 31
*నక్షత్రాణాం క్రమాద్వర్ణ నియమః కథితః ప్రియే ।*

నక్షత్రాలను సాధకుడి శరీరంలో ఈ విధంగా న్యాసం చెయ్యాలి.

| | | | | |
|---|---|---|---|---|
| అ ఆం | - | అశ్వని | - | లలాటము |
| ఇం | - | భరణి | - | కుడి కన్ను |
| ఈం ఉం ఊం | - | కృత్తిక | - | ఎడమ కన్ను |
| ఋం ఋూం ఌం ౡం | - | రోహిణి | - | కుడి చెవి |
| | - | మృగశిర | - | ఎడమ చెవి |

ఏం

| | | | | |
|---|---|---|---|---|
| ఐం | - | ఆర్ద్ర | - | కుడి ముక్కు |
| ఒం ఔం | - | పునర్వసు | - | ఎడమ ముక్కు |
| కం | - | పుష్యమి | - | కంఠము |
| ఖం గం | - | ఆశ్లేషా | - | కుడి భుజము |
| ఘం జం | - | మఖా | - | ఎడమ భుజము |
| చం | - | పుబ్బ | - | కుడిమోచేయి |
| ఛం జం | - | ఉత్తర | - | ఎడమ మోచేయి |
| ఝం ఞం | - | హస్తా | - | కుడి మణికట్టు |
| టం ఠం | - | చిత్త | - | ఎడమ వ ికట్టు |
| డం | - | స్వాతి | - | కుడి స్తన ణి |
| ఢం ణం | - | విశాఖ | - | ఎడమ స్తనము |
| తం థం దం | - | అనూరాధ | - | బొడ్డు |
| ధం | - | జ్యేష్టా | - | కుడి కటి ్రదేశము |
| నం పం ఫం | - | మూలా | - | ఎడమ క ట్రప్రదేశము |
| బం | - | పూర్వాషాఢ | - | కుడి తొడ |
| భం | - | ఉత్తరాషాఢ | - | ఎడమ త |
| మం | - | శ్రవణం | - | కుడి మో ొడ ు |
| యం రం | - | ధనిష్టా | - | ఎడమ మోకాలు |
| లం | - | శతభిషం | - | కుడి పిక్క |
| వం శం | - | పూర్వాభాద్రా | - | ఎడమ పి |
| షం సం హం | - | ఉత్తరాభాద్రా | - | కుడి పాద కం |
| ళం క్షం | - | రేవతి | - | ఎడమ పాదము |

**నక్షత్ర ధ్యానము**

***జ్వలత్కాలానల ప్రఖ్యా వరదాభయ పాణయః*** 32

***నతిపాణి ఉశ్వినీ పూర్వాః సర్వాభరణ భూషితాః।***

***ఏతాస్తు న్యసేద్దేవి స్థానే ష్వేషు సుః ర్తితే॥*** 33

ఈ నక్షత్రాలన్నీ కూడా మండుతున్న అగ్ని వలె కాంతి కలిగి, సర్వాభరణములు ధరించి రెండు చేతులతో వరదా భయముద్రలు, మరి రెండు చేతులతో నమస్కారముద్ర కలిగి ఉంటాయి.

## యోగినీ న్యాసము

విశుద్ధౌ హృదయే నాభౌ స్వాధిష్ఠానీ చ మూలకే ।
ఆజ్ఞాయాం ధాతునాథాశ్చ న్యస్తవ్యాడాది దేవతా : ॥ 34

అమృతాది యుతాః సమ్యం న్యస్తవ్యాశ్చ సురేశ్వరి
డాం డీం బీజ ద్వయం చోక్త్వా డమలావరయూః పిం ॥
వామకర్ణేందునాదాద్యా డాకిన్యై నమ ఇత్యపి ।
హ్రీం శ్రీం స్వరాంతే నక్తవ్యం మాంతే రక్ష పదద్వయం ॥
త్వగాత్మనే కంఠదేశే విశుద్ధౌ విన్యసేత్ప్రియే : ।
కఠవర్ణై రాకినీంతు రకారాద్యక్షరైః క్రమాత్ ॥
పూర్వవద్బీజ సంయుక్తై రసృగాత్మా ఉత్ర సంస్థితాత్ ।
అనాహతే స్థితే త్వశ్చాద్ధ కారాది ఫ కారకైః ॥
లాకినీ చ అథా దేవి మాంసాత్మా మణి పూరకే ।
బలవర్ణైః కాకినీంతు స్వాధిష్ఠానే తథా విధామ్ ॥
మేదస్వరూపాం విన్యస్య వసవర్ణైస్తు సాకినీం ।
అస్థి రూపాం చ పూర్వోక్త బీజాన్యాధారకే న్యసేత్ ।
హక్ష వర్ణ స్థితాం తద్వన్మజ్జా రూపిణికాం న్యసేత్ ।
భ్రువోర్మధ్యే మహేశాని హాకినీం ద్విదళేన్యసేత్ ॥
పూర్వ వద్బీజ సంయుక్తాం తద్వచ్ఛు క్రాత్మికాం న్యసేత్ ।
సర్వధాతు గాందేవీం శుక్ల వర్ణాంతు యాకినీం
బ్రహ్మరంధ్రే మహేశాని న్యాసోయం యోగినీ యుతః ॥

1) విశుద్ధి చక్రము : కంఠస్థాన మందుండే షోడశదళ పద్మము. ఇందులో అ నుంచి అః వరకు అక్షరాలు ఉంటాయి. ఇక్కడ

| | | | |
|---|---|---|---|
| 1. అమృతా | 2. ఆకర్షిణి | 3. ఇంద్రాణి | 4. ఈశాని |
| 5. ఉషఃకేశి | 6. ఊర్ధ్వ | 7. ఋద్ధిద | 8. ౠకార |
| 9. ఌ కార | 10 ౡష | 11. ఏకపదా | 12. ఐశ్వర్యా |
| 13. ఓంకారి | 14. ఔషది | 15. అంబికా | 16. అఃక్షరా |

ఈ శక్తుల మధ్య డాకినీ అనే యోగిని ఉంటుంది. ఈమెనే వజ్రే[illegible]రి అంటారు.

**2) అనాహతము:**హృదయ స్థానమునందుండే ద్వాదశ దళ పద్మము. దీని దళాలలో క నుంచి ఠ వరకు అక్షరాలుంటాయి. ఇక్కడ

| | | | |
|---|---|---|---|
| 1. కాళరాత్రి | 2. ఖాతీత | 3. గాయత్రి | 4. ఘంటా ధారిణి |
| 5. జ్ఞామిని | 6. చంద్రా | 7. ఛాయా | 8. జయా |
| 9. ఝుంకారి | 10. జ్ఞాన రూపా | 11. టంక హస్తా | 12. ఠంకారిణి |

ఈ శక్తుల మధ్య వామదేవి అనే దేవత ఉంటుంది. ఈమెనే రాకినీ అంటారు.

**3) మణిపూరము :** నాభి స్థానమందుండే దశదళ పద్మము. దీని పది దళాలలోనూ డ నుంచి భ వరకు అక్షరాలుంటాయి. ఇక్కడ

| | | | |
|---|---|---|---|
| 1. డామరి | 2. ఢంకారిణి | 3. ణామిరి | 4. తామసి |
| 5. స్థాణ్వీ | 6. దాక్షాయణి | 7. ధాత్రి | 8. నందా |
| 9. పార్వతి | 10. ఫట్కారిణి | | |

ఈ శక్తుల మధ్య 'వయోవస్థా వివర్జితా' అనబడే దేవత ఉంటుంది. ఆమెనే లాకినీ అని కూడా అంటారు.

**4) స్వాధిష్ఠానము:** నాభిస్థానమందుండే ఆరు దళాల పద్మము, ఇందులోని దళాలలో బ నుంచి ల వరకు శక్తులు ఉంటాయి.

| | | |
|---|---|---|
| 1. బంధిని | 2. భద్రకాళి | 3. మహామాయ |
| 4. యశశ్విని | 5. రమా | 6. లం[illegible]ష్టి |

ఈ శక్తుల మధ్య సిద్ధేశ్వరి అనే దేవత ఉంటుంది. ఆమెనే కాకినీ అని కూడా అంటారు.

**5. మూలాధారము :** ఇది గుదస్థానములో నాలుగు దళాలు గల పద్మము. దీని దళాలలో వ నుండి స వరకు శక్తులు ఉంటాయి.

1. వరద 2. శ్రీ 3. షండా 4. సరస్వతి

ఈ శక్తుల మధ్య సిద్ధ విద్యా అన దేవత ఉంటుంది. ఆమె సాకినీ కూడా అంటారు.

ంబడే ునే అని

**6. ఆజ్ఞా చక్రము :** భృకుటి స్థానంలో రెండు దళాలు గల పద్మము. వీటి యందు హంసవతీ, క్షమావతీ అనే శక్తులుంటాయి. వాటి మధ్య సిద్ధ మాత అనే దేవత ( టుంది. ఆమెనే హాకిని అని కూడా అంటారు.

ఉం(

**సహస్రారము :** నడినెత్తిన ఉంటుంది. వేయి దళాల పద్మము. ఈ దళాలల నుంచి క్ష వరకూ అన్ని శక్తులూ ఉంటాయి. వాటి మధ్య యశ్విని అనే దేవత ఉంటుంది. ఈమె అ సర్వాయుధములూ ధరించి, సర్వ వర్ణవ తోనూ ప్రకాశిస్తుంటుంది. ఈమెనే ఇ సి అని కూడా అంటారు.

ఖల ూకి

## రాశిన్యాసము

*పాదే లింగే చకుక్షౌ చ హృదయే బాహుమూలయోః ॥* 35

*దక్షిణం పాదమారభ్య వాః పాదావసానకమ్ ।*

*మేషాది రాశయో వర్ణై ర్న్యస్తవ్యాః సహ పార్వతి ॥* 36

**చతుష్కం త్రితయం త్రీణి ద్వితయం ద్వితయం ద్వయమ్ ।**

**పంచకం పంచకం పంచ పంచకం పంచకం తతః ॥** 37

**చత్వారి మేరుర్మనే స్యుః యాం పంచశాదయః ।**

| | | |
|---|---|---|
| దక్షిణ పాదము | - | మేషము |
| దక్షిణ వృషణము | - | వృషభము |
| దక్షిణ కుక్షి | - | మిధునము |
| హృదయ దక్షిణ భాగము | - | కర్కాటము |
| దక్షిణ బాహు మూలము | - | సింహము |
| శిరస్సు దక్షిణ భాగము | - | కన్య |
| శిరస్సు నందలి వామ భాగము | - | తుల |

| | | |
|---|---|---|
| వామ బాహు మూలము | - | వృశ్చికము |
| హృదయ వామపార్శ్వము | - | ధనుస్సు |
| వామ కుక్షి | - | మకరము |
| వామవృషణము | - | కుంభము |
| వామపాదము | - | మీనము |

ఈ రాశుల యందు అక్షరాలు 'అ' నుంచి 'వ' వరకు ఉంటాయి.

| | | |
|---|---|---|
| మేషము | - | అం ఆం ఇం ఈం |
| వృషభము | - | ఉం ఊం ఋం |
| మిధునము | - | ౠం ఌం ౡం |
| కర్కాటకము | - | ఏం ఐం |
| సింహము | - | ఓం ఔం |
| కన్య | - | అం అః |
| తుల | - | కవర్గ (బిందు సంయుక్తవ |
| వృశ్చికము | - | చవర్గ (బిందు సంయుక్తము) |
| ధనుస్సు | - | టవర్గ (బిందు సంయుక్తము) |
| మకరము | - | తవర్గ (బిందు సంయుక్తము) |
| కుంభము | - | పవర్గ (బిందు సంయుక్తము) |
| మీనము | - | యవర్గ (బిందు సంయుక్తము) |

మిగిలిన అక్షరాలు శ ష స హ ళ క్ష. వీటిలో క్ష కారాన్ని మీనరాశిలోను, మిగిలిన ఐదు అక్షరాలను కన్యారాశిలోను చేర్చాలి.

## పీఠ న్యాసము

పీఠాన్ని విన్యసేద్దేవీ మాతృకా స్థానకే పున 38

తేషాం నామాని వక్ష్యంతే శృణుష్వావహితా ప్రియే ।

కాః   రూపం వారాణసీ నేపాలం పౌండ్రవర్ధనం ॥ 39

వర్గపురం కాన్యకుబ్జం పూర్ణశైలం తథార్బుదం ।

ఆ మ్రాత క్రేశ్వరై కామ్రం త్రిస్రోతః కామకోటకం ॥ 40

కైలాసం భృగు నగరం కేదార పూర్ణ చంద్రకే ।
శ్రీ పీఠమోం కార పీఠం జాలంధ్రం మాలవోత్కలే 41

కులాంతం దేవి కోటం గోకర్ణం మారు తేశ్వరం ।
అట్టహాసం చ విరజం రాజగేహం మహా పథం ॥ 42

కోలాపురం మేలా ం ఓంకారంతు జయంతికా ।
ఉజ్జయిన్యపి చిత్రా పుంరకం హస్తినాపురం ॥ 43

ఓడ్డీశంచ ప్రయాగాఖ్యం షష్ఠం మాయాపురం తథా ।
జలేశే మలయం శైలం మేరుం గిరివరం తథా ॥ 44

మహేంద్రం వామనం చైవ హిరణ్యపురమేవ చ ।
మహాలక్ష్మీ పురోడ్యాణాం ఛాయాఛత్ర మతః పరం 45

ఏతాపీఠాః సముద్దిష్టా మాతృకారూపకా స్థితాః । ॥

యాభై ఒక్క పీఠాలనూ మాతృకా పీఠాల యందు స్థాపించా అక్షరాలు, పీఠాలు కూడా యాభై ఒక్కటే. కాబట్టి ఆ విధంగానే న్యాసము చెయ్యాలి. లి.

అం కామరూపాయ నమః
ఆం వారణాశ్యై నమః
ఇం నేపాలాయ నమః
ఈం పౌండ్ర వర్ధనాయ నమః
ఉం పుష్టిరాయ నమః
ఊం కన్యాకుబ్జాయ నమః
ఋం పూర్ణశైలాయ నమః
ౠం అర్బుదాయ నమః
ఌం ఆమ్రాతకే య నమః
ౡం ఏకామ్రాయ శ్వరా
ఏం త్రిస్రోతసే నమః
ఐం కామకోటకాయ నమః

ఓం కైలాసాయ నమః
ఔం భృగునగరాయ నమః
అం కేదారాయ నమః
అః చంద్ర పుష్క నమః
కం శ్రీపీఠాయ నమఃాయ
ఖం ఓంకార పీఠాయ నమః
గం జాలంధ్రాయ నమః
ఘం మాలవాయ :
ఙం కులాంతకాయ నమః
చం దేవీ కోటకా న నః
ఛం గోకర్ణాయ నమము

జం మారుతేశ్వరాయ నమః
ఝం అట్టహాసాయ నమః
ఞం విరజసే నమః
టం రాజగేహాయ నమః
ఠం మహాపథాయ నమః
డం కోలాపురాయ నమః
ఢం ఏలాపురాయ నమః
ణం కాలేశాయ నమః
తం జయంతికాయై నమః
థం ఉజ్జయిన్యై నమః
దం చిత్రాయై నమః
ధం క్షీరకాయ నమః
నం హస్తినాపురాయ నమః
పం ఉడ్డీశాయ నమః

ఫం ప్రయాగాయ న
బం షష్ట్యై నమః
భం మాయాపుర్యై నమః
మం జ లేశాయ నమః
యం మలయాయ నమః
రం శ్రీశైలాయ నమః
లం మేరవే నమః
వం గిరివరాయ నమః
శం మహేంద్రాయ నమః
షం వామనాయ నమః
సం హిరణ్యపురాయ ః
హం మహాలక్ష్మీపురాయ నమః
ళం ఓఢ్యాణాయ నమనః
క్షం ఛాయాఛత్రాయ నమః

## శ్రీచక్రన్యాసము సంహార క్రమము

ఏవం షోఢా పురస్కృత్వా శ్రీచక్రన్యాస మాచరేత్ ⎫ 46
మహాత్రిపుర సుందర్యాశ్చక్రన్యాసం శృణు ప్రియే । ⎭
యన్నకస్య చిదాఖ్యాతం తనుశుద్ధి కరం పరం ॥ 47

ఈ రకంగా షోఢాన్యాసము చేసి, తరువాత శ్రీచక్రన్యాసము చెం లి. ఓ పార్వతీ ! ఇంత వరకూ దీన్ని గురించి ఎవరికీ చెప్పలేదు. ఇది అత్యంత రహస్య వి.

## త్రైలోక్య మోహన చక్రము (ప్రధమ రేఖ)

చతురస్రాద్య రేఖాం నమ ఇత్యాదితో న్యసేత్ ।
ద ంస పృష్ఠ పాణ్యగ్ర స్ఫిక్క పాదాంగులీష్వథ ॥ 48
వామాంఘ్ర్యంగుళిష్వే స్ఫిక్కే పాణ్యగ్రే చాంస పృష్ఠకే ।
స చూళీ మూల పృష్ఠేషు వ్యాపకత్వేన సుందరి ॥ 49
అత్రైవ స్థానదశకే అణిమాద్యాస్తు విన్యసేత్ ।

మొదటగా భూపురములోని మొదటి రేఖకు న్యాసము చెబుతున్నారు. చతు
ప్రథమ రేఖాయై నమః అని ముందుగా చెప్పాలి. తరువాత

అం అణిమాసిద్ధ్యై నమః - కుడి భుజముకు కొద్ది కిందగా

లం లఘిమాసిద్ధ్యై నమః - కుడిచేతి వేళ్ళ చివర

మం మహిమా సిద్ధ్యై నమః - కుడిపిరుదు

ఈం ఈశిత్వసిద్ధ్యై నమః - కుడి కాలివ్రేళ్ళ చివర

వం వశిత్వ సిద్ధ్యై నమః - ఎడమ కాలివ్రేళ్ళ చివర

ప్రాం ప్రాకామ్య సిద్ధ్యై నమః - ఎడమ పిరుదు

భుం భుక్తి సిద్ధ్యై నమః - ఎడమ చే ళ్ళ చివర

ఇం ఇచ్ఛా సిద్ధ్యై నమః - ఎడమ భుజము వెనుక

ప్రాం ప్రాప్తి సిద్ధ్యై నమః - పిలక మొదలు

సం సర్వ కామ సిద్ధ్యై నమః వీపు.

## ద్వితీయ రేఖ

**సిద్ధీస్త దంతశ్చ తను వ్యాపకత్వేన సుందరి ॥**

**చతురశ్ర మధ్య రేఖాయై ఇత్యాపి వల్లభే ।** 50

**తస్యాః విన్యస్య స్థానేషు బ్రహ్మాద్యా ద్యాస్త ధాష్ట సు ॥** 51

**పాదాంగుష్ఠద్వయే పార్శ్వే దక్షమూర్ధన్య పార్శ్వకే ।।**

**వామ దక్షిణ జాన్వోశ్చ బ రం సద్వయే తథా ॥** 52

చతురస్ర మధ్య రేఖాయై నమః చెప్పి వివిధ స్థానములందు వ్యాపక న్యాస
ప్యాలి. వ్యాపకన్యాసము అంటే - రె ప చేతుల వేళ్ళను ముకుళించి శిరస్సు నుంచి
పాదాల వరకు, తిరిగి పాదాల నుంచి శిరసు దాకా, పార్శ్వములందు చూపటము.

ఆం ్రాహ్మై నమః - కాళ్ళ బొటన వ్రేళ్ళు

ఈం మాహేశ్వర్యై నమః - కుడి ...

ఊం కౌమార్యై నమః - ...

బ్లూం వైష్ణవ్యై నమః - ఎడమ పార్శ్వము

గ్లౌం వారాహ్యై నమః - ఎడమ మోకాలు

ఐం మాహేంద్ర్యై నమః - కుడి మోకాలు

ఔం చాముండాయై నమః - కుడి స్కంధము

అః మహాలక్ష్మై నమః - ఎడమ స్కంధము.

## తృతీయ రేఖ

న్యస్త వ్యాశ్చతురశ్రాన్త్య రేఖాయై నమ ఇత్యపి ।
విన్యసే ద్వ్యాపకత్వేన పూర్వోక్తాన్తశ్చ విగ్రహే ॥ 53

తస్యాఃస్థానేషు దశసు ముద్రాణాం దశకం న్యసేత్ ।
బ్రహ్మాణ్యా ద్యష్ట స్థానాం తస్తా సామష్టాన్యసే త్తతః ॥ 54

శిష్టే ద్వేద్వాదశాంతే చ పాదంగుష్టే చ విన్యసేత్ ।

చతురశ్రాంత్య రేఖాయై నమః అని చెప్పి న్యాసము ప్రారంభించాలి.

ద్రాం సర్వ సంక్షోభిణ్యై నమః - కాలి బొటన వ్రేళ్ళు

ద్రీం సర్వ విద్రావిణ్యై నమః - కుడి పార్శ్వము

క్లీం సర్వాకర్షిణ్యై నమః - తల

బ్లూం సర్వ వశంకర్యై నమః - ఎడమ పార్శ్వము

సః సర్వోన్మాదిన్యై నమః - ఎడమ మోకాలు

క్రోం సర్వ మహాంకుశాయైనమః - కుడి మోకాలు

హ్స్ఖ్ఫ్రేం సర్వ ఖేచర్యై నమః - కుడి స్కంధము

హ్సౌం సర్వ బీజాయై నమః - ఎడమ స్కంధము

ఐం సర్వయోన్యై నమః - పాదముల వ్రేళ్ళు

హ్సైం హ్స్క్లీం హ్సౌః సర్వత్రిఖండాయై నమః - ద్వాదశాంతము

తదంత షోడశ దళ పద్మాయ నమ ఇత్యపి షో ... ు) 55

విన్యస్య తద్దళే కామాకర్షిణ్యా ద్యాశ్చ విన్యసేత్ ।

దళాని దక్షిణ శ్రోత్ర పృష్ఠమంసం చ కూర్పరమ్ ॥ 56

కర పృష్టం చోరు జాను గుల్ఫ పాదతలం తథా ।

వామ పాదతరాద్యేవమే తదేవాష్టకం మతమ్ ॥ 57

ముందుగా షోడశదళ పద్మాయ నమః అని చెప్పి ఆ తరువాత వ్యాపక న్యాసము చెయ్యాలి.

రక్తాసనా రక్తవర్ణా రక్తాంబర విభూషణాః ।

పాశాంకుశ కరాధ్యేయాః కామాకర్షిణీ కాదయః ॥

అం కామాకర్షిణీ నిత్యా కళాయై నమః - చెవి వెనుక

ఆం బుద్ధ్యా కర్షిణీ నిత్యా కళాయై నమః - కుడి భుజము

ఇం అహంకారా కర్షిణీ నిత్యా కళాయై నమః - కుడి మోచేయి

ఈం శబ్దాకర్షిణీ నిత్యా కళాయై నమః - కుడి చేతి వెనుక

ఉం స్పర్శాకర్షిణీ నిత్యాకళ్యాయై నమః - కుడి తొడ

ఊం రూపాకర్షిణీ నిత్యాకళాయై నమః - కుడి మోకాలు

ఋం రసాకర్షిణీ నిత్యాకళాయై నమః - కుడి చీలమండ

ౠం గంధాకర్షిణీ నిత్యాకళాయై నమః - కుడి అరికాలు

ఌం చిత్తాకర్షిణీ నిత్యాకళాయై నమః - ఎడమ అరికాలు

ౡం ధైర్యాకర్షిణీ నిత్యాకళాయై నమః - ఎడమ చీల మండ

ఏం స్మృత్యాకర్షిణీ నిత్యాకళాయై నమః - ఎడమ మోకాలు

ఐం నామాకర్షిణీ నిత్యాకళాయై నమః - ఎడమ తొడ

ఓం బీజాకర్షిణీ నిత్యాకళాయై నమః - ఎడమ చే వెనుక

ఔం ఆత్మాకర్షణీ నిత్యా కళాయై నమః - ఎడమ మోచేయి

అం అమృతాకర్షి... నిత్యాకళాయై నమః - ఎడమ భుజము

అః శరీరాకర్షిణీ నిత్యాకళాయై నమః - ఎడమ చెవి వెనుక

**సర్వ [illegible]ంక్షోభణ చక్ర[illegible] (అష్ట [illegible]ళము)**

*తదంత[illegible] [illegible]ష్టదళ పద్మాయ నమ[illegible]్యాపి ।*

*విన్యస్య తద్దళేష్వేషు దక్షే శంఖేచ జత్రుకే ॥* 58

*ఊర్వం తర్గుల్ఫర్గుల్ఫోరు జత్రు శంఖేచ వామతః*

*అనంగ కుసుమాద్యాశ్చ శక్తీ రష్టౌ చ విన్యసేత్* 59

అష్టదళ పద్మాయ నమః అని చెప్పి న్యాసము ప్రారంభి[illegible].

*అనంగ కుసుమాద్యాశ్చ పాంతుమాం రక్త కంచుకాః*

*వేణీకృత కరోన్నమ్ర శరకార్ముక పాణయః ॥*

క వర్గ అనంగ కుసుమాయై నమః - కుడి శంఖము

చ వర్గ అనంగ మేఖలాయై నమః - కుడి మెడ ఎముక

ట వర్గ అనంగ మదనాయై నమః - కుడి తొడ

త వర్గ అనంగ మదనాతురాయై నమః - కుడి చీలమండ

ప వర్గ అనంగ రేఖాయై నమః - ఎడమ మండ

య వర్గ అనంగ వేగిన్యై నమః - ఎడమ తొడ చీల

శ వర్గ అనంగాంకుశాయై నమః - ఎడమ వైపు మెడ ఎముక

ళంక్షం అనంగమాలిన్యై నమః - ఎడమ శంఖము

శంఖము - కనులకు సూటిగా నుదురు పై ఉండు ఎము కలు

**సర్వ సౌభాగ్యదాయక చక్రము - చతుర్దశారము**

*తదంత[illegible] [illegible]్దశార చక్రాయ నమ ఇత్యపి ।*

*విన్యస్య తత్ప్ర[illegible]కోణేషు న్యసేచ్ఛక్తీ శ్చతుర్దశ ॥* 60

సర్వ సంక్షోభిణ్యా ద్యాస్తు తస్య కోణాని వచ్మ్యహం ।
లలాటం దక్షభాగం చ దక్ష గండాం స మధ్యతః ॥ 61

పార ంత రూపజంఘాంతర్వామ జంఘాది పార్వతి ।
వావె శ్వే ం వామపార్శ్వం వామాం వామ గండకం ॥ 62
హార సం
లలాట వామ మధ్యే చ తథావైపృష్ఠ మిత్యపి ।

చతుర్దశార క్రాయ నమః
చ

క్షోభి ద్యాః ప్రసీదంతు బాణ కార్ముక పాణయః ।
ణ్యా
సర్వా భంణే సంపన్నాః పృధురుక్మ సురోచిషు ॥

| | | |
|---|---|---|
| కం సర్వ సంక్షోభిణ్యై నమః | - | లలాటము |
| ఖం సర్వ విద్రావిణ్యై నమః | - | లలాటకు కుడి భాగము |
| గం సర్వాక ర్షిణ్యై నమః | - | కుడి చెక్కిలి |
| ఘం సర్వా హ్లాదిన్యై నమః | - | కుడి భుజము |
| ఙం సర్వ సమ్మోహిన్యై నమః | - | కుడి పార్శ్వము |
| చం సర్వ స్తంభిన్యై నమః | - | కుడి తొడ |
| ఛం సర్వ జృంభిణ్యై నమః | - | కుడిపిక్క |
| జం సర్వ వశంకర్యై నమః | - | ఎడమ పిక్క |
| ఝం సర్వ రంజన్యై నమః | - | ఎడమ తొడ |
| ఞం సర్వోన్మాదిన్యై నమః | - | ఎడమ పార్శ్వము |
| టం సర్వార్థ సాధిన్యై నమః | - | ఎడమ భుజము |
| ఠం సర్వ సంపత్తి పూరిణ్యై నమః | - | ఎడమ చెక్కిలి |
| డం సర్వ మంత్రమయ్యై నమః | - | లలాటము ఎడమ భాగము |
| ఢం సర్వ ద్వంద్వ క్షయంకర్యై నమః | - | శిరస్సు వెనుక |

## సర్వార్థ సాధక చక్రము (బహిర్దశా ు)

రవ

తతో దశార చక్రాయ నమ ఇత్యపి పార్వతి ॥ 63

తస్యకోణాని దక్షాక్షి నాసామూలాఽఽన్యనేత్రకే।

క ి వాయుకోణేషు జా ్రయ గుదేషుచ ॥ 64

కుక్షిస్వైక్షీతి వహ్న్యాఖ్య కోణేష్వేనుడ న్యసేత్ పునః।

స సిద్ధి ప్రదాదీనాం శక్తీనాం దశకం తధా ॥ 65

ఇప్పుడు దశర్వ ్రక్రాయ నమః అని ారంభించి తరువాత ంక న్యాసము చెప్పాలి.

దశ దేవ్యః ప్రసీదంతు స ప్రపదాదికాః। వ్యాప

రక్తాస్సు పుష్ప హారాఢ్యా వరత్వస్రయ పాణయః ॥

ణం సర్వసిద్ధి ప్రదాయై నమః - కుడి కన్ను

తం సర్వ సంపత్ప్రదాయై నమః - ముక్కు కొన

థం సర్వ ియంకర్యై నమః - ఎడమ కన్ను

దం సర్వ మ ్రిళకారిణ్యై నమః - ఎడమ చంక

ధం సర్వకామ ప్రదాయై నమః - ఎడమ గజ్జ

నం సర్వదుఃఖ విమోచిన్యై నమః - ఎడమ మో )

పం సర్వమృత్యు ప్రశమన్యై నమః - గుద స్థానము ాలు

ఫం సర్వ విఘ్న నివారిణ్యై నమః - కుడి మోకాలు

బం సర్వాంగ సుందర్యై నమః - కుడి గజ్జ

భం సర్వ సౌభాగ్యదాయిన్యై నమః - కుడి చంక

## సర్వ రక్షాకర ి క్ర ు (అంత ు)

తదంతశ్చ దశారాది చక్రాయ నమ ఇత్యపి । ర్దశారము

విన్యస్య తస్య కోణేషు సర్వజ్ఞా ద్యాః ప్రవిన్యసేత ॥ 66

దక్షణా సా సృక్కిణీ చ స్తనం వృషణ మేవ చ।

సీవినీ వామముష్కం చ స్తనంసృక్కిణి నాసికే ॥ 67

నాసాగ్రం చైవ విజ్ఞేయం కోణానాం దశకం తథా।

అంతర్దశార చక్రాయనమః అని ప్రారంభించాలి.

**సుప్రసీదంతు దేవ్యశ్చ పుస్తకాక్షాళి పాణయః ।**

**శుద్ధ స్ఫటిక సంకాశా సర్వజ్ఞా ద్యాః దేవతాః॥**
స్యాః

| | | |
|---|---|---|
| మం సర్వజ్ఞాయై నమః | - | కుడిముక్కు |
| యం సర్వశక్త్యై నమః | - | మూతికి కుడివైపు |
| రం సర్వైశ్వర్య ప్రదాయిన్యై నమః | - | కుడి స్తనము |
| లం సర్వజ్ఞానమయాయై నమః | - | కుడి వృషణము |
| వం సర్వవ్యాధి వినాసిన్యై నమః | - | వృషణముల మధ్యచార |
| శం సర్వాధారస్వరూపాయై నమః | - | ఎడమ వృషణము |
| షం సర్వపాపహరాయ నమః | - | ఎడమ స్తనము |
| సం సర్వానందమయై నమః | - | మూతికి ఎడమ వైపు |
| హం సర్వ రక్షాస్వరూపిణ్యై నమః | - | ఎడమ ముక్కు |
| ళం సర్వేప్సిత ఫల ప్రదాయై నమః | - | ముక్కు కొన |

## సర్వ రోగహార చక్రమ (అష్ట కోణము)

*తదంతరష్ట కోణాది చక్రాయ నమ ఇత్యపి* 68

*విన్యస్య తస్య కోణేషు వశిన్యాద్యష్టకం న్యసేత్ ।*

**చిబుకం కంఠ హృదయ నాభీనాం చైవ దక్షిణం ॥** 69

**జ్ఞేయంపార్శ్వ చతుష్కం చ మణిపూరాది వామకం ।**

**చతుష్టయం చ పార్శ్వానా మేతత్కోణాష్టకం మతం ॥** 70

అష్ట కోణ చక్రాయ నమః అని చెప్పి న్యాసము ప్రారంభించాలి.

**వాగ్దేవతాః ప్రసీదంతు సింధూర కాంబరాః ।**
కనః
**పుస్తకాక్షాళి విలస ద్వరదా భీతి పాణయః ॥**

| | | |
|---|---|---|
| అ వర్గ వశినీ వాగ్దేవతాయై నమః | - | గడ్డము కుడివైపు |
| క వర్గ కామేశ్వరీ వాగ్దేవతాయై నమః | - | కంఠము కుడివైపు |

చ వర్గ మోదినీ వాగ్దేవతాయై నమః - హృదయము కుడి వైపు

ట వర్గ విమలా వాగ్దేవతాయై నమః - బొడ్డు కుడి వైపు

త వర్గ అరుణా వాగ్దేవతాయై నమః - బొడ్డు ఎడమ వైపు

ప వర్గ జయినీ వాగ్దేవతాయై నమః - హృదయము ఎడమ వైపు

య వర్గ సర్వేశ్వరీ వాగ్దేవతాయై నమః - కంఠము ఎడమ వైపు

శ వర్గ కౌళినీ వాగ్దేవతాయై నమః - గడ్డము ఎడమ వైపు.

**[illegible] సిద్ధి ప్రద, సర్వాన[illegible]మయ చక్రాలు**

**(త్రికోణము, [illegible]దువు)**

**హృదయస్థ త్రికోణస్య చతుర్దిక్షు బహిర్న్యసేత్ ।**
**శరచాపౌ పాశసృణీం త్రికోణాయ నమస్తథా ॥** 71

**విన్యస్య తస్య కోణేషు అగ్రదక్షోత్తరేషు చ ।**
**కామేశ్వర్యాది దేవీనాం మధ్యే దేవీం చ విన్యసేత్ ॥** 72

ముందుగా త్రికోణాయ నమః అని చెప్పాలి.

**రక్తవర్ణా రక్తభూషా వరదాభయ పాణయః ।**
**సాయుధా మకుటోపేతా ధ్యాయే దాయుధ దేవతాః ॥**

హృ[illegible]యానికి కిందగా గల పల్లపు ప్రదేశమును త్రికోణాకారముగా భావించి దానికి నాలుగు దిక్కుల యందు.

తూ[illegible]న - శివశక్తుల భాణాలు

దక్షిణము - రెండు చాపాలు

పశ్చిమము - రెండు పాశములు

ఉత్త[illegible]ము - రెండు అంకుశములు న్యాసము చేయ్యాలి

తరువాత త్రికోణమును న్యాసం చెయ్యాలి. హృద[illegible] త్రికోణంలో

అగ్ర కోణము - కామేశ్వరి

దక్షిణ కోణము - వ్రజేశ్వరి

ఉత్తర కోణము - భగమాలినిలను న్యాసం చెయ్యాలి. తరువాత

సర్వానందమయ చక్రాయ నమః అని చెప్పి త్రికోణ మధ్యలో బిందువునందు ప్రకాశ, విమర్శ, సామరస్య రూపమైన త్రిపురసుందరిని న్యాసము చెయ్యాలి.

## ఉప సంహారము

*ఏవం మయోదితో దేవి । న్యాసోగుహ్యాతమ క్రమః ।*
*ఏతద్ గుహ్య తమం కార్యం త్వయావై వీర వందితే ॥* 73

*సమయ స్థాయ దాతవ్యం నాఽశిష్యాయ కథాచన ।*
*గుప్తాద్ గుప్తతరం చైతత్త వ్యాఽద్య ప్రకటీ కృతమ్ ॥* 74

ఈ న్యాసము అంతా చాలా రహస్యమైనటు వంటిది. కాబట్టి యోగ్యులైన వారికి మాత్రమే చెప్పాలి. ఈ విషయాన్ని సమయాచారులకు మాత్రమే చెప్పాలి. ఓ పార్వతీ ! నీవు సమయా చారవు కాబట్టి నీకు చెప్పబడినది.

## సృష్టి న్యాసము

*మూల దేవ్యాదికం న్యాస మణిమాంతం న్యసేత్ ।*

ఇంత వరకూ భూపురము నుండి బిందువు వరకూ ఆవరణలకూ న్యాసము చెప్పబడింది. ఇది సంహార క్రమము. ఇక ఇప్పుడు సృష్టి క్రమం అని అంటే బిందువు నుంచి భూపురం వరకూ న్యాసము చెప్పబడుతోంది.

## బిందు త్రికోణములు

*త్రికోణస్థే మహాబిందౌ మహాత్రిపురసుందరీమ్ ॥* 75
*శిరస్త్రి కోణపూర్వాదౌ కామేశ్వర్యాది కంన్యసేత్*

ఇక్కడ త్రికోణము అంటే నడినెత్తిన ఉన్న బ్రహ్మరంధ్రము అని చెప్పబడుతోంది. అక్కడే శివశక్తులను న్యాసము చెయ్యాలి. అక్కడ పూర్వ దక్షిణ ఉత్తర కోణాలలో మహాకామేశ్వరి, మహా వజ్రేశ్వరి, మహా భగమాలినిలను న్యాసం చెయ్యాలి.

## ఆయుధన్యాసము

***బాణాన్నేత్రే భ్రువోశ్చాపౌ కర్ణేపాశద్వయం న్యసేత్ ।***
***సృణి ద్వయంచ నాసాగ్రే దక్షిణాగ్రంతు విన్యసేత్ ॥*** 76

***యాం రాం లాం వాం సాం సర్వ జంభనేభ్యః ।***

| | | |
|---|---|---|
| కామేశ్వరీ బాణేభ్యో నమః | - | ఎడమ కన్ను |
| ధం సర్వ సమ్మోహనాయ కామేశ్వర ధనుషే నమః | - | కుడి కను బొమలు |
| ధం సర్వ సమ్మోహనాయ కామేశ్వరీ ధనుషే నమః | - | ఎడమ కను బొమలు |
| ఆం సర్వ వశీకరణాయ కామేశ్వర పాశాయ నమః | - | కుడి చెవి |
| హ్రీం సర్వ వశీకరణాయ కామేశ్వరీ పాశాయ నమః | - | ఎడమ చెవి |
| క్రోం సర్వ స్తంభనాయ కామేశ్వరీ అంకుశాయ నమః | - | ఎడమ ముక్కు చివర |
| క్రోం సర్వ స్తంభనాయ కామేశ్వరీ అంకుశాయ నమః | - | కుడి ముక్కు చివర |

సంహారన్యాసంలో శివశక్తుల ఆయుధాలు రెండు కలిపి ఒకే చోట చెప్పాలి. కాని సృష్టి న్యాసంలో విడివిడిగా చెప్పాలి. సంహారంలో ఇద్దరిదీ ఒకే రూపము. అందుకని ఆయుధాలు వేరువేరుగా ఉండవు. కాని సృష్టి ప్రారంభమైన తరువాత ఇద్దరూ విడివిడిగా ఉంటారు. అందుచే ఆయుధాలు కూడా విడివిడిగానే ఉంటాయి.

## అష్ట కోణము

***ముండ మూలాక్రమేణైవన్యసే ద్వాగ్దేవ తాష్టకమ్ ।***
***బైందవాదీని చక్రాణి న్యస్తవ్యాని వరాననే ॥*** 77

అష్టకోణ చక్రాయ నమః అని చెప్పి శిరస్సునందు నాలుగు దిక్కులు, నాలుగు మూలలు మొత్తము ఎనిమిది స్థానాల యందు వశిన్యాది వాగ్దేవతలను న్యాసము చెయ్యాలి.

***ఏతావాగ్దేవతా ధ్యేయా దాడిమీ కుసుమారుణాః ।***
***ధనుర్బాణ ధరా అక్షస్రక్పుస్తక కరాంబుజా ॥***

## అంతర్దశారము

*నేత్రమూలే త్వపాంగేచ కర్ణ పూర్వోత్తరే పునః ।*

*చూడాదికంఠ నిమ్నేఽర్ధ శేషార్ధం కర్ణపృష్ఠకే ॥* 78

*కర్ణపూర్వే త్వ పాంగం చ తస్యమూలే చ విన్యసేత్ ।*

సర్వ రక్షాకర అంతర్దశార చక్రాయ నమః

| | | |
|---|---|---|
| మం సర్వజ్ఞాయై నమః | - | కుడి కంటి కొలకు |
| యం సర్వ శక్త్యై నమః | - | కుడి కంటి రెండవ చివర |
| రం సర్వైశ్వర్య ప్రదాయై నమః | - | కుడి చెవి ముందు భాగము |
| లం సర్వ జ్ఞానమయై నమః | - | కుడి చెవి వెనక భాగము |
| వం సర్వవ్యాధి వినాశిన్యై నమః | - | శిఖాంతరాళ దక్షిణ భాగము |
| శం సర్వాధార స్వరూపాయై నమః | - | శిఖాంతరాళ ఉత్తర భాగము |
| షం సర్వపాపహరాయై నమః | - | ఎడమ చెవి వెనుక భాగము |
| సం సర్వానందమయై నమః | - | ఎడమ చెవి ముందు భాగము |
| హం సర్వ రక్షా స్వరూపిణ్యై నమః | - | ఎడమ కంటి రెండవ చివర |
| ళం సర్వేప్సిత ఫలప్రదాయై నమః | - | ఎడమ కంటి కొలకు |

*ధ్యేయా అంతర్దశారస్థా ఏతాదేవ్యా అభీష్టదాః ।*

*కర్పూర గౌరదేహాస్తా స్రక్పుస్తక కరాంబుజాః ।*

## బహిర్దశారము

*సర్వ సిద్ధ్యా దికం కంఠే ప్రాదక్షిణ్యేన విన్యసేత్ ॥* 79

బహిర్దశార చక్రాయ నమః కంఠము చుట్టూ అంతర్దశార స్థానాలకు క్రిందగా సర్వసిద్ధి ప్రదా, సర్వ సంపత్ప్రదా మొదలైన దేవతలతో న్యాసం చెయ్యాలి.

*ధ్యేయా బహిర్దశారస్థా ముక్తాహార విభూషణా ।*

*దేవ్యో హిమాంశు సంకాశాః కర్పూర ధవళాంబరాః ॥*

## చతుర్దశారము

హృదయే మను కోణస్థ శక్త యోపి చ పూర్వవత్ ॥

హృదయానికి చుట్టూ సర్వ సంక్షోభిణీ, సర్వ విద్రావిణీ మొ: న పధ్నాలుగు శక్తులను న్యాసం చేయాలి. దలై

కం సర్వ సంక్షోభిణ్యై నమః

ఖం సర్వ విద్రావిణ్యై నమః

ఈ రకంగా గతంలో చెప్పిన మాదిరిగానే న్యాసం చెయా

ధ్యేయా శ్చతుర్దశారస్థా సంక్షోభిణ్యా దిశక్తయః ్యాలి.

ప్రవాళా తామ్ర వపుషోధనుర్బాణోల్ల సత్కరాః ॥

## అష్ట దళము

నాభౌత్వష్ట దళం తత్ర వంశే వామే చ పార్శ్వక్ ॥ 80

ఉదరే సవ్య పార్శ్వే చ న్యసేదాది చతుష్టయం ।

బొడ్డు చుట్టూ ఎనిమిది దళాలు భావించి అనంగకుసుమాది దేవతలను ధ్యానం చెయ్యాలి. కవర్గ అనంగ కుసుమాయై నమః వెన్ను పూస. అదే వి గా మిగిలిన దేవతలను ఎడమ పా ము. పొట్ట కుడి పార్శ్వము ఈ రకంగా న్యాసము ధం చెయ్యాలి.

ర్ధ్యాతవ్యా అష్ట పత్రస్థాః పుష్పే పుష్పాస్త్ర పాణయః

రక్తాంగ్యో రక్త వసనా వేణీ కృత కచాస్సదా ॥

## షోడశ దళము

్వాధిష్ఠానేన్యసే త్స్యు పూర్వాద్దక్షావ సానకం ॥ 81

స్వాధిష్ఠానంలో షోడశదళాన్ని భావించి వాటిలో పూర్వ ద నుంచి ప్రారంభించి కామాకర్షిణీ మొదలైన శక్తులను అప్రదక్షిణంగా న్యాసము చెయ ళం ఇంతవరకు చెప్పిన చక్రాలన్నీ ప్రాదక్షిణ్యంగా న్యాసము చెయ్యాలి. ్యాలి.

ఏతా ధ్యేయాః కళాదేవ్యః పాశాంకుశ కరాంబుజాః ।
బాలారుణ సమానాంగ్య సర్వా భరణ భూషితాః ॥

## భూపురము

మూలాధారేన్య సేను ్రా దశకం సాధకోత్తమః ।
పునవంశేచ సవ్యేచ వామే చైవాంతరాలకే ॥ 82

ఊర్ధ్వా దో దశము ద్రాశ్చ ఊర్ధ్వా ధో వర్జితం పునః ।
బ్రహ్మాణ్యా ద్యష్టకం దక్ష జంఘాయాం తాస్తు పూర్వవత్ ॥ 83

వామజంఘాం స మారభ్య వామాది క్రమతోఽపిచ
సిద్ధ్యష్టకం న్యసేత్తేషు ద్వయం పాదతలేన్య సేత్ ॥ 84

భూపురంలో మూడు రేఖలున్నాయి. ముందుగా తృతీయ రేఖ మూలా ధారము చుట్టూ ఎనిమిది దిక్కులా ఎనిమిది, ఊర్ధ్వ అధో దిక్కులకు రెండు మొత్తం పదివైపులా సర్వ సంక్షోభిణి మొదలైన దేవతలను న్యాసం చెయ్యాలి.

**ద్వితీయ రేఖ :** కుడికాలి పిక్కకు ఎనిమిది వైపులా బ్రాహ్మి మొదలైన దేవతలను న్యాసం చెయ్యాలి.

**ప్రథమ రేఖ :** ఎడమ కాలి పిక్కకు ఎనిమిది వైపులా, రెండు అరికాళ్ళలోనూ అణిమాది అష్ట సిద్ధులనూ న్యాసం చెయ్యాలి.

ఇక్కడ వామాది క్రమతః అనటం చేత అప్రదక్షిణము అని గుర్తుంచుకోవాలి.

## చక్రన్యాసము - ఉప సంహారము

కారణాత్ప్ర స్రుతం న్యాసం దీపాద్దీపమివోదితం ॥ 85
ఏవం విన్యశ్య దేవేశీం స్వాభేదేన విచింతయేత్ ॥

ఒక దీపం నుండి ఇంకొక దీపం వెలిగించినట్లైతే, రెండవ దీపం కూడా కాంతి నిస్తుంది. అలాగే పరబ్రహ్మ స్వరూపమైన త్రిపుర సుందరి నుండి ఉత్పన్నమైన న్యాసము కేవలం త్రిపురసుందరీ రూపమైన పరబ్రహ్మమే అవుతుంది. పరమార్థము నుండి ప్రసవించినది

ప్రసార పరమార్థము అవుతుంది. ఈ రకంగా దేహంలో సృష్టి రూపం గానూ, సంహార రూపంగానూ శ్రీచక్ర న్యాసం చేసి, శ్రీచక్రము తన కన్న వేరు కాదని సాధ డు భావించాలి. ఆవరణ దేవతలు త్రిపురసుందరి యొక్క ప్రతి రూపాలు. కాబట్టి తనకుదేహము త్రిపుర సుందరి కన్నా, ఆవరణ దేవతల కన్నా వేరు కాదు. దేహము, దేవత, శ్రీచక్రమూ అన్నీ ఒకటే అని సాధకుడు భావించాలి.

అయితే ఈ న్యాసము మిగిలిన గ్రంధాలలో ఇంకో విధంగా ఉన్నది.

*శ్రీచక్రం బ్రహ్మ రంధ్రేతు సువృత్తం చ త్రికోణకమ్ ।*
*లలాటేష్టా రకం చక్రం భృవోర్మధ్యే దశారకమ్*
*బహిర్దశారం కంఠేతు మన్వస్రంహృదయే భవేత్*
*కు క్షౌతుప్రథమ వృత్తం, నాభ్యా మష్టదళాంబుజమ్*
*కట్యాం ద్వితీయం వలయం, స్వాధిష్ఠానే కలాశ్రకమ్*
*తస్యా ధస్తాత్ తృతీయం, మూలా ధారే చతురస్రకమ్*
*ద్వితీయం భూపురం జంఘే, తృతీయం వామ జంఘకే*
*త్రిపురే శ్రీ మహా యంత్రం సృష్టి న్యాస విధిక్రమాత్*

## కరశుద్ధ్యాది న్యాసములు

*తతశ్చ కరశుద్ధ్యాది న్యాసం కుర్యాత్ సమాహితః ॥* 86
*అహంతే కథయా మ్యధ్య వి న్యాసం శృణు ప్రియే ।*

శ్రీచక్ర న్యాసము చేసిన తరువాత కర్శ్యా ద్ధి న్యాసము, చతురాసన న్యాసము, రక్షా షడంగ న్యాసము, వాగ్దేవతాష్టక న్యాసము చెయ్యాలి.

## నవయోని న్యాసము

*శ్రోత్రయో శ్చుబుకే చైవ శంఖా స్యేష__గ శోర్షశి ॥* 87
*అంసద్వయేచ హృదయే న్యసే త్కూర్పరకుక్షిషు ।*
*జాన్వంధు పాదగుహ్యేషు పా హృత్సు స్తనద్వయే ॥* 88
*సకంఠే నవ యోన్యాఖ్యం న్యస్యే త్త్రైజత్రయాత్మకమ్ ।*

ఇప్పుడు శరీరంలోని నవ యోనులను న్యాసం చెయ్యాలి. ఈ న్యాసము బాలా మంత్రముతోగాని, పంచదశీ మహా మంత్రముతో గాని చెయ్యాలి. అయితే కొన్ని చోట్ల రెండు మంత్రాలతోనూ కలిపి న్యాసం చెప్పబడింది.

| | | |
|---|---|---|
| రెండు చెవులు, గడ్డము | - | ప్రథమ యోని |
| రెండు శంఖములు, ముఖము | - | రెండవ యోని |
| రెండు కళ్ళు, ముక్కు | - | మూడవ యోని |
| రెండు భుజములు, హృదయము | - | నాల్గవ యోని |
| మోచేతులు, పొట్ట | - | ఐదవ యోని |
| రెండు మోకాళ్ళు, గుహ్యో పరి | - | ఆరవ యోని |
| రెండు పాదములు, గుహ్యము | - | ఏడవ యోని |
| రెండు పార్శ్వములు, హృదయము | - | ఎనిమిదవ యోని |
| స్తనద్వయము, కంఠము | - | తొమ్మిదవ యోని |

## శ్రీవిద్యా న్యాసము

*మూర్ధ్ని గుహ్యే చ హృదయే నేత్రేషు త్రితయేషు చ ॥* **89**

*శ్రోత్రయో ర్యుగళే చైవ ముఖేచ భుజయో స్తథా ।*

*పృష్ఠే జాన్వోశ్చ నాభౌచ విద్యా న్యాసం విధాయచ॥* **90**

శ్రీవిద్యా న్యాసము అంటే శ్రీవిద్యలోని పదిహేను అక్షరాలనూ, శరీరంలోని వివిధ భాగాలలో న్యాసం చెయ్యటం అవి.

1. శిరస్సు 2. గుహ్యము 3. హృదయము 4, 5, 6. మూడు నేత్రాలు 7, 8. రెండు చెవులు 9. ముఖము 10, 11. రెండు భుజాలు 12. వీపు 13, 14. మోకాళ్ళు 15. నాభి

## ఇతర న్యాసాలు

**కరశుద్ధిం పునశ్చైవ ఆసనాది షడంగకం ।**

శ్రీవిద్యా న్యాసము చేసిన తరువాత తిరిగి కరశుద్ధి న్యాసము, చేకురాసనన్యాసము, రక్షా షడం న్యాసము చెయ్యాలి.

## శ్రీకంఠ, వ   ్రవతాన్యాసములు

*శ్రీ కంఠాదీని, వాగ్దేవీ రాగ్ధ్నే హృదయే పున: ।* **91**

*శిఖాయాం బైందవ స్థానే ్ధాగ్నిగ్ని చక్రాదికా న్యసేత్ ।*

ఆ తరువాత శ్రీకంఠ న్యాసము, వాగ్దేవతా న్యాసము చెయ ).

**అగ్ని చక్రాదిన్యాసము :** న్యాల

ఆధార చక్రము హృదయము, భ్రూమధ్యము, బ్రహ్మరంధ్రాలలో అంటే అగ్ని, సూర్య, చంద్ర బ్రహ్మ చక్రాలలో - కామగిరి, జాలంధర, పూర్ణగిరి ఓడ్యాణ పీఠములందు - బ్రహ్మ, విష్ణు, రుద్ర, పరబ్రహ్మాత్మక శక్తులను, కామేశ్వరీ, వజ్రేశ్వరీ, భగమాలినీ, మహా త్రిపురసుందరిలను న్యాసము చెయ్యాలి.

1. అగ్ని చక్రే కామగిరి పీఠే మిత్రేశనా ధాత్మకీ మహా భగమాలినీ దేవీ బ్రహ్మశక్తి శ్రీపాదుకాం పూజయామి నమః

2. సూర్య చక్రే పూర్ణగిరి పీఠే షష్ఠీశ దేవనాధాత్మకే మహావజ్రేశ్వరీ దేవీ విష్ణుశక్తి శ్రీపాదుకాం పూజయామి నమః.

3. సోమచక్రే జాలంధర పీఠే ఊర్ధ్వదేవనాధాత్మకే మహాకామేశ్వరీదేవీ రుద్రశక్తి శ్రీ పాదుకాం పూజయామి నమః

4. పరబ్రహ్మ చక్రే ఓడ్యాణ పీఠే చర్యానాధాత్మకే మహాత్రిపు(   ౦దరీ దేవీ పరబ్రహ్మ శక్తి శ్రీపాదుకాం పూజయామి నమః

నసు(

## తత్వత్రయ న్యాసము

*తత్వత్రయం సమస్తం చ విద్యా బీజ త్రయాన్వితం* **92**

*పాదాది నాభి పర్యంత మాగళం శిరసస్తథా ।* ) ॥

*వ్యాపకం చైవ విన్యస్య స్వాత్మీకృత్య పరంపున: ॥* **93**

*సంతర్పయేత్పున ర్దేవీం సౌమ్యాగ్నేయామృతద్రవై: ।*

**తత్వాలు మూడు రకాలు :** 1) ఆత్మ తత్వము 2) విద్యా తత్వము 3) శివతత్వము. ఈ మూడింటి యొక్క సమిష్టి భుతము నాల్గవది. పంచదశీ మహా మంత్రము మూడు ఖండాలుగా ఉన్నది. ఆ ఖండాలతోకలిపి ఈ తత్వత్రయాన్ని చెప్పాలి. సాధకుని శరీరంలో

1. పాదాల దగ్గర నుండి కటి ప్రదేశం దాకా ఒక భాగము
2. కటి ప్రదేశము నుంచి కంఠము దాకా ఒక భాగము
3. కంఠము నుంచి శిరస్సు దాకా ఒక భాగము

ఈ రకంగా మూడు తత్వాలను న్యాసము చేసి నాల్గవదైన సమిష్టితో సర్వాంగములు న్యాసము చెయ్యాలి.

**పరాన్యాసము:** త్రిపుర సుందర్యాత్మకమైన పరబ్రహ్మ స్వరూపము తనదిగా చేసుకొని, అంటే జీవాత్మ - పరమాత్మా రెండూ ఒకటే అని భావించి పరాన్యాసము చెయ్యాలి. ఇక్కడ "సౌమ్యాగ్నే మామృత ద్రవైః" అన్నప్పుడు సౌమ్య - అంటే బ్రహ్మ రంధ్రము దగ్గర ఉండే చంద్ర మండలము. ఆగ్నేయ - అంటే ఆధార చక్రమందున్న కుండలిని. ఈ కుండలినిని నిద్రలేప గలిగితే, అది ఊర్ధ్వ ముఖంగా బయలుదేరి గ్రంధి త్రయాన్ని భేదించి చంద్రమండలం చేరినప్పుడు, అక్కడ నుండి అమృత ధారలు స్రవిస్తాయి. అప్పుడు కలిగే ఆనందాన్ని సాధకుడు అనుభవించాలి.

## ఉప సంప్రదాయము

***ఏవం చతుర్విధో న్యాసః కర్తవ్యో వీర వందితే ।***
***షోఢాన్యాసోఽణి మాద్యశ్చ మూలదేవ్యాదికః ప్రియే ॥*** 94
***కరశుద్ధ్యాదికశ్చైవ సాధకేన సుసిద్ధయే ।***

ఇక్కడ చెప్పిన విధంగా చతుర్విధ న్యాసాలు చెయ్యాలి. అవి వరుసగా.

1. షోఢాన్యాసాలు - 6
2. సంహార చక్ర న్యాసము - 11
3. సృష్టి చక్ర న్యాసము - 11
4. కరశుద్ధి న్యాసము - 1

| | | | |
|---|---|---|---|
| 5. | చతురాసన న్యాసము | - | 3 |
| 6. | షడంగ న్యాసము | - | 3 |
| 7. | వాగ్దేవతాష్టకము | - | 1 |
| 8. | నవయోని న్యాసము | - | 1 |
| 9. | శ్రీవిద్యా న్యాసము | - | 1 |
| 10. | శ్రీ కంఠాది న్యాసము | - | 1 |
| 11. | అగ్ని చక్రాది న్యాసము | - | 1 |
| 12. | తత్వ న్యాసము | - | 1 |
| 13. | పరాన్యాసము | - | 1 |
| 14. | చక్రేశ్వర న్యాసములు | - | 2 |
| 15. | గణ న్యాసములు | - | 4 |
| | మొత్తం | | 48 |

ఈ న్యాసములు చెయ్యటం వల్ల సాధకుడికి విద్యాసిద్ధి కలుగుతుంది.

## కాల విశేషము

***ప్రాతః కాలే తథా పూజాసమమేహోమకర్మణి ।*** ***95***

***జపకాలే ధవా తేషాం వినియోగః పృథక్పృథక్***

***పూజాకాలే సమస్తం కృత్వాత్సాధక పుంగవః ॥*** ***96***

ప్రాతః కాలంలో సంధ్యా వందనము, బ్రహ్మ యజ్ఞము చేసిన అనంతము ఈ న్యాసము చెయ్యాలి. పూజా సమయంలో సామాన్య అర్ఘ్య పాత్రా సాధన తరువాత, విశేష అర్ఘ్య పాత్రాయధనకు ముందు, హోమకర్మలోనూ, పూజలోనూ, నైవేద్యము, తాంబూలము, నీరాజనము తరువాత, మంత్రపుష్పానికి ముందు న్యాసము చెయ్యాలి. హోమము ప్రారంభించేటప్పుడు, జప కాలమందు న్యాసచతుష్టయమును వేరువేరుగా చెయ్యాలి. ఈ రకంగా చెయ్యలేక పోయినట్లైతే పూజాకాలంలో అన్ని న్యాసాలూ చెయ[illegible]చ్చు. పరాపూ[illegible] తరువాత పైన చెప్పిన నలభై నాలుగు న్యాసాలు చేసి అపరా పరా పూర్వ్యషకు అంగముగా

ప్రాత్రా సాధన చెయ్యటం చేత ఇవి సిద్ధిస్తాయి. అయితే ఈ న్యాసమును ప్రాతః కాలంలో చెయ్యటం ఉత్తమము.

## ౕ పీఠాసనము, ;

***షట్త్రింశ త్తత్త్వ యోగా మాసనం పరికల్ప్య బలి***
***గుప్తాది యోగినీనాం చ మంత్రేణాఽథ బలిం దదేత్ ॥ 97***

పృథి వ్యాది శివ పర్యంతము గల ముప్పైఆరు తత్వాలలో చివర ఉన్న వాటిని అంతకు ముందున్న వా  ో లీనం చేస్తూ పోవాలి! ఈ రకంగా గనక చేసినట్లైతే చివరకు శివతత్వమే మిగులుతుంది. ప్రపంచ భూతాలలోనూ భూమి నీటియందు, నీరు అగ్నిలోనూ, అగ్ని గాలిలోనూ, గాలి ఆకాశంలోనూ ఈ రకంగా అన్నీ ఒకదానిలో లీనమైపోయి చివరకు శివతత్వం మిగులుతుంది. పంచభతాలలోనూ భూమి నీటి యందు, నీరు అగ్నిలోనూ, అగ్ని గాలిలోనూ, గాలి ఆకాశంలోనూ ఈ రకంగా అన్నీ ఒక దానిలో లీనమైపోయి చివరకు శివతత్వం మిగులుతుంది. ఆ శివతత్వాన్ని ఆసనముగా చేసుకొని, వాటన్నింటి పైనా అంటే షట్త్రింశతి తత్వాల పైనా షట్త్రింశ త్తత్వాత్మక యోగ పీఠాయ నమః అనే మంత్రముతో 'అహం బ్రహ్మాస్మి' అనే భావనతో సాధకుడు తానే ఆ ఆసనం మీద కూర్చున్నట్లుగా భావించాలి. ఆ తరువాత తానే శ్రీచక్ర స్వరూపంగా భావించి యోగినీ మంత్రాలతో శిరస్సున పుష్పాంజలి సమర్పించినట్లుగా భావించాలి.

అయితే కొంత మంది అభిప్రాయము ప్రకారము పూజలో విఘ్నాలు కలుగకుండా ఉండటం కోసమని అన్నము, ఉదకము బలిగా సమర్పిం  . అయితే బలి పుష్పాలతో కూడా ఇవ్వవచ్చు అని ఇంకొక మతము. వాలి

## విఘ్న భేదన

***పిండరూప పద గ్రంధి భేదనా ద్విఘ్న భేదకం***
***గుహ్యే హృన్ముఖ మూర్ధాసు విద్యాన్యాసేన సుందరీ ॥ 98***

గుహ్యే - స్వాధిష్ఠానమున

హృది - అనాహతమున

ముఖే - ఆజ్ఞా చక్రమందు

పంచదశీ మహామంత్రంలోని కూట త్రయాన్ని, మూర్ధని - సముస్రారంలో సమిష్టి అంటే పూర్తి మంత్రాన్ని న్యాసం చెయ్యటం చేత, పిండ - ఆధార చక్రము, రూప - మణి పూరము, పద - ఆజ్ఞా చక్రము లందలి బ్రహ్మ విష్ణు రుద్ర గ్రంధుల భేదనము కలిగి, తద్వారా మానసిక విఘ్నాలు పోతాయి. విద్యా న్యాసేన - ఈ విద్యను న్యాసము చెయ్యటం చేత గ్రంధి భేదము గలిగి విఘ్నాలు తొలిగి పోతాయి.

## పూజా గృహ ప్రవేశ కాలమున విఘ్న భేదన

**యాగ మందిరగాంశ్చైవ విఘ్నానుత్సార్య మంత్రవిత్ ।**
**అపసర్పంతు తేభూతా మేభూతాభూమి సంస్థితాః ॥ 99**

**యేభూతావిఘ్నకర్తారస్తే నశ్యంతు శివాజ్ఞయా ।**
**పార్ష్ణిఘాతేన భౌమాంశ్చ తాలేనచ న భోగతాన్ ॥ 100**

**అస్త్ర మంత్రేణ విద్యాంశ్చ దృష్ట్యా విజ్ఞాన పోహయేత్ ।**
**దిక్ష్వోర్ధ్వం మహావహ్ని ప్రాకారం పరిభావయేత్ ॥ 101**

'అపసర్పంతు' మొదలైన మంత్రాలు చదువుతూ ఎడమ మడమను నేలమీద మూడు సార్లు కొట్టటం వలన భూమి మీద ఉన్న భూతాలను పారద్రోలి, తాళత్రయము చేత అంతరిక్షంలోని విఘ్నాలను హరింప చేయవచ్చును. అస్త్ర మంత్రము (ఫట్) ఉచ్చరిస్తూ, క్రూర దృష్టితో చూడటం వలన దివ్య విఘ్నాలు పోతాయి. ఈ రకంగా యాగ మందిరంలో అన్ని విఘ్నాలను పోగొట్టి, నాలుగు దిక్కులా, తనచుట్టూ అగ్ని ప్రాకరము ఏర్పడినట్లు భావించాలి. ఆ తరువాత భూశుద్ధి, ఆసనపూజ (కూర్మ యంత్ర భావన) చేసి షట్త్రింశ తత్త్వాత్మకమైన ఆసనము భావించి యోగినీ మంత్రముతో పూజ చేసి, నమస్కరించి, తరువాత మందిర అర్చన చేసి, నీటితో నిండిన వర్ధనీ కలశాన్ని తనకు ఎడమ వైపున ఉంచి, కుడివైపు గంధ పుష్పాదులుంచి, వాటిలో ప్రథమ, ద్వితీయ, తృతీయము పాత్రలుంచి, వాటిని శాపవిమోచనాదికములతో శోధించాలి. దేవి ముందర వర్ధనీ కలశోదకముతో సామాన్యార్ఘ్య పాత్ర ఉంచాలి. తరువాత పరాపూజ (లమిత్యాది పంచపూజ) చేసి భూతశుద్ధి న్యాసము చెప్పాలి.

## మార్తాండ పూజ

**సామాన్యార్ఘ్యేణ దేవేశి మార్తండం పరిపూజయేత్ ।**
**ప్రకాశ శక్తి సహితమరుణా కల్ప ముజ్జ్వలం ॥** 102
**గ్రహాది పరివారం చ విశ్వతేజోఽవ భాసనం ।**

సామాన్యార్ఘ్యోదకము చేత ప్రకాశ శక్తి కలవాడు, ప్రపంచాన్ని తేజోమయంగా చేసేవాడు, గ్రహాలన్నీ పరివారముగా గలవాడు అయిన మార్తాండుని (సూర్యుని) పూజించాలి.

## శ్రీచక్ర లేఖనము

**సౌమ్యాగ్నేయ యుతైర్దేవి । రోచనా గరుకుంకుమైః ।** 103
**మూలముచ్చారయన్ సమ్యగ్భావయేచ్చక్రరాజకమ్ ।**
**యోగినీ మూల మంత్రేణ క్షిపేత్పుష్పాంజలిం తతః** 104

సౌమ్యం - శివ వీర్యము - పాదరసము, కర్పూరము,ఆగ్నేయం - శుక్లము, గంధకము, కాశ్మీరు కుంకుమ పువ్వు. వీటిలో ఏ రెండింటితోనైనా గోరోజనము, అగరు, కుంకుమలను కలిపి నూరి మూలమంత్రాన్ని పఠిస్తూ శ్రీచక్ర స్థాపన చెయ్యాలి. తరువాత దానికి ప్రాణ ప్రతిష్ఠ చేసి సమస్తయోగినీ మంత్రాలతోనూ అనులోమ విలోమంగా శ్రీచక్రం మీద పుష్పాలను ఉంచి నమస్కరించాలి.

## పుష్పాలు లేనప్పుడు పూజ

**మణి ముక్తా ప్రవాళైర్వా విలోమం మూల విద్యయా**
**అశూన్యం సర్వధా కుర్యాచ్ఛూన్యే విఘ్నా స్త్యనేకశః** 105

ఒకవేళ పూలు గనక దొరకనట్టైతే, ముత్యములు, మణులు, పగడములతో శ్రీచక్రాన్ని అలంకరించ వచ్చును. ఆ తరువాత న్యాసము చెయ్యాలి.

## పాత్రాసాధన - సామాన్యార్ఘ్యము

**శ్రీచక్ర స్యాత్మనశ్చైవ మధ్యే త్వర్ఘ్యం ప్రతిక్షియేత్ ।**

**అర్ఘ్యము :** సామాన్యార్ఘ్య పాత్ర. ఇక్కడ ఆత్మ. శ్రీ చక్రాల మధ్య సామాన్యార్ఘ పాత్రా సాధన చెయ్యాలి.

***చతురస్రాంతరాలస్థ కోణ షట్కే సురేశ్వరి ॥*** ***106***

***షడాసనాని సంపూజ్య త్రికోణ స్యాంతరేపునః ।***

***పీఠాని చతురోదేవి కా పూజావో ఇతిక్రమాత్ ॥*** ***107***

***అర్చయిత్వాऽర్ఘ్యపాదేతు వహ్నేర్దశకలాయజేత్ ।***

***అర్ఘ్య పాత్రం ప్రతిష్టాప్య తత్ర సూర్యకలాయజేత్ ॥*** ***108***

***పాత్రే సూర్య కలాశ్చైవక భాది ద్వాదశార్చయేత్ ।***

***విధృతేతు పునర్ద్ర వ్యే షోడశేందుకలాయజేత్ ॥*** ***109***

***అమృతేశీం చ తన్మధ్యే భావయేచ్చ నవాత్మనా ।***

***నవాత్మనా తతో దేవీ తర్పయేద్దాతు దేవతాః ॥*** ***110***

***ఆనంద భైరవం వౌషడం తేనైవ చతర్పయేత్ ।***

దేవికి ముందరగా సంప్రదాయాను సారము తనకు ఎడమ భాగ ॰ త్రికోణ, వృత్త, షట్కోణ, చతురస్రమండలాలు లిఖించి, షట్కోణంలో షడాసనాలను పూజిం ల లి. షడాసనాలు అంటే

1. సుధార్ణవాసనము   2. పోతాంబు జాసనము   3. దేవ్యాసనము
4. చక్రాసనము   5. సర్వ మంత్రాసనము   6. సాధ్య సిద్ధాసనము

**త్రికోణంలోని**

1. అగ్రకోణంలో - కామగిరి పీఠాన్ని   2. దక్షిణ కోణంలో - పూర్ణగిరి పీఠాన్ని
3. ఉత్తర కోణంలో- జాలంధర పీఠాన్ని   4. మధ్యలో - ఓడ్యాణ పీఠాన్ని

మూడు కోణాలను మూడు కూటములచేత, మధ్య సమిష్టిగానూ ఈ పూజ పంచదశీ మహా మంత్రంతో జరగాలి. చతురస్రంలో ంగ దేవతలను పూజి ాలి. ంవాత ఆధార పాత్రను ఉంచి, దానిలో అగ్ని కళలను షడ పూంచాలి. 'అగ్ని కళలు' !ంచ (c తర ుంచి ము ; క్ష వరకు)

1. ధూమ్ర   2. ఊష్మ   3. జ్వలినీ   4. జ్వాలినీ   5. విస్ఫులింగినీ
6. సుశ్రీ   7. సురూపా   8. కపిలా   9. హవ్య వాహినీ   10. కవ్య వాహినీ

ఆధార పాత్రలో బంగారుపాత్ర ఉంచి దానిలో ద్వాదశ సూర్యకళలను పూజించాలి.

**సూర్య కళలు :**

| | | |
|---|---|---|
| 1. కం భం తపిని | 2. ఖం బం తాపిని | 3. గం ఫం ధూమ్రా |
| 4. ఘం షం మరీచి | 5. జం నం జ్వాలినీ | 6. చంద్రం రుచి |
| 7. ఛం దం సుషుమ్నా | 8. జం ధం భోగదా | 9. ఝం విశ్వా |
| 10. ఞం ణం బోధినే | 11. టం ఢం ధారిణి | 12. ఠం డం క్షమా |

ఆ పాత్రలో ఉదకాన్ని పొయ్యాలి. ఆ ద్రవ్యంలో షోడశ చంద్రకళలను పూజించాలి. ఆ ద్రవ్యమందే అమృతేశీ మంత్రం చేత, ధాతునాధులచేత, మూల విద్య చేత, ఒకొ్క్క మంత్రంతో తొమ్మిది సార్లు మంత్రించాలి. ఆ తరువాత నవాక్షరీ మంత్ర ద్వయంతో తర్పణ చెయ్యాలి. నవాక్షరీ మంత్రము అంటే.

'హసక్ష మల వరయ ఊం'। 'సహక్ష మలవరయ ఈం' వీటిని వౌషట్ అంతముతోచేసి ఆనంద భైరవ ద్వంద్వము తర్పణ చెయ్యాలి.

## విశేషార్ఘ్య పాత్ర

***తథైవార్ఘ్యం విశేషేణ సాధయే త్సాధకోత్తమః ॥*** **111**

సాధకుడు సామాన్యార్ఘ పాత్రాసాధన చేసినట్లు గానే విశేషార్ఘ్య పాత్రా సాధన కూడా చెయ్యాలి. అయితే కొన్ని సంప్రదాయాలలో అగ్ని, సూర్య, చంద్రకళలతో పాటుగా బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఈశ్వర, సదాశివ కళలను కూడా ఆవాహన చెయ్యటం జరుగుతుంది.

**చంద్ర కళలు : (అ నుంచి అః వరకు)**

| | | | |
|---|---|---|---|
| 1. అమృతా | 2. మానదా | 3. పూషా | 4. తుష్టి |
| 5. పుష్టి | 6. రతి | 7. ధృతి | 8. శశిని |
| 9. చంద్రికా | 10. కాంతా | 11. జ్యోత్స్నా | 12. శ్రీ |
| 13. ప్రీతి | 14 అంగదా | 15. పూర్ణా | 16. పూర్ణామృతా |

**బ్రహ్మ కళలు : (క నుంచి ఞ వరకు)**

| | | | | |
|---|---|---|---|---|
| 1. సృష్టి | 2. బుద్ధి | 3. స్మృతి | 4. మేధా | 5. కాంతే |
| 6. లక్ష్మి | 7. ద్యుతి | 8. స్థిరా | 9. స్థితి | 10. సిద్ధి |

**విష్ణు కళలు : (ట నుంచి న వరకు)**

1. జరా 2. పాలినీ 3. శాంత 4. ఈశ్వరి 5. రతి
6. కామికా 7. వరదా 8. హ్లాదిని 9. ప్రీతి 10. దీర్ఘా

**రుద్ర కళలు : (ప నుంచి శ వరకు)**

1. తీక్షణా 2. రౌద్రి 3. భయా 4. నిద్రా 5. తంద్రి
6. క్షుధా 7. క్రోధినీ 8. క్రియా 9. ఉద్గారి 10. మృత్యువు

**ఈశ్వర కళలు : (ష స హ క్ష)**

1. పీతా 2. శ్వేతా 3. అరుణా 4. అసితా

**సదాశివ కళలు : ( అనుంచి అః వరకు)**

1. నివృత్తి 2. ప్రతిష్ఠా 3. విద్యా 4. శాంతి
5. ఇంధకా 6. దీపికా 7. రోచికా 8. మోచికా
9. పరా 10. సూక్ష్మా 11. సూక్ష్మామృతా 12. జ్ఞానా
13. జ్ఞానామృతా 14. ఆప్యాయినీ 15. వ్యాపినీ 16. వ్యోమరూపా

ఈ గ్రంథంలో రెండు పాత్రలే చెప్పబడ్డాయి. 1. సామాన్యార్ఘ్య పాత్ర. 2. విశేషార్ఘ్య పాత్ర. ఇంకొక పాత్ర చెప్పబడలేదు. చక్రార్చనలో సామాన్యంగా వర్ధనీ కలశము అని ఒక పాత్రను ఏర్పాటు చేయటం జరుగుతుంది. అందులోని జలానికి సంస్కారం చేసి ఇక మీదట ఎక్కడ కావాలన్నా దానిలోంచే జలాన్ని వాడటం జరుగుతుంది. దీన్నే కొంత మంది పూర్ణకుంభము అని, పూర్ణ కలశము అని అంటారు.

అసలు శ్రీవిద్యలోనే అనేక సంప్రదాయాలున్నాయి. శ్రీచక్రార్చనను శ్రీ యాగము అనికూడా అంటారు. యాగము చెయ్యటానికి షట్పాత్ర ప్రయోగము చెప్పబడింది. (దర్వ్యాజ్యస్థాల్యౌ, ప్రోక్షణ పూర్ణపాత్రే, ఇధ్మస్తువాఇతి) కాబట్టి ఇక్కడ కూడా ఆరుపాత్రలు ఉండి తీరాలనేది ఒక సంప్రదాయం. వీరి ప్రకారము 1. అమృతపాత్ర, 2. శ్రీపాత్ర, 3. గురుపాత్ర, 4. శక్తి పాత్ర, 5. భోగ పాత్ర 6. బలి పాత్రలు ఉంచాలి. వీటితో పాటుగా శంఖ, అర్ఘ్య, ఆచమన, స్నపన, మధుపర్క, ప్రస్తర, నైవేద్య, ఆత్మ, జాయాపాత్రలు కూడా ఉంటాయి. వీరు వర్ధనీ కలశాన్ని పూర్ణ కుంభము అంటారు.

సామాన్యార్ఘ్య పాత్రను - కలశ పాత్ర లేక శంఖ పాత్ర అని, విశేషార్ఘ్య పాత్రను - అమృత పాత్ర అని అంటారు. ఈ రకంగా చక్రార్చనలో ఎన్ని పాత్రలు ఉంచాలి అనే విషయంలో విభిన్న సంప్రదాయాలున్నాయి.

కాబట్టి సాధకులు గురు సంప్రదాయాన్ని మాత్రమే పాటించాలి.

## గురుపంక్తి పూజ

*గురు పాదాలి మా పూజ్యభైరవాయ తదేత్పునః ।*

*తదాజ్ఞా ప్రేరితం తత్తు గురుపంక్తి నివేదయే ॥* 112

విశేషార్ఘ్య పాత్రలోంచి కొంత నీటిని తీసి పాదుకామంత్రముతో ఆదినాధుని దగ్గర నుండి స్వ గురువు దాకా తర్పణ చేసి, కామేశ్వరీ కామేశ్వరులకు తర్పణ చేసి, ఓఘ త్రయాత్మకమైన గురుమండలాన్ని శిరస్సున తర్పణ చెయ్యాలి. ఇక్కడ భైరవీ భైరవులంటే కామేశ్వరీ కామేశ్వరులు.

## ప్రథమ హోమము

***తదీయం శేషమాదాయ కామాగ్నౌ విశ్వతస్థుషి ।***

***పాదుకాం మూల విద్యాంచ జపన్ హోమం సమాచరేత్ ॥*** 113

పైన చెప్పినట్లుగా శిరస్సునందు తర్పణ చేయగా మిగిలిన నీటిని గురుపాదుకా మంత్రము చెబుతూ తీర్థంగా స్వీకరించాలి. దీనినే చిదగ్నిలో హోమము చెయ్యటమంటారు. ఇదే ప్రథమ హోమము.

## ద్వితీయ హోమము

*మహాప్రకాశే విశ్వస్య సంహారవమనోద్యతే ।*

*మరీచి వృత్తర్జుహయాన్మన సాకుండలీముఖే ॥* 114

సంహారము తరువాత సృష్టికి ఉన్ముఖమైన, మహా ప్రకాశ రూపమైన అగ్ని నోటియందు, పాత్రను మనసుగానూ, మనసులో వచ్చే ఆలోచనలు హవిస్సుగా భావించి హోమము చెయ్యాలి.

## మూడవ ఆహుతి

*అహంతే దంతయోరైక్య మున్యన్యాం స్రుచి కల్పితం ।*
*మథనో ద్రేకసం భూతం వస్తు రూపం మహాహవి: ॥* **115**

అహంతా - ఆత్మరూపము, ఇదంతా - జగద్రూపము. ఆత్మ రూపాన్ని జగద్రూపంతో ఐక్యము చేసి మధించటం వల్ల పుట్టిన మహా హవిస్సు. ఉన్మని అవస్థలో కలిగిన ఆ హవిస్సును తనయందే హోమము చెయ్యాలి. అంటే తన యందే లీనము చేసుకోవాలి.

## శ్రీచక్ర పూజ

*హుత్వాహుత్వా స్వయంచైవ సహజానంద విగ్రహ: ।*
*స్వప్రథా ప్రసరాకారం శ్రీ చక్రం పూజయే ద్బుధ: ॥* **116**

పైన చెప్పిన మూడు హోమాలనూ పూర్తి చేసిన తరువాత సాధకుడు స్వయంగా ఆనంద విగ్రహుడౌతాడు. అప్పుడు ఆనంద రూపమైన శ్రీ చక్రాన్ని మనస్సులో భావించి పూజించాలి.

## ద్వార దేవతా పూజ

*గణేశం దూతరీం చైవ క్షేత్రేశందూతికాం తథా ।*
*బాహ్యద్వారేయజేద్దేవి దేవీశ్చ స్వస్తి కాదికా:* **117**

గణేశ శక్తి - దూతర అని క్షేత్ర పాలకశక్తి దూతికా అని చెప్పబడుతున్నాయి. వీటిని ద్వార శాఖలలో పూజించాలి. బాహ్య ద్వారం దగ్గర స్వస్తికా, సరస్వతీ, దుర్గా, భద్రకాళీలను పూజించాలి.

## గురు పంక్తి పూజ

*తతశ్చాన్త స్త్రికోణేఽపి గురుపంక్తిం త్రిధాస్థితాం ।*
*తదంతశ్చ మహాదేవీం తామావాహ్య యజేత్పున: ॥* **118**

త్రికోణంలోని బిందువుకు వెనుక భాగంలో మూడు వరుసలలో ఉన్న 1) దివ్యౌఘ, 2) సిద్ధౌఘ, 3) మానవౌఘ రూపాలలో ఉన్న గురు పంక్తిని పూజించాలి. తరువాత బిందువులోకి ఆ పరమేశ్వరిని ఆహ్వానించి లమిత్యాది పంచపూజల చేత పూజించాలి.

లమిత్యాద్య పంచ పూజలు :

1. లం పృథ్వీ తత్వాత్మికాయై శ్రీ పరదేవతాయై గంధం పరికల్పయామి - సుగంధముల వంటి పదార్థములతో పరమేశ్వరి యందు శాశ్వత ఆశ్రయము పొందటము.
2. హం ఆకాశ తత్వాత్మికాయై శ్రీ పరదేవతాయై పుష్పం సమర్పయామి - మంచి శబ్దము వంటిపదార్థాను భవముతో పరమేశ్వరి యందు శాశ్వత ఆశ్రయము పొందటము.
3. యం వాయు తత్వాత్మికాయై శ్రీ పరదేవతాయై ధూప మాఘ్రాపయామి - మంచి స్పర్శ వంటి పదార్థాను భవంతో పరమేశ్వరి యందు శాశ్వత ఆశ్రయము పొందటము.
4. రం తేజస్తత్వాత్మికాయై శ్రీ పరదేవతాయై దీపం సమర్పయామి - మంచి రూపం వంటి పదార్థాను భవంతో పరమేశ్వరి యందు శాశ్వత ఆశ్రయము పొందటము.
5. వం అమృత తత్వాత్మికాయై శ్రీపరదేవతాయై నైవేద్యం సమర్పయామి - మంచి రుచి గలిగిన పదార్థాను భవముతో పరమేశ్వరి యందు శాశ్వత ఆశ్రయము పొందటము.

అని అమృతానందుల వారు తమ దీపికా వ్యాఖ్యలో వ్రాశారు.

## బిందువు నందు అర్చన

**మహాపద్మవనాంత స్థాం కారణానంద విగ్రహాం**
**మదంకోపాశ్రితాం దేవీ మిచ్ఛాకామ ఫలప్రదం ॥ 119**
**భవత్రీం త్వన్మయై రేవ నైవేద్యాది భిరర్చయేత్ ।**

మహా పద్మవనము - సహస్రారము.

కారణానంద విగ్రహా - శోధించుట చేత అమృతము త్రాగుట వలన పరమానందమైన శరీరము గలది పరమేశ్వరి.

సాధకుడు తనను కామేశ్వరునిగా భావించి, కామేశ్వరుని అంకమందున్నది, కోరిన కోరికలు తీర్చేది, సంవిత్స్వరూపురాలు అయిన ఆ పరమేశ్వరిని ధూప దీప నైవేద్యములతో అర్చించాలి.

## నిత్యలు

*త్రికోణే తత్పురత్తా యాః ప్రతిబింబాకృతీః పునః ॥* **120**

*తత్తత్తిథిమయీర్నిత్యాః కామ్యకర్మాను సారిణీః ।*

నిత్య - నిత్యమూ శాశ్వతముగా ఉండేది. ఉత్పత్తి, నాశనము లేనటువంటిది. పరదేవత యొక్క ప్రకాశము చేత ప్రతిబింబాలుగానూ, దేవికి సమానమైన రూపము గలవారు గానూ, ఆమె ఇష్టానుసారము వర్తించే నిత్యాదేవతలు త్రికోణంలోని మూడు రేఖలలోనూ ఉన్నారు. వీరిలో మొదటగా తిధి నిత్యను పూజించి, తరువాత మిగిలిన నిత్యలను పూజించాలి.

## ప్రకట యోగినులు

*తత్రప్రకటయోగిన్యశ్చక్రే త్రైలోక్యమోహనే ॥* **121**

*మాతృకా స్థూల రూపత్వా త్వ గాది వ్యాపకత్వతః ।*

*యోగిన్యః ప్రకటాజ్ఞేయాః స్థూల విశ్వ ప్రధాత్మని ॥* **122**

త్రైలోక్య మోహన చక్రము అంటే భూపురము. అందులో ప్రకట యోగినులను పూజించాలి. అకారాదిక్ష కారాంతము మాతృకలు స్థూల రూపము గలవి. నాలుగు రకాలయిన వాక్కులలోనూ వైఖరీ వాక్కు స్థూల రూపమైనది. అలాగే స్థూల శరీర మందు గల త్వగాది ధాతువులందు ఈ యోగినులు వ్యాపించి ఉన్నారు కాబట్టిప్రకటయోగినులనబడుచున్నారు. ముప్పై ఆరుతత్వాలలోనూ ఈ విశాల విశ్వము భూతత్వము నందు వ్యాపించి ఉన్నది. అటువంటి భూపురము నందే ఈ యోగినులున్నారు కాబట్టిప్రకట యోగినులనబడుచున్నారు.

## అష్ట సిద్ధుల ధ్యానము

*అణి మాద్యా మహాదేవి సిద్ధయోఽష్టౌ వ్యవస్థితాః ।*

*తాసు రక్తతరా వర్ణై ర్వరాభయ కరాస్తథా ॥* **123**

*ధృతచింతా మహారత్నామనీషిత ఫలప్రదాః ।*

భూపురంలోని మొదటి రేఖలో అణిమాది సిద్ధి దేవతలున్నారు. వారే అష్టసిద్ధులుగా చెప్పబడుతున్నారు. వీరు పది మంది. ఎరుపు వర్ణము గల వారు. వరాభయ ముద్రలు గల వారు. వీరు శిరస్సున చింతామణి ధరించి సాధకుల యొక్క అన్ని కోరికలు తీరుస్తుంటారు.

## బ్రాహ్మీ దేవత

*బ్రహ్మ్యాద్యా అపి తత్ర [illegible] క్రమత: ప్రియే* 124

*బ్రహ్మాణీ పీతవర్ణాచ చతుర్భి: శోభితాముఖై: ।*

*వరదాఽభయహస్తాచ కుండి కా క్షలసత్కార: ॥* 125

భూపురంలోని రెండవ రేఖలో బ్రాహ్మీమాహేశ్వరీ మొదలైన ఎనిమిది మంది దేవతలున్నారు. వీరు ఎనిమిది దిక్కుల యందు ఉంటారు. అనగా నాలుగు దిక్కులలోనూ, నాలగు విదిక్కులలోనూ ఉంటారు.

బ్రాహ్మీ దేవత పసుపు వర్ణముతో నాలుగు ముఖములు కలిగి, నాలుగు చేతులు యందు కమండలము, అక్షమాలా, వరదా, అభయ ముద్రలు కలిగి ఉంటుంది.

## మహేశ్వరీ

*మాహేశ్వరీ శ్వేతవర్ణా త్రినేత్రా శూల ధ[illegible]ణీ ।*

*కపాల మేణం పరశుందధానా పాణిభి: ప్రియే ॥* 126

మాహేశ్వరి తెల్లని వర్ణము గలది. మూడు నేత్రములు కలిగి నాలుగు చేతుల యందు త్రిశూలము, కపాలము లేడి, గొడ్డలి ధరించి ఉంటుంది.

## కౌమారి

*కౌమారీ పీతవర్ణా చ [illegible]తోమర ధారిణీ ।*

*వరదాభయ హస్తాచ ధ్యాతవ్యా పరమేశ్వరి ॥* 127

కౌమారి పసుపు వర్ణము గలది. రెండు చేతులయందు శక్తి అనే ఆయుధము, మిగిలిన రెండు చేతులయందు వరద అభయ ముద్రలు ధరించి ఉంటుంది.

## [illegible]ష్ణవి

*వైష్ణవీ శ్యామవర్ణా చ శ[illegible]క్ర గదాబ్జకాన్ ।*

*హస్త పద్మైశ్చ బిభ్రాణా [illegible]షితా దివ్య భూషణై: ।।* 128

వైష్ణవీ దేవి శ్యామ వర్ణంతో శంఖు, చక్ర, గదా, పద్మములను ధరించి దివ్యాభరణములు ధరించి ఉంటుంది.

## వారాహి

*వారాహీ శ్యామలాచ్ఛాయా పోత్రి వక్త్ర సముజ్వలా ।*
*హలంచ ముసలం ఖడ్గం ఖేటకం దధతీభుజైః ॥* **129**

వారాహీ దేవి శ్యామల వర్ణంతో, మూడు ముఖాలు కలిగి నాగలి, రోకలి, ఖడ్గము, ఖేకటము ధరించి ఉంటుంది.

## మాహేంద్రీ

*ఐంద్రీతు శ్యామలాచ్ఛాయా వజ్రోత్పల లసత్కరా ।*
*చాముండాకృష్ణ వర్ణా చశూలండమరుకం తథా ॥* **130**
*ఖడ్గం వేతాళకం చైవ దధానా దక్షిణైర్భుజైః ।*
*నాగ కౌటక ఘంటాశ్చ దదానాన్యైః కపాలకం ॥* **131**

మహేంద్రి శ్యామల వర్ణంతో చేతియందు వజ్రాయుధమును ధరించి సాక్షాత్తు ఇంద్రుని వలెనే ఉంటుంది.

చాముండా శకక్తి కృష్ణ వర్ణ. ఈమె చేతులయందు శూలము, డమరుగము, సర్పము, కపాలము ధరించి ఉంటుంది.

## మహాలక్ష్మి

*మహాలక్ష్మీ స్తు పీతాభా పద్మే దర్పణమేవచ ।*
*మాతులుంగ ఫలం చైవ దధానా పరమేశ్వరి ॥* **132**

మహాలక్ష్మి రెండు కమలములు, అద్దము, మాతులుంగ ఫలము - మాదీ ఫలము చేతులందు ధరించి పీత వర్ణముతో ఉంటుంది.

## కర శుద్ధి లక్షణము

*ఏవంధ్యాత్వా యజేదేతాశ్చ క్రేశీం త్రిపురాంతత: ।*
*కర్మేంద్రియాణాం వైమల్యా త్కరశుద్ధి కరీస్మృతా ॥* 133
*కార్యశుద్ధి భవాసిద్ధి రణి మాచాత్ర సంస్థితా ।*

భూపురంలోని మూడవ రేఖలో ముద్రా దేవతలున్నారు. గతంలో ప్రకటయోగినీ దేవిని చెప్పినట్లుగానేవీరిని కూడా భావించాలి. ప్రకట యోగినినిధ్యానించి ముద్రా దేవతలను పూజించాలి. భూపుర చక్రేశ్వరి త్రిపురా త్రిపురాదేవి విద్యకు "కర శుద్ధి కర" విద్య అని పేరు కరశుద్ధి కరీ - కర్మేంద్రియాలు చేసిన దోషాలను పోగొట్టునది.

ప్రతి ఆవరణలోనూ ఒక సిద్ధి, ఒక ముద్ర ఉంటాయి. ఆవరణ దేవతలను పూజించిన తరువాత సిద్ధిని, ముద్రా దేవతనూ కుడా పూజించాలి. ఈ ఆవరణలో అణిమాసిద్ధినీ, సర్వ సంక్షోభిణీ ముద్రా దేవతనూ పూజించాలి.

## ద్వితీయావరణ పూజ

*షోడశ స్పంద సందోహే చమ త్కృతి మయి | కళా: ॥* 134
*ప్రాణాది షోడశానాం తు వాయూనాం ప్రాణనాత్మికా: ।*
*బీజ భూతా: స్వరాత్మత్వాత్కలనా : రూపకా: ॥* 135
*అంతరంగ తయా గుప్తాయోగిన్య: ద్వ్యవస్థితా: ।*
*కామాకర్షణ రూపాద్యా: సృష్టే: ప్రాథస్వత: ప్రియే ॥* 136
*సర్వాశా పూరణాఖ్యేతు చక్రే వామేన పూజయేత్ ॥*

**షోడశస్పదా:** పంచభూతాలు, జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, మనస్సు, వీటిని ఒకటిగా చెయ్యటము. ఈ పదహారు తత్వాలు ప్రాణ వాయువుతో పట్టి ఒకటిగా ఉంచబడ్డాయి. ఇవన్నీ ప్రాణాన్ననుసరించి పని చేస్తాయి కాబట్టి ప్రాణానికి అధీనంలో ఉంటాయి. వీటికి ప్రాణము అచ్చులు. భౌతిక సృష్టికారణంగా ఇవి బీజ భావము పొందినాయి. త్వగాది ధాతువుల చెందిన కారణంగా శరీరంలో ఉంట యి. అందుచేతనే గుప్త యోగిని అని చెప్పబడున్న యి. ఈ ఆవరణలో కామాకర్షిణ్యాది దేవతలను వామావర్తేన - తనకు ఎదురుగా ఉన్న ప్రదక్షిణముగా పూజించాలి.

## త్రిపురేశీ

పాశాంకుశధరా హ్యేతా రక్తా రక్తాంబ రావృతాః ।  137
ప్రాణశుద్ధిమయీ సిద్ధిర్లఘిమా భోక్తు రాత్మనః ।
త్రిపురేశీచ చక్రేశీ పూజ్యా సర్వో పచారకైః ॥  138

పదహారు స్వరాలు గల తత్వాలు కలిగిన జీవుణ్ణి శుద్ధి చేసేది లఘి మాసిద్ధి. త్రిపురేశీ అనబడే ఈ చక్రేశ్వరిని, సర్వ విద్రావిణీ ముద్రనూ అగ్రదళములందు పూజించాలి. త్రిపురేశి పాశము అంకుశము ధరించి ఎఱ్ఱని వర్ణముతో, ఎఱ్ఱని వస్త్రములు ధరించి ఉంటుంది.

## తృతీయావరణ

ప్రకృత్యష్టక రూపస్థాః కవర్గా వ్యష్ట వర్గగాః ।
అనంగకుసుమాద్యాశ్చ సర్వ సంక్షోభణ కారకే ॥  139
చక్రీ చాత్యంతరంగ త్వా దేతా గుప్త తరామతాః ।
పాశాంకుశ ధనుర్బాణ కరా రక్తా సమర్చయేత్ ॥  140

**ప్రకృత్యష్టకం :** ప్రకృతి, మహత్తత్వము, అహంకారము, పంచ తన్మాత్రలు. ఇవి క చ ట త ప య శ క్ష అనే ఎనిమిది వర్గులతోనూ కూడి, అనంగ కుసుమా మొదలైన శక్తులతో కలిసి సర్వ సంక్షోభిణీ చక్రమందు పూజింపబడుతున్నాయి. వీరు అతి అంతరంగముగ ఉండటం చేత గుప్తతర యోగినులని చెప్పబడుతున్నారు.

## త్రిపురసుందరి

తత్తదాకార బుధ్యాత్మ భోగ్యభోక్తుర్మహే శితుః ।
పిండాది పద విశ్రాంతి సౌందర్య గుణ సంయుతా॥  141
చక్రేశ్వరీ బుద్ధిశుద్ధి రూపాచ పరమేశ్వరి ।
మహిమాసిద్ధి రూపాచ పూజ్యా సర్వోపచారకైః ॥  142

విషయాకారము పొందిన బుద్ధి భోగ్యమైనది. భోక్త జీవుడు. జీవుడికి షట్చక్రాలలోనూ ఏ విశ్రాంతి వలన సహజమైన విశ్రాంతి కలుగుతుందో అది సౌందర్య గుణము.

**సౌందర్యము :** అనిత్యము, అశుచి అయిన సంసార లక్షణాన్ని పరమదౌర్భాగ్యాన్ని పోగొట్టేనిత్యము, శుద్ధము, ప్రేమాస్పదము, అందరిచేత కోరదగినది, అయినపరమశివరూపమే సౌందర్యము అని అమృతానందుల వ్యాఖ్య.

అటువంటి ఆనందాన్నిచ్చే పరమేశ్వరి త్రిపురసుందరి పేరుతో తృతీయ చక్రేశ్వరి అయింది. ఆమె యొక్క రూపమే మహిమాసిద్ధి. ఈ చక్రంలో సర్వ సంక్షోభిణీ ముద్రను కూడా పూజించాలి.

## చతుర్ధావరణ

*ద్వాదశ గ్రంధి భేదేన సముల్లసిత సంవిదః ।*
*విసర్గాంత దశావేశాచ్చాక్తాను భవ పూర్వకం ॥* **143**

*ఉన్మేషశక్తి ప్రసరై రిచ్ఛాశక్తి ప్రధానకైః ।*
*తథైవాऽకుల సంఘట్ట రూపైర్వర్ణ చతురష్టయైః* **144**

*వేద్యోష్మ రూప సావర్ణై ర్మిశ్రేచ్ఛా భావితైరపి ।*
*కులశక్తి సమావేశ రూప వర్ణ ద్వయాన్వితైః* **145**

*శక్తేఃసారమయత్వేన ప్రసృతత్వాన్మహేశ్వరి ।*
*సంప్రదాయ క్రమాయాతాశ్చక్రే సౌభాగ్యదాయకే ॥* **146**

మూలాధారము నుంచి పైకి లేచిన కుండలినీ శక్తి బ్రహ్మర ంధ్ర చేరినప్పుడు సాధకుడికి పరమానందము కలుగుతుంది. ఇక్కడ ఉన్మేషశక్తి - ఉకారము. ఇచ్ఛాశక్తి - ఇకారము అకులము - సహస్ర దళము బ్రహ్మ రంధ్రం దగ్గర ఉన్మేషశక్తి - ఉకారము. ఇచ్ఛాశక్తి - ఇకారము అకులము - సహస్ర దళము బ్రహ్మ రంధ్రం దగ్గర ఉన్నది. దానిలోని అకారము - శివుడు. ఆ శివునితో సామరస్యము పొందిన శక్తి అకుల సంఘట్ట రూపం. శివశక్తి అయిన అకారము ఇచ్ఛా శక్తి అయిన ఇకారముతో కలియగా ఏకారము వస్తుంది. ఏకారము అకారముతో కలిస్తే ఐ కారమవుతుంది. శివశక్తి అయిన అకారము ఉన్మేషశక్తి అయిన ఉకారముతో కలిస్తే ఓ కారము వస్తుంది. ఓకారము అకారముతో కలిసే ఔకారము వస్తుంది. ఈ రకంగా ఆ ఏ ఐ ఓ ఔ లను వర్ణ చతుష్టయ మంటారు. అకుల ఈషణావ ఘుల ఙ్రశుం చేత షండ హ్రస్వములనబడే ఋ,ౠ లు వస్తాయి. శివశక్తి - అకారము,ఇచ్ఛాశక్తి - ఇకారము. ఉన్మేషశక్తి - ఉకారము. వర్ణ చతుష్టయము ఏ ఐ ఓ ఔ.

షండద్వయము ఋ, ౠ మొత్తం తొమ్మిది. కులశక్తి సమావేశ రూపవర్ణ ద్వయాన్వితైః.

**కులశక్తి :** కుండలిని. సమావేశ - విశ్రాంతి స్థానాలు. ఆధార చక్రము, బ్రహ్మ రంధ్రము. వీటి వర్ణాలు లకార వకారాలు.

**మూలా ధారము :** పృథివీ బీజము ల కారము

**సహస్రారము :** అమృతమయము వ కారము

**సాద్యవర్ణైః :** సకారముకు ముందు ఉండే అక్షరాలు. య ర ల వ.

కుల శబ్దముతో అకుల శబ్దము కూడా గ్రాహ్యము అకులశక్తి హ కారము.

ఇవన్నీ కలిసి పద్నాలుగు అక్షరాలు.

అ ఇ ఉ ఋ ౠ ఏ ఐ ఓ ఔ య ర ల వ హ ఇవి చతుర్ద శారములోని వర్ణములు. ఇంకో రకంగా చెప్పాలంటే.

| | | | | |
|---|---|---|---|---|
| అకారాదిహ్రస్వ పంచకము | - | అ ఇ ఉ ఋ | - | 5 |
| సంధ్యక్షర చతుష్టయము | - | ఏ ఐ ఓ ఔ | - | 4 |
| హకారాది భూత పంచకము | - | ల హ య ర వ | - | 5 |
| మొత్తం కలిసి పద్నాలుగు అక్షరాలు | | | | 14 |

ఇవి పద్నాలుగు చతుర్దశార వర్ణాలనబడతాయి.

## త్రిపుర వాసినీ

*నిరంతర ప్రథారూప సౌభాగ్యం బలయోగతః ।*
*అన్వర్థ సంజ్ఞికే దేవి అణి సద్దాః శుభాః ॥* 147

*సర్వ సంక్షోభిణీ పూర్వా దేహోక్షాది విశుద్ధిదాః ।*
*ఈశిత్వ సిద్ధి రపి చక్రోక్త రూపే పురత్రయే ॥* 148

*యోగాది క్లేశభే దేన సిద్ధా త్రిపుర వాసినీ ।*
*ఏతాః సంపూజయే ద్దేవి సర్వాస్సర్వోపచారకైః ॥* 149

**నిరంతర ప్రభా :** అభేద జ్ఞానము. ఈ జ్ఞానము యొక్క రూపము సౌభాగ్యము. ఇది ఈ చక్రముతో కలిసి ఉండటం చేత దీన్ని సర్వసౌభాగ్య దాయక చక్రము అంటున్నారు. ఈ

చక్రంలో అణిమాసిద్ధితో సమానమైన రంగు, ఆకారము గలిగి వరాభయముద్రలు, చింతామణులు ధరించిన దేవతలుండి సాధకులకు నిరంతరము శుభాన్ని కలుగ చేస్తారు. జ్ఞానేంద్రియాలకు, కర్మేంద్రియాలకు శుద్ధి కలుగుచేస్తారు. ఇక్కడ శుద్ధి అంటే చిదేక విశ్రాంతి. ఈ శుద్ధి చేత స్వాతంత్ర్యము సిద్ధిస్తుంది. వీరు సంక్షోభిణీ మొదలైన శక్తులు. ఇక్కడ ఈశిత్వసిద్ధి ఉంటుంది. సర్వ వశంకరీముద్ర కూడా సూచించబడుతుంది. మాతృమాన మేయ రూపములతో చెప్పబడిన పురత్రయమునందు భేద భావముండటం చేత ఈ దేవత త్రిపుర వాసినీ అనబడుతుంది. వీరందరినీ సర్వోపచారాలతోనూ పూజించాలి.

## పంచమావరణ (బహిర్దశారము)

సదాతనానాం నాదానాం నవరంధ్రస్థితాత్మనాం ।
మహాసామాన్య రూపేణ వ్యావృత్త ధ్వని రూపిణీ ॥ 50

అస్థిరస్థిరవేద్యానాం ఛాయారూపై ర్దశార్ణకైః 15
కుల కౌళిక యోగిన్యః సర్వ సిద్ధి ప్రదాయికాః ॥ 151

శ్వేతాంబరధరా శ్శ్వేతా శ్శ్వేతాభరణ భూషితాః ।
మంత్రాణాం స్వప్రధారూప యోగదస్వార్థ సంజ్ఞకే ॥ 152

సర్వ సిద్ధి ప్రదా ద్యాస్తు చక్రే సర్వార్థసాధకే ।
లోకత్రయ సమృద్ధీనాం హేతుత్వాచ్చక్ర నాయికా ॥ 153

త్రిపుర శ్రీర్మ హేశాని మంత్రశుద్ధి భవాపునః ।
వశిత్వసిద్ధి రాఖ్యాతా ఏతాస్సర్వా స్సమర్చయేత్ ॥ 154

ఆధార చక్రానికి కిందగా ఒక సహస్రారమున్నది. దాన్నే అకులమంటారు. 1) అకుల 2) విషు, 3) ఆధార 4) స్వాధిష్టాన 5) మణిపూర 6) అనాహిత 7) విశుద్ధి 8) లంబికాగ్రము (సూక్ష్మజిహ్వా) 9) అజ్ఞా చక్రము. పదవది బ్రహ్మ రంధ్రము. మధ్యమా వాగ్రూపమైన నాదాలు పది. అవి.

| | | | | |
|---|---|---|---|---|
| 1. అవికృతి | 2. శూన్య | 3. స్పర్శ | 4. నాద | 5. ధ్వని |
| 6. బిందు | 7. శక్తి | 8. బీజం | 9. అక్షర | 10. ఆరబ్ధ |

ఈ నాదాలు పైన చెప్పిన స్థానాలతో మిళితమై ఏ ధ్వని ౖంందో ఆ ధ్వని మధ్య మాత్వరూపంతో చెప్పబడుతోంది. అమృతానందుల వారు ఈ వస్తువులు తొమ్మిదే అని చెప్పారు పదవది చెప్పబడలేదు. ఇనా

**అస్థిరవేద్యములు :** కర్మేంద్రియాల గోచరత్వం వలన చెప్పబడే క్రియలు. వచన, దానాగమన విసర్గానందాలు.

**స్థిర వేద్యములు :** జ్ఞానేంద్రియ గోచరమైన క్రియలు శబ్ద, స్ప రూప, రస, గంధాలు.

ఇప్పుడు పంచభూతాలకు, తన్మాత్రలకు ఛాయా రూపములైన క చ వర్గులలోని అక్షరాలు చెప్పబడుతున్నాయి.

కులము అంటే దేహము. కాబట్టి జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు కుల మని చెప్పబడతాయి.

ఇంద్రియ సంబంధమైన విషయాలు కౌళికము. కులము - త్రిపుటి. కౌళికము - చిద్రూపమైన ఆత్మ. ఈ రెంటికీ భేదము లేదని తెలుసుకోవటమే యోగము. ఈ రకంగా సర్వ సిద్ధులను ఇచ్చే దేవతలు ఇక్కడున్నాయి. సర్వార్థాలను ఇచ్చే శక్తులతోకూడి ఉన్నందున దీన్ని సర్వార్థదాయక చక్రము అంటారు. ఈ దేవతలు మూడులోకాల వారికీ సమృద్ధియైన ఐశ్వర్యము నిస్తారు కాబట్టి ఈ చక్రనాయిక పేరు పుర అనబడుచున్నది. మంత్ర సిద్ధిని ఇచ్చే వసిత్వ సిద్ధి, సర్వోన్మాదినీ ముద్రలను ఇక్కడ త్రిజించాలి.

## షష్టావరణ (అంతర్దశారము)

*ఊర్ధ్వాధోముఖ యాదేవి కుణ్డ లిన్యా ప్రకాశితా: ।*
*కులేచ్ఛయా బహిర్భావా త్కాది వర్ణ ప్రదామయీ ॥* 155

*నిగర్భ యోగినీ వాచ్యా: స్వరూపావేశ రూపకే ।*
*సర్వావేశకరే చక్రే సర్వ రక్షాకరే పరా: ॥* 156

*నవజ్ఞా ద్యా: స్థితా ఏతా: సహ పుస్తాక్ష మాలికా: ।*
*మాతృమాన ప్రమేయాణాం పురాణాం పరిపోషిణీ ॥* 157

*త్రిపురా మాలినీ ఖ్యాతా చక్రేశీ త్రిపుర మోహినీ ।*
*విద్యాశక్తి విశుద్ధం చ సిద్ధిం ప్రాకామ్య సంజ్ఞితాం ॥* 158

*ఏతాస్సర్వోప చారేణ పూజయే ద్దేవతా క్రమేత్ ।* ॥

సాధకుడి యొక్క ప్రయత్నంతో ఆధార చక్రం నుంచి సహస్రారము దాకా, మళ్ళీ సహస్రారము నుండి ఆధార చక్రం దాకా కుండలినీ శక్తి సుషుమ్న గుండా తిరుగుతూ ఉంటుంది. ఈ ప్రయాణంలో త్రిపుటి యొక్క నిర్మాణేచ్ఛ చేత బయటకు వచ్చిన మాతృమానమేయాలు కుండలిని ఆశ్రయించి ఉన్నాయి. కాళీశక్తి వాచ్యమైన కకారము శక్తి లక్షణము గలది. మ కారము శక్తి లక్షణము గలది. య నుండి క్ష వరకు గల పది అక్షరాల రూపాలూ నిగర్భ యోగినీ పేరుతో ప్రసిద్ధమైనవి. ఇవి పూర్తిగా కుండలిని యందుంటాయి. కాబట్టి నిగర్భ యోగినీ అంటారు.

తన యొక్క స్వరూపము బ్రహ్మత్వము. బ్రహ్మత్వము యొక్క ఆవేశ రూపమే ప్రకాశరూపము. అందుచేతనే సర్వావేశకరీ అనబడింది. ఇది సర్వరక్షాకర చక్రము. పరబ్రహ్మ స్వరూపమైన ప్రకాశత్వమే సర్వరక్షాకరత్వము. సర్వజ్ఞా మొదలైన శక్తులు చేతులయందు పుస్తకము, అక్షమాల ధరించి ఉంటాయి. ఈ పదిశక్తులూ మాతృమానమేయాలను పోషిస్తున్నాయి. అందుచేతనే ఈ చక్రేశ్వరి త్రిపురమాలినీ అని పిలవబడుతుంది. సిద్ధినిచ్చే దేవత. ఇక్కడ సర్వ మహాంకుశ ముద్ర సూచించబడుతోంది. ఈ దేవతలందర్నీ సర్వోపచారములతో పూజించాలి.

## సప్తమావరణ (అష్ట కోణము)

*నిరుద్ధ వాయుసంఘట్ట స్ఫుటిత గ్రంథిమూలతః ॥* **159**

*హృదయాంతర సంవిత్తి శూన్యపుర్యష్ట కాత్మనా ।*
*బీజరూప స్వరకళా స్పృష్ట వర్గాను సారతః ॥* **160**

*రహస్యయోగినీర్దేవీః సంసార దళనోజ్జ్వలే ।*
*సర్వరోగహరేచక్రే సంస్థితా వీరవందితే ॥* **161**

*వశిన్యాద్యారక్త వర్ణా వరదాభయముద్రితాః ।*
*పుస్తకం జప మాలాంచ దధానాః సిద్ధయోగినీ : ॥* **162**

*శుద్ధ విద్యా విశుద్ధించ భుక్తి సిద్ధిం మహేశ్వరి ।*
*ఈశ్వరీం త్రిపురాం సిద్ధాం పూజయేద్బిందుతర్పణైః ॥* **163**

షట్చక్రాలకు రెండు వైపులా గ్రంధులున్నాయి. ప్రాణాయామము చేసినప్పుడు ఈ గ్రంధులు ఉబ్బుతాయి. ఆధారంలో బయలుదేరిన కుండలిని, ఈ గ్రంధులను ఛేదించుకొని పైకి పోతుంది. హృదయంలో శూన్యాకారముంటుంది. పుర్యష్టకము సూక్ష్మతమమైనది. పుర్యష్టకము - అంటే.

1. కర్మేంద్రియాలు
2. జ్ఞానేంద్రియాలు
3. మనోబుద్ధి చిత్త అహకారాలు
4. ప్రధాన వాయువులు (ప్రాణాపాన వ్యానోదాన సమానములు)
5. పంచభూతాలు
6. కామము
7. కర్మ
8. అజ్ఞానము

ఇవన్నీ ఆత్మతో సూచించబడుతుంటాయి. క మొదలైన వర్ణలన్నీ స్వరాలతో కలిసి ఉచ్చరించబడుతుంటాయి. ఇవే రహస్య యోగినీ పేరుతో ప్రసిద్ధమైనవి. సంసార బంధనాలే రోగము. అదే భవరోగము. వీరులచే నమస్కరింపబడే ఈ చక్రంలో వశిన్యాది దేవతలుంటారు. వీరు రక్త వర్ణముతో వరద అభయముద్రలు పుస్తకము జపమాల ధరించి ఉంటారు. ఈ యోగినులు సిద్ధి పదముతో కూడి చెప్పబడుతున్నారు. జీవుడు దేవుడు, పరమాత్మ - జగత్తు అంతా ఒక్కటే అనే భావనే శుద్ధ విద్య. ఆ భావన గల ఈ చక్రేశ్వరి త్రిపురాసిద్ధి. ఈ చక్రంలో ముద్రాదేవి పేరు ఖేచరీ ముద్ర భుక్తిసిద్ధి.

## అష్టమావరణము (త్రికోణము)

*శక్తి త్రయాత్మికాదేవి చిద్వామ ప్రసరాప్పరాః ।*
*సంవర్తాగ్ని కలారూపాః పరమాతి రహస్యకాః! ॥* **164**

*పూర్ణా పూర్ణ స్వరూపాయా స్సిద్ధేర్హేతు స్సురేశ్వరి ।*
*సర్వసిద్ధి మయా ఖ్యేతు చక్రేత్వాయుధ భూషితాః ॥* **165**

*స్థితాక్కామేశ్వరీ పూర్వాశ్చ తస్త్రః పీఠదేవతాః ।*

ఇచ్ఛా జ్ఞాన క్రియాశక్తులు, వామజ్యేష్ఠారౌద్రీ శక్తుల, సృష్టి స్థితిలయాలు, పశ్యన్తీ మధ్యమా వైఖరీ వాక్కులు, త్రిమూర్తులు, మాతృమానమేయాలు యొక్క సంక్షిప్త రూపమే త్రికోణము. ఈశక్తులన్నీ బిందువులో ఉన్న పరమేశ్వరి రూపాలు. అందుకనే ఆత్మ సుఖాన్ని కలుగ చేస్తాయి. ఈ శక్తులు ప్రళయకాలాగ్ని లాగా ప్రకాశిస్తూ అతి రహస్య యోగినులుగా

ప్రసిద్ధి చెందాయి. జీవన్ముక్తికి కారణ భూతమైనవి. సర్వసిద్ధి ప్రదచక్రమైన త్రికోణంలో కామగిరి, పూర్ణగిరి జాలంధర పీఠాధిపతులైన మహా కామేశ్వరీ వజ్రేశ్వరి, భగమాని శక్తులను, త్రికోణము మధ్యలో ఓడ్యాణ పీఠాది దేవత మహా త్రిపురసుందరిని ధ్యానించాలి. ఇక్కడ దేవత త్రిపురాంబసిద్ధి ఇచ్ఛాసిద్ధి, సర్వబీజముద్రా శక్తి ఉంటుంది. ఈ దేవతలందరినీ సర్వోపచారాలతోనూ పూజించాలి.

## ఆయుధ ధ్యానము

*ఆయుధాస్త్వతిరక్తాభాః స్వాయుధోజ్జ్వలమస్తకాః ॥* **166**

*వరదాభయ హస్తాశ్చ పూజ్యా వ్రతఫలప్రదాః ।*

*త్వదీయాశ్చ మదీయాశ్చ పుంస్త్రీ వశ్యవిధాయినః ॥* **167**

*త్వగ్ సృగ్ మాంసమే ధోస్థి శుక్లానాం చ మహేశ్వరి ।*

*ద్వితీయ స్వరసంయుక్తా ఏతే బాణాస్త్వ దీయకాః* **168**

కామేశ్వరీ కామేశ్వరుల ఆయుధములు రక్త వర్ణముగలిగి సాధకుని శిరస్సునందు ధరించ గలిగినవై ఉంటాయి. ఈ ఆయుధాలు వరద, అభయ హస్తములు కలిగి ఉంటాయి. అంటే సాధకులకు ఉపాసనా ఫలాన్నిస్తాయి. కామేశ్వరి ఆయుధములు పురుషులను, కామేశ్వరుని ఆయుధాలు స్త్రీలను వశం చేసుకుంటాయి. ఈ బాణాలకు బీజాలు ఈ విధంగా ఉంటాయి.

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| త్వక్ | - | య | అసృక్ | - | రేఫ | మాంసము | - | ల |
| మేధః | - | వ | అస్థి | - | శ | మజ్జా | - | ష |

అర్థము - స (శరీరములోని నీరు)

ఇవన్నీ ద్వితీయ స్వరమైన దీర్ఘముతోనూ, బిందువుతోనూ కలిసి ఉంటాయి. అంటే యాం, రాం, లాం, వాం, శాం, షాం, సాం

## చక్రేశ్వరి రూపము

*వామాదీనాం పురాణాం తు జనస్త్రిపురాంబికా ।*

*పరస్వాతంత్ర్య రూపత్వాదిచ్ఛా సిద్ధిర్మహేశ్వరి ॥* **169**

*ఏతాస్సర్వో పచారేణ పూజయేత్తు వరాననే ।*

వామా, జ్యేష్టా, రౌద్రీ, ఇచ్ఛా జ్ఞానక్రియా శక్తులకు జనని ఎవరో ఆమెయే త్రిపురాంబికా అను ప్రసిద్ధమైన చక్రేశ్వరి. పరమేశ్వరుని యొక్క ఇచ్ఛ వలన చక్రార్చన చేయు సాధకుడికి ఇచ్ఛా సిద్ధి కలుగుతుంది. గతంలో చెప్పిన బాణదేవతలను, త్రికోణ దేవతను సర్వోపచారములతో ఇక్కడ పూజించాలి. ఈ చక్రంలో గల సిద్ధి ఇచ్ఛాసిద్ధి. ముద్రాశక్తి సర్వబీజముద్ర.

## నవమావరణ (బిందువు)

సర్వానందమయే దేవి పరబ్రహ్మాత్మకే పరే ॥ 170

చక్రే సంవిత్తి రూపాచ మహా త్రిపురసుందరీ ।

స్వైరాచారేణ సంపూజ్యా త్వహంతే దంతయోస్సమా ॥ 171

మహాకామ కలారూపా పీఠ విద్యాది సిద్ధిదా ।

మహా ముద్రా మయీదేవీ పూజ్యా పంచదశాత్మికా ॥ 172

తత్ర త్రిథిమయీ నిత్యానవమీ భైరవీ పరా ।

ప్రతి చక్రం సముద్రాస్తు చక్ర సంకేత చోదితాః ॥ 173

సర్వానంద మయమైన బిందు చక్రమునందు మనసులోకి వచ్చే అన్ని ఆలోచనా శక్తులను, వాటి మధ్య ఉండే సంధి కాలాన్నీ ప్రకాశింపచేసే చిద్రూపమైన మహా త్రిపురసుందరి ఉంటుంది. సాధకుడు ఆ యొక్క పరమేశ్వరి స్వరూపాన్ని తెలుసుకున్నట్లైతే జాలంధర, పూర్ణగిరి, కామరూప, పీఠములు యొక్క, శక్తి కామరాజ వాగ్భవ కూటముల యొక్క సిద్ధులు అన్నీ అతడికి ప్రాప్తిస్తాయి. ఈ చక్రంలో దేవి యోని ముద్రతో కూడి ఉంటుంది. పంచ దశాక్షరాలతో కూడి ఉంటుంది. ఆవిడే మహానిత్య; షోడశ కలా స్వరూపిణి, సాదాఖ్య. తొమ్మిదవదైన బిందు చక్రేశ్వరి. ఆమెనే భైరవి అంటారు. భైరవి - సంకరి - తన ధర్మాన్ని తాను నిర్వహించనట్లైతే దండించ గలదు. ఆ భయంతోనే గాలి వీస్తోంది, సూర్య చంద్రులు, అష్టదిక్పాలకులు వారి వారి పనులు సవ్యంగా నెరవేరుస్తున్నారు.

పదహారు అక్షరాలతో ప్రతిపాదించబడిన ఈ దేవి పరరూపమై పరాపర రహస్య యోగినిగా ప్రసిద్ధి చెందింది. పశ్యంత్యాది వాక్కులకు అతీతమైనది. స్వైరాచారముగా పూజింపతగినది. స్వైరాచారము అంటే - స్వేచ్ఛా విహారము. కర్మకాండలను మాని, శివశక్తుల సామరస్యాన్ని పొందటము.

## నిత్యా దేవతల అర్చన

*నిత్యాక్లిన్నాది కాశ్చైవ కామ్య కర్మాను సారతః ।*
*చతురస్త్రాంతరాలేవా త్రికోణే వాయజేత్ సుధీః ॥* 174

వశ్యాది కామ్యకర్మలననుసరించి కామేశ్వరీ, భగమాలినీ మొదలైన పదిహేను నిత్యలను భూపురానికీ - షోడశదళానికీ మధ్య గానీ, త్రికోణము నందుగానీ పూజించవచ్చును. ముందుగా ఆ తిథి నిత్యను పూజించి, తరువాత మిగిలిన నిత్యను పూజించాలి. ఆ తరువాత ఏ కోరికతో ఏ నిత్యను పూజించాలో ఆ నిత్యను పూజించాలి.

కామ్య ప్రయోగము బాగా తెలిసిన వారు మాత్రమే ఈ పని చెయ్యాలి. ఒక్కొక్క నిత్య ఒక్కొక్క రకమైన ఫలితాన్నిస్తుంది.

నిత్యా దేవతల అర్చనలో ఏ దేవతని ముందు పూజించాలి? ఏ వరుస క్రమంలో నిత్యా దేవతలను అర్చించాలి అనే విషయంలో సంప్రదాయ భేదాలనేకమున్నాయి. కాబట్టి సాధకులు గురు సంప్రదాయాన్ని మాత్రమే పాటించగలరు. నిత్యా దేవతల పూజ తంతరాజములో వివరంగా ఇవ్వబడింది.

## శ్రీచక్ర పూజ

*స్త్రైః పితైః లింగనాశి అధూపై రారాధ్య దేవతాః ।*
*చక్ర పూజాం విధాయేత్థం కులదీపం నివేదయేత్ ॥* 175

మకార పంచకముతో దేవిని పూజించి, గంధ ధూప దీపాలతో సర్వోపచారములను సమర్పించాలి. అనంతరము కుల దీపమును నివేదించాలి.

## కుల దీపము

*అంతర్బహిర్భా సమానం స్వ ప్రకాశోజ్వలంప్రియే ।*
*పుష్పాంజలింతతః కృత్వా జపంకుర్యాత్సమాహితః ॥* 176

అధ్యాత్మిక, ఆది దైవిక, ఆది భౌతికము అను ప్రకాశింప చేయునట్టి తన ప్రకాశము చేత ఉజ్వలమైనది. కుల దీపము - తనకన్న వేరు కానిది. కుల దీపము సమర్పించి పుష్పాంజలి నిచ్చి, ఏకాగ్రత పొందిన వాడై పూజలో భాగముగా జపము చెయ్యాలి. జపము మూడు రకాలు . 1. నిగద 2. ఉపాంసు 3. మానస.

*కూటత్రయే మహాదేవి కుండలీ త్రితయేఽపిచ ।*
*చక్రాణాం పూర్వ పూర్వే షాం నాద రూపేణ యోజితాం ॥* 177

*తేషు ప్రాణాగ్ని మాయార్ణ కళాబిందూర్ధ చంద్రికాః ।*
*రోధినీ నాద నాదాంతాః శక్తి వ్యాపిక లాన్వితాః ॥* 178

*సమనా చోన్మనాచేతి ద్వాదశాంతే స్థితాః ప్రియే ।*
*మూలకుండలినీ రూపే మధ్యమే చ తతః పునః ॥* 179

*సృష్ట్యున్మ ఖేచ విశ్వస్య స్థితి రూపే మహేశ్వరి ।*
*కేవలం నాదరూపేణ ఉత్తరోత్తర యోజితం ॥* 180

*శబలాకారకే దేవి తృతీయే ద్వాదశీకళా ।*

ఈ శ్లోకాలలో కూట త్రయము వివరించబడుతోంది. ఓ మహాదేవీ ! మూలాధారము నుండి అనాహతము వరకు వాగ్భవ కూటని.

అనాహతము నుండి - ఆజ్ఞా చక్రము వరకు కామరాజ కూటమి.

ఆజ్ఞా చక్రము నుండి - సహస్రారము వరకు శక్తి కూటమి. వీటిలో పంచదశీ మహామంత్రంలోని ఒక్కొక్క అక్షరము ఒక దానికి పైగా ఇంకొకటి ఉన్నాయి. ఈ మూడు సృష్టి స్థితి సంహారకాలు.

శ్రీచక్రంలోని తొమ్మిది చక్రాలలోనూ

1. భూపురము, షోడశ దళము, అష్ట దళము - సృష్ట్యాత్మకము వీటిలో మళ్ళీ.

   భూపురము - సృష్టి సృష్టి

   షోడశ దళము - సృష్టి స్థితి

   అష్ట దళము - సృష్టి లయ

2. చతుర్ద శారము, దశారములు రెండు - స్థితి రూపము మళ్ళీ వీటిలో.

   చతుర్ద శారము - స్థితి సృష్టి

   బహిర్ద శారము - స్థితి స్థితి

   అంతర్ద శారము - స్థితి లయ

3. అష్ట కోణము, త్రికోణము, బిందువు - సంహార రూపము మళ్ళీ వీటిలో.

| | | |
|---|---|---|
| అష్ట కోణము | - | సంహార సృష్టి |
| త్రికోణము | - | సంహార స్థితి |
| బిందువు | - | సంహార సంహారము |

వీటన్నింటినీ ఐక్యముగా భావించటమే 'సకల' భావన

పంచదశీ మహా మంత్రములో కూటత్రయమున్నది. మూలాధారాది సహస్రారాంతము అగ్ని సూర్య చంద్ర మండలాలున్నాయి. ఒక్కొక్క మండలానికి మంత్రములోని ఒక్కొక్క కూటమి అన్వయింపబడింది. ప్రతికూటమిలోనూ హ్రీంకారమున్నది. హ్రీం కారములోని కామకళా రూపమైన ఈం కారములో అగ్ని సూర్య చంద్ర కుండలినీలను భావించి, బిందువు మొదలైన తొమ్మిదింటిని తొమ్మిది ఆవరణల యందు భావించటమే ఐక్య భావన. ఇది నిష్కల భావన.

కుండలిని మూడు భాగాలలోనూ ఆయా కూటాలకు చెందిన హ్రీంకారములోని కామకళ ఈంకారము నందు మొదట ఐక్యముగా భావించిన అగ్ని సూర్య చంద్ర, కుండలీ త్రయనాదరూపము చేత అంటే బిందువు మొదలైన నాద రూపాలతో నవావరణల యందు ఐక్యత భావించటమే సకల నిష్కల భావన.

సకల నిష్కల నిరూపణకు ముందుగా హ్రీం కారమును వివరిస్తున్నారు.

| | | |
|---|---|---|
| ప్రాణము | - | హకారము |
| అగ్ని | - | రేఫ |
| మాయాబీజము | - | ఈ కారము (కామ కళ) |
| కళ | - | అంటే హార్దకళ హకారము |
| కామ కళ, హార్దకళ | - | రెండూ ఒకటే హ్రీంకారము. |

ఈ రకంగా హ్రీంకారానికి పన్నెండు అవయవాలు చెప్పబడుతున్నాయి. అవి బిందువు మొదలైన నాదాలు తొమ్మిది, హార్దకళ, కామకళ, రేఫ మొత్తం పన్నెండు. ఇంకా వివరంగా చెప్పాలంటే.

| | | |
|---|---|---|
| 1. వ్యోమ - హకారము | 2. అగ్ని - రకారము | 3. ఈకారము |
| 4. బిందువు | 5. అర్థ చంద్రము | 6. రోదిని |

7. నాదము　　8. నాదాంతము　　9. శక్తి

10. వ్యాపికా　　11. సుమన　　12. ఉన్మనీ

సృష్టి సమయంలో ఆధార కుండలిని నుంచి బయలు దేరిన హకార రూపశక్తి అగ్ని కుండలిని యందు ఉత్పన్నమైన బిందువు, నాదము మొదలైన తొమ్మిదింటి చేతా కలిసిన స్థితి రూపంలోనూ, అనాహతం నుండి బయలు దేరిన హకారము సూర్య కుండలిని యందు ఉత్పన్నమైన బిందువు మొదలైన నవనాదాలతోనూ కలుస్తున్నది. ఇప్పుడు మొదటి రెండవ నాదములు కలిసినవై మూడవ కూటమి అయిన సోమఖండంలోని బిందువు మొదలైన నవనాదాలతో లీనమవుతుంది. అలాగే త్రైలోక్య మోహన చక్రము మొదలైనవన్నీ పై చక్రాలలో లీనమవుతున్నాయి. ఇది సకల నిష్కలము.

శిరస్సుకు పది అంగుళాల పైన సహస్రార కమలమున్నది. దానికి రెండంగుళముల పైన వ్యాపించిన బ్రహ్మరంధ్రముందు గల కామకళయే చిత్కళ అని భావించాలి. ఇది నిష్కల భావన.

## భావన

***శూన్యషట్కం తథా దేవి హ్యావస్థా పంచకం పునః ।*** **181**
***విషు వంసప్తరూపం చ భావయన్ మనసాజపేత్ ।***

నెమలి పింఛమందలి చంద్రునితో సమానమైన శూన్య పంచకము, నిరాకారము యొక్క షట్కము, జాగ్రత్ మొదలైన అవస్థా పంచకము, ప్రాణమంత్రాది విషువత్సప్తకము, పూర్వము చెప్పబడిన నవచక్రాలు, ఆత్మకు చెందిన సకలాదులను మనసులోభావిస్తూ జపం చెయ్యాలి.

## శూన్య షట్కము

***అగ్న్యాది ద్వాదశాంతేషు త్రీం స్త్రీన్ త్యక్త్వావరాననే ॥*** **182**
***శూన్యత్రయం విజానీయా ద్దేకైకాంతర తః ప్రియే ।***
***శూన్యత్రయా త్పరేస్థానే మహాశూన్యం విభావం*** **183**

హ్రీం కారములో హ కారము, ర కారము, ఈ కారముయేత్ ॥ ంవు అర్థ చంద్రము, రోదిని, నాదము, నాదాంతము, శక్తి, వ్యాపిక, సుమనా, ఉన్మనీ, మహాబిందువు. ఇవి మొత్తం

పదమూడు. వీ  టిల్ 1, 3, 5, 7 ఈ రకంగా తీసుకున్నట్లైతే వదలి వేసిన రేఫ, బిందువు, రోదిని, నాదాంతము, వ్యాపిక, ఉన్మనిలను శూన్య షట్కము అంటారు. వీటిలో ఆరవది ఉన్మని మహా శూన్యము. ఇది నిరాకారమైనది. శూన్యమైనది. అందుచేత మిగిలిన ఐదు నెమలి పింఛములోని అర్ధ చంద్రాకారము వంటి ఆకారము కలిగి ఉన్నాయని చెప్పబడుచున్నది. వీటిలో మొదటి ఐదింటినీ ధ్యానించి చివరకు మహా శూన్యమును ధ్యానించాలి.

## అవస్థా పంచకము - జాగ్రదావస్థ

*ప్రబోధ కరణ స్యాఽథ జాగరత్వేన భావనం ।*
*వహ్నౌదేవి మహాజాగ్రదవస్థా త్వింద్రియద్వయైః ॥* **184**

ఇంద్రియద్వయైః - అంటే జ్ఞానేంద్రియముల, కర్మేంద్రియముల చేత అని అర్థము. ఈ ఇంద్రియాలు అన్నీ పనిచేస్తూ విషయాలు తెలుసుకుంటూ ఉండటమే జాగ్రదావస్థ. ఈ అవస్థను తృతీయ ఖండమందలి హ్రీంకారములోని రేఫలో భావించాలి. అంటే ఈ అవస్థ ప్రకాశక సాక్షి.

## స్వప్నావస్థ

*అంతరైః కరణై రేవ స్వప్న మాయా వ బోధకః ।*
*గళదేశే సుషుప్తిస్తు లీనపూర్వ స్య వేదనం ॥* **185**

మనోబు  చిత్త అహకారాలు అంతః కరణ చతుష్టయము. వీటివల్ల మాత్రమే జరిగే వ్యవహారము స్వప్నము. స్వప్నము మాయా మాత్రమైనది. ఇది కర చరణముల వల్ల జరగదు. మూడవ హ్రీంకారములోని కామకళా బీజము ఈం గా దీనిని  తెలుసుకోవాలి కాని కంఠ ప్రదేశంలోని రెండవ కూటమిలోని లకారమందుభావించాలి.

## సుషుప్తి

*అంతః కరణ వృత్తీనాం  లయతో విషయశ్య తు*
*పూర్వార్ణానాం విలోమేన భ్రూమధ్యే బిందు సంస్థితా ॥* **186**

అంతఃకరణ వృత్తులను, వాటి విషయములను తన ఆత్మ యందు లీనము చెయ్యటమే సుషుప్తి. సుషుప్తిలో సుఖము తప్ప మరి ఏ ఇతర విషయాలు మనసుకు అంటవు.

కాబట్టి ఏమీ తెలియని విషయమునకు విషయముగు స్థితి సుషుప్తి. సుషుప్తిలో మనకు ఏమీ తెలియదు. అజ్ఞానము వలె ఉంటుంది. ఇది మూడవ హ్రీంకారములోని బిందువు కాని ఆజ్ఞా చక్రమందు భావించాలి.

## తురీయావస్థ

**చైతన్య వ్యక్తి హేతోస్తు నాద రూపస్య వేదనం ।**
**తుస్య రూపం తం చాత్ర వృత్తార్ధా దీస్తు సంగ్రహః ॥** 187

తురీయావస్థలో చైతన్య మున్నదని తెలియటయే తురీయావస్థా స్వరూపము. ఈ అవస్థ అర్ధ చంద్రము. అంటే బిందువు అర్ధ చంద్రము రోదినీ మొదలైన వాటిలోని అర్ధ చంద్రము అని భావించాలి.

## తురీయా తీతము

**తుర్యాతీతం సుఖం స్థానం నాదాంతాది స్థితంప్రియే ।**
**అత్రైవ జప కాలేతు పంచావస్థాస్మరేద్బుధః ॥** 188

నాదములన్నీ లయమై పోయిన తరువాత కేవలము ఏ సుఖమైతే ఉంటుందో, ఆ స్థితి తురీయా తీతము. వాక్కుకు అతీతమైన పరమానంద రూపమే తురీయా తీతము. ఇది శక్తి, వ్యాపికా, ఉన్మనీలందు ఉంటుంది. జపకాలంలో మూడవ కూటమినందే అవస్థా పంచకమును భావించాలి.

## విషవత్సప్తకము - ప్రాణవిషువము

**యోగః ప్రాణాత్మ మనసాం విషువం ప్రాణ సంజ్ఞితః ।**

ప్రాణము, ఆత్మ, మనసుల యొక్క కలయికయే ప్రాణ సంజ్ఞకమైన విషువము. ఈ మూడింటి కలయిక హృదయమందు జరుగుతుంది. కలయిక అట్టి ఐక్య భావన ఇదే ప్రాణ విషువము.

ఇంకొక వాదము ప్రకారము

| | | |
|---|---|---|
| మూలాధారము నుండి | - | హృదయమ్మున వరకు ఒకటి |
| హృదయము నుండి | - | ఆజ్ఞా చక్రమ్ము వరకు రెండవది |
| ఆజ్ఞా చక్రము నుండి | - | సహస్రారము వరకు మూడవది. |

ఈ రకంగా విద్యా పంచదశి మూడు కూటములు కాబట్టి ఆధారమందు ప్రాణ (వాయు) రూపమైన కకారము (కకారాత్తు ప్రభంజనః) ఆత్మ మనసులతో కలిపి - బిందు అర్ధ చంద్రము రోదినీలను దాటి నాద పర్యంతము ఉండే ఐక్యభావనే ప్రాణవిషువము.

## మంత్ర విష ుము

*ఆధారోత్థిత నాదేతు లీనంబుధ్యాత్మ రూపకం ।* *189*

*సంయోగేన వియోగేన మంత్రార్ణా నాం మహేశ్వరి ।*

*అనహతాద్యా ధారాంతం నాదాత్మత్వ విచింతనమ్ ॥* *190*

మూలా ధారము నుండి పుట్టిన శ్రీ విద్యావర్ణములను 'నాద మందు' ఆత్మ రూపంతో లీనమైనట్లుగా భావించి, మంత్ర వర్ణములను వర్ణ శరీరమందు సంయోగము చేయుటచేత అంటే ఆయావర్ణాత్మకత్వము చేత - ప్రతి రెండు వర్ణాలకూ మధ్య ఉండే శుద్ధ నాదరూపముచేత మూలా ధారము నుంచి బ్రహ్మరంధ్ర పర్యంతము భావించటమే మంత్ర విషువము. శుద్ధ నాదము క ఏ వర్ణాలు పలికినప్పుడు ఆ రెండింటికి మధ్య వర్ణము లేని స్థితి ఒకటి ఉంటుంది. అదే శుద్ధనాదము.

ఇక్కడ 'అనాహత' శబ్దముచే మూలాధారము, 'ఆధారాంత' శబ్దముచే బ్రహ్మరంధ్రము సూచించబడుతున్నాయి. సర్వాధారాలకు బ్రహ్మ రంధ్రమే అంతము.

మూలా ధారము నుండి బ్రహ్మ రంధ్రం వరకు మంత్ర వర్ణనాదమును భావించుటే మంత్ర విషువము.

ఆధారమున పుట్టిన నాదాన్ని ఆత్మ రూపంగా భావించి అనాహతము నుండి బ్రహ్మ రంధ్రం వరకూ మంత్రార్ణములను సమిష్టిగా భావించటం చేత, శుద్ధ నాదము అంటే మంత్రార్ణములు లేకుండా భావించటమే మ త్ర విషువము. సంయో వియోగేనా - మనసుకు ఆలోచనలు కలిగినప్పుడు మనసు ంత్రరూపం దాలుస్తుంది. ాగ ఆలోచనపోయి ఇంకొక ఆలోచన వస్తే మనసు రెండవ రూపు పొందుతుంది. అయితే ఈ మార్పుకు మ మనస్సు యొక్క చిద్రూపము ప్రకాశిస్తుంది. ఇది ఎలాగంటే మాలలో పూసలుంటాంధ్యా పూసకూ పూసకూ మధ్య దారం ఉంటుంది. అదే పద్ధతిలో వృత్తుల మధ్యన రూపముంటుంది.

మూలా ధారంలో బయలుదేరిన నాదము షట్చక్రాలలోని అక్షరాచిద్ర డా పోతుంది. అయితే అక్షరము నాదము యొక్క పరిణామమే కాబట్టి నాదము వ గుం ఈ రకంగా

నాదము మంత్ర వర్ణములతో కలిసి మూలలోని పూసలాగా, పూసకూ పూసకూ మధ్య దారంలాగా ఉండటాన్నే సంయోగ వియోగముంటారు.

## నాడీ విషువము

***విషువం నాదసం స్పర్శాన్నాడీ విషువ ముచ్యతే ।***
***ద్వాదశ గ్రంధి భేదేన వర్ణాన్నాద్యంత రేప్రియే ॥*** **191**

మంత్రములో మూడు ఖండాలున్నాయి. వీటి చివర ఉన్న హ్రీంకారములలో కామకళా బీజమైన ఈం ఉన్నది. ఈ కామకళా బీజములలోని నాదము ఆధార చక్రము నుంచి షట్చక్రాలకు రెండు వైపులా ఉన్న గ్రంధులను ఛేదించుకుంటూ సుషుమ ాడిల ్రవేశించి బ్రహ్మ రంధ్రం దాకా వ్యాపించినట్లు భావించటాన్నే నాడీ విషువము అన్నారు. ప్ర

ప్రథమ కూటమి చివరనున్న కామకళా నాదము ద్వాదమశ గ్రంధి భేదము చేసి సుషుమ్నలో ప్రవేశించటమే నాడీ విషువము.

## ప్రశాంత విషువము

***నాద యోగః ప్రశాంతం తు ప్రశాంతేంద్రియ గోచరం ।***
***వహ్నీం మాయాం కలాంచైవ చేతనామర్ధ చంద్రకం ॥*** **192**
***రో నాదనాదాంతాన్ శక్తౌ లీనా న్విభావయేత్ ।***

మూలాధారమందు పుట్టిన నాదము 'శక్తి' యందు లయమవుతున్నది. ఇదే నాద యోగము. 'శక్తి' ప్రశాంతమైన స్థానము. నాదము ప్రశాంతమైన స్థానములో లీనమవుతోంది కాబట్టి దీన్ని ప్రశాంత విషువము అంటారు. ఇది నియమిత ఇంద్రియాలకు మాత్రమే గోచరమువుతుంది.

## శక్తి విషువము

***విషువం శక్తి సంజ్ఞంతు తదూర్ధ్వం నాద చింతనమ్ ॥*** **193**

పైన చెప్పి ్నగా 'శక్తి' యందు లయమైన నాదము తిరిగి ఉజ్జీవము పొంది, దాని తరువాత ఉన్నవ్యాపిక'ను దాటి సుమన యందులయమైనదిగా భావించటాన్నే శక్తి విషువము అంటారు.

## పరమానందస్థితి

**పరం స్థానం మహాదేవి నిసర్గానంగ సుందరం ॥** 195

ఓ మహాదేవి ! షట్చక్రాలలోనూ శూన్యషట్క, అవస్థా పం . సప్త విషువములకు అతీతమైన విశ్వ విశ్రాంతి స్థానము స్వాభావికమైన పరమానంద:చక్రనే సుందరమైనది. ఆ ఆనందము అనుభవించాల్సిందే కాని చెప్పటానికి వీలుకాదు. యోగులు, సాధకులు అందరూ దీన్ని అనుభవించవచ్చును.

## ఫలితము

**ఏవంచింతయ మానస్య జపకాలేషు పార్వతి ।**
**సిద్ధయ స్సకలాస్పూర్ణం సిధ్యంతి త్వత్ప్రసాదతః ॥** 196

జపం చేసేటప్పుడు పైన వివరించిన షట్చక్ర, శూన్యాలను భావిస్తూ జపం గనక చేసినట్లై ఆ పరమేశ్వరి అనుగ్రహం లభించి సకలార్థాలు ఈడేరతాయి.

తే,

## తర్పణ

**ఏవం కృత్వా జపందేవ్యా వామహస్తే నివేదయేత్ ।**
**అనామాంగుష్టయోగేన తర్పయే చ్చక్రదేవతాః ॥** 197

ఈ రకంగా జపం చేసి ఆ జపాన్ని 'గుహ్యాతి గుహ్య' అనే మంత్రముతో పరమేశ్వరి ఎడమచేతిలో సమర్పించాలి. సాధకుడు అనామిక, అంగుష్టములు కలిపి (తత్వముద్ర చక్ర దేవతలకు తర్పణ చెయ్యాలి. అంగుష్టము - శివుడు. అనామిక శక్తి కాబట్టి ఆరెండు వ్రేళ్ళు కలిపితే శివశక్తుల సామరస్యము ఏర్పడుతుంది.

## ఉప సంహారము

**మద్యం మాంసం తథామత్స్యం దేవ్యాస్తు వినివేదయ ।**
**కౌలాచార సమాయుక్తై ర్వీ రైస్తు సహపూజయేత్ ॥ యేత్** 198

పూజానంతరము పరమేశ్వరికి మకారత్రయము నివేదన చెయ్యాలి. కౌళాచారము బాగా తె న 'వీరులైన' వారితో కలిసి శ్రీచక్రపూజ చెయ్యాలి. కులార్ణ వతంత్రంలో శ్రీ చక్రాన్ని లిసిడుగా కాక సమూహంగా భావించాలని చెప్పబడింది. అందుచేత వీరులైన వారితో అంటే మంచి ఉపాసకులతో కలిసి పూజించాలి.

## నైమిత్తిక పూజ

***పుష్యభేన తువారేచ సౌరేచ పరమేశ్వరి ।***
***గుర్వోర్దినే స్వనక్షత్రే చతుర్దశ్యష్టమీ షుచ ॥*** **199**
***చక్ర పూజాం విశేషేణ యోగినీనాం సమాచరేత్ ।***

నిత్య పూజను నిష్ఠతో చేసే వారికి మాత్రమే నైమిత్తికార్చన యందు అధికారమున్నది. పుష్యమీ నక్షతమున, ఆదివారము, గురు అంటే - గురువుల జన్మ దినమందు, సాధకుని జన్మ నక్షత్రమున, చతుర్దశి, అష్టమి తిధుల యందు నైమిత్తి కార్చన చెయ్యాలి. యోగులు, యోగినిలు, వీరులతో కలిసి విశేష ద్రవ్యాలతో శ్రీ చక్రపూజ చెయ్యాలి. పూజలో చెప్పిన ద్రవ్యాలు మాత్రమే వాడాలి. అంతే కాని పర్యాయములు వాడరాదు.

## యోగినుల సంఖ్య

***చతుః షష్టి యుతాః కోట్యో యోగినీనాం మహౌజసామ్ ॥*** **200**
***చక్రమేతత్ సమాశ్రిత్య సంస్థితా వీరవందితే ।***

వీరుల చేత నమస్కరింపబడు ఓ దేవి! శ్రీ చక్రంలోని ప్రతి ఆవరణలోనూ మహా తేజస్సుతో కూడిన యోగినులు అరవై నాలుగు కోట్ల మంది ఉన్నారు. ఈ రకంగా తొమ్మిది ఆవరణలలోనూ అసంఖ్యాకమైన యోగినులున్నారు.

## అష్టాష్టకము

***అష్టాష్టకంతు కర్తవ్యం విత్త శాఠ్య వివర్జితం ॥*** **201**
***త్వమేవతా సాం రూపేణ క్రీడశే విశ్వ మోహినీ ।***

**అష్టాష్టకము:** ఎనిమిది మంది దంపతులను వయస్సుల వారీగా కూర్చుండబెట్టి, వారికి ప్రసాదము ఇవ్వాలి. ఈ దంపతులు ఏ సంప్రదాయానికి సంబంధించిన వారైనా ఫరవా లేదు.

భైరవులు ఎనిమిది మంది. బ్రాహ్మి మొదలైన యోగినులు ఎనిమిది మంది.

1. అసితాంగ భైరవ - బ్రాహ్మి
2. ఋఋ భైరవ- మహేశ్వరి
3. చండ భైరవ - కౌమారి
4. క్రోధ భైరవ - వైష్ణవి

5. ఉన్మత్త భైరవ - వారాహి 6. కపాల భైరవ - మాహేంద్రి

7. భీషణ భైరవ - చాముండా 8. సంహార భైరవ - మహాలక్ష్మి

వీరినే అష్ట మిధునములు అంటారు.

వీరి పూజకు లార్ధవ తంత్రములో చెప్పిన విధంగా పూర్తి చెయ్యాలి.

శ్రీ చక్రములోని భూపురము దగ్గర నుంచి త్రికోణము వరకు ఎనిమిది ఆవరణలలోనూ అష్టమిధునముల యొక్క అంశలను పూజించాలి. అంటే భూపురంలోని ఎనిమిది దిక్కుల యందు అసితాంగ భైరవ, బ్రాహ్మి యోగినిల యొక్క అంశలను పూజించాలి. ఈ రకంగా ప్రతి ఆవరణలోనూ పూజ జరగాలి. ఈ పూజను ప్రాదక్షిణ్యంగానే చెయ్యాలి.

**అష్టాష్ట కార్చన :**

***సంకల్పం :*** *శ్రీ దేవ్యా బహిర్యాగస్య మహా యాగత్వ సిద్యర్థం అష్టాష్టకార్చనం కరిష్యే॥*

**ధ్యానం :**

*మహా కామేశ్వరి శివే యోగినీ వీరవందితే ।*
*అష్టాష్టకార్చనం కర్తు మను జ్ఞాం దేహి సుందరి ॥*

**ప్రథమాష్టకము:**

*ప్రయాగక్షేత్రే వేసినీ పుర్యాం కామరూప పీఠే*
*వట : ! పద్మముద్రాయాం వ్యోమ మండ లేమేరు*
*సంతాన వృక్షే ...క్ష్యాం అంక్షాం మంగళాంబాయై నమః*
*మంగళ నాథాయ నమః । బ్రహ్మాణ్యై నమః ।*
*అసితాంగ భైరవాయ నమః ।*

ఇప్పుడు ప్రథమ ఆవరణలోని ఎనిమిది దిక్కుల యందు పూజ ఈ విధంగా ఉంటుంది.

1. క్షంక్షాం అక్షభ్యాం నమః ।
   క్ష క్షాం అక్షం బా పాదుకాం పూజయామి తర్పయామి నమః
2. క్షిం క్షీం ఋక్ష కర్ణాభ్యా నమః
   క్షిం క్షీం ఋక్ష కర్ణాంబా క్ష క్షాం పూజయామి తర్పయామి నమః

3. క్షుక్షూ రాక్షసాభ్యాం నమః ।
క్షుం క్షూం రాక్షసాంబా పూజయామి తర్పయామి నమః
4. క్షృం క్షౄం క్ష పణాభ్యాం నమః
క్షృం క్షౄం క్ష పణాంబా పూజయామి తర్పయామి నమః
5. క్షఌం క్షౡం క్ష పాభ్యాం నమః ।
క్షఌం క్షౡం క్ష పాంబా పూజయామి తర్పయామి నమః
6. క్షేం క్షైం పింగళాక్షీ భ్యాం నమః ।
క్షేం క్షైం పింగళాక్ష్యంబా పూజయామి తర్పయామి నమః
7. క్షోం క్షౌం అక్ష పయా భ్యాం నమః ।
క్షోం క్షౌం అక్ష పయాంబా పూజయామి తర్పయామి నమః
8. క్షం క్షః క్ష మాభ్యాం నమః ।
క్షం క్షః క్షమాంబా పూజయామి తర్పయామి నమః

**ద్వితీయాష్టకం :**

***వారణాసీ క్షేత్రే శౌణ్డినీ పుర్వాం మలయగిరి***
***పీఠే శ్లేష్మాతక వృక్షే లింగ ముద్రా యాం వాయు***
***మండలే మహేంద్రా వల్యాం ఈం లాం చర్చికాం***
***బా నమః । ఇం లం చర్చి కానాథాయ నమః ।***
***మహేశ్వర్యైనమః । ఋ ఋ భైరవాయ నమః ।***

ఇప్పుడు ద్వితీయావరణలోని ఎనిమిది దిక్కులయందు పూజ.

1. లం లాం లీలాభ్యాం నమః । లం లాం లీలాంబాయై శ్రీపాదుకాం పూజయామి తర్పయామి నమః
2. లిం లీం లోలాభ్యాం నమః । లిం లీం లోలాంబా శ్రీపాదుకాం పూజయామి తర్పయామి నమః
3. లుం లూం లుత్థా భ్యాం నమః । లుం లూం లు త్థాంబా శ్రీపాదుకాం పూజయామి తర్పయామి నమః

4. ళ్ళం ళ్ళాం ళుబ్ధా భ్యాం నమః । ళ్ళం ళ్ళాం ళుబ్ధాంబా శ్రీపాదుకాం పూజయామి తర్పయామి నమః

5. ఌం ౡం లూకా భ్యాం నమః । ఌం ౡం లూకాంబా శ్రీపాదుకాం పూజయామి తర్పయామి నమః

6. లేం లైం లంకేశ్వరాభ్యాం నమః లేం లైం లంకేశ్వరాంబా శ్రీపాదుకాం పూజయామి తర్పయామి నమః

7. లోం లౌం లోలసాభ్యాం నమః॥ లోం లౌం లోలసాంబా శ్రీపాదుకాం పూజయామి తర్పయామి నమః

8. లం లః విమలాభ్యాం నమః । లం లః విమలాంబా శ్రీ పాదుకాం పూజయామి తర్పయామి నమః

**తృతీయాష్టకం :**

కైలాస పురీక్షేత్రే కైవర్తనీ పుర్యాం పూర్ణగిరి పీఠే ఉడంబర వృక్షే సురభి ముద్రాయాం వహ్నిమండలే చంద్ర శిలా తలావల్యాం ఊం హాం యోగీశాంబాయై నమః । ఉం హం యోగీశ నాధాయ నమః । ఉం హాం కౌమార్యై నమః । ఉం హుం చండ భైరవాయ నమః ।

తృతీయా వరణలోని ఎని: దిక్కుల యందు పూజ

1. హం హాం హు తాశనాభ్యాం నమిదిహం హాం హుతాశనాంబా శ్రీ పాదుకాంపూజయామి తర్పయామి నమః

2. హిం హీం విశాలాక్షీభ్యా నమః । హిం హీం విశాలాక్ష్యాంబా శ్రీ పాదుకాంపూజయామి తర్పయామి నమః

3. హుం హూం బడబాము ఖీభ్యాం నమః ॥ హుం హూం బడబాముఖ్యంబా శ్రీ పాదుకాంపూజయామి తర్పయామి నమః

4. హ్యాం హ్యాం హర్షా భ్యాం నమః । హ్యాం హ్యాం హర్షాంబా శ్రీ పాదుకాంపూజయామి తర్పయామి నమః

5. హ్లాం హ్లాం హరయా భ్యాం నమః । హ్లాం హ్లాం హరయాంబా శ్రీ పాదుకాంపూజయామి తర్పయామి నమః

6. హేం హైం మహాక్రోధాభ్యాం నమః। హేం హైం క్రోధిన్యంబా శ్రీ పాదుకాంపూజయామి తర్పయామి నమః

7. హోం హౌం క్రోధినీ భ్యాం నమః। హోం హౌం క్రోధిన్యంబా శ్రీ పాదుకాంపూజయామి తర్పయామి నమః

8. హం హః స్వరయాభ్యాం నమః। హం హః స్వరయాంబా శ్రీ పాదుకాంపూజయామి తర్పయామి నమః

**చతుర్థాష్టకం :**

అట్టహాసక్షేత్రే కుటినీ పుర్యాం కులాంతక పీఠే అశ్వత్థ వృక్షే క్షోభిణీ ముద్రాయాం సలిల మండలే శాంబర భేదావల్యాం ఝూం సాం హర సిద్ధాంబాయై నమః। ఝుం సం హరసిద్ధ సాధాయ నమః। ఝూం సాం వైష్ణవ్యం బాయై నమః। ఝుం సం క్రోధ భైరవా య నమః॥

నాల్గవ ఆవరణలోని ఎనిమిది దిక్కుల యందు పూజ :

1. సంసాం సంఖ్యా పీఠ సిద్ధాభ్యాం నమః। సంసాం సంఖ్యా పీఠ శ్రీ పాదుకాం పూజయామి తర్పయామి నమః

2. సిం సీం తరలాభ్యాం నమః। సిం సీం తరలాంబా శ్రీ పాదుకాం పూజయామి తర్పయామి నమః

3. సుం సూం తారా భ్యాం నమః। సుం సూం తారాంబా శ్రీ పాదుకాం పూజయామి తర్పయామి నమః

4. సృం సౄం హృష్టా భ్యాం నమః। సృం సౄం హృష్టాంబా శ్రీ పాదుకాం పూజయామి తర్పయామి నమః

5. స్లం స్లం హృల్లేఖా భ్యాం నమః। స్లం స్లం హృల్లే ఖాంబా శ్రీ పాదుకాం పూజయామి తర్పయామి నమః

6. సేం సైం దశకం దరాభ్యాం నమః। సేం సైం దశకందరాంబా శ్రీ పాదుకాం పూజయామి తర్పయామి నమః

7. సోం సౌం సరసా భ్యాం నమః। సోం సౌం సరసాంబా శ్రీ పాదుకాం పూజయామి తర్పయామి నమః

8. సం సః రస సంగ్రాహిణీ భ్యాం నమః। సం సః రస సంగ్రా హిణ్యాంబా శ్రీ పాదుకాం పూజయామి తర్పయామి నమః

**పంచమాష్టకం :**

జయంతి కాక్షేత్రే గండకీ పుర్యాం చౌహార పీఠే విభీతక వృక్షే ద్రావిణీ ముద్రాయాం పృథివీమండలే అంబరయోగా వల్యాం లూం షాం భద్రాంబాయై నమః లుంషం భద్ర నాధాయ నమః । లూంషాం వారా హ్యై నమః లుంషం ఉన్మత్త భైరవాయ నమః ।

పంచమా వరణలోని ఎనిమిది దిక్కుల యందు పూజ.

1. షం షాం తాల జంఘాభ్యాం నమః। షం షాం తాల జం ఘాంబా శ్రీ పాదుకాంపూజయామి తర్పయామి నమః
2. షిం షీం రక్తాక్షీభ్యాం నమః । షిం షీం రక్తాక్ష్యంబా శ్రీ పాదుకాంపూజయామి తర్పయామి నమః
3. షుం షూం విద్యుజ్జిహ్వా భ్యాం నమః । షుం షూం విద్యుజ్జిహ్వాంబా శ్రీ పాదుకాంపూజయామి తర్పయామి నమః
4. షృం షౄం కరాంకా భ్యాం నమః। షృం షౄం కరం కాంబా శ్రీ పాదుకాంపూజయామి తర్పయామి నమః
5. షం షం మేఘనాదాభ్యాం నమః। షం షం మేఘనాధాంబా శ్రీ పాదుకాంపూజయామి తర్పయామి నమః
6. షేం షైం ప్రచండా ఝూభ్యాం నమః । షేం షైం ప్రచండా ఘాంబా శ్రీ పాదుకాంపూజయామి తర్పయామి నమః
7. షోం షౌం కాల కర్ణాభ్యాం నమః। షోం షః కాల కర్ణాంబా శ్రీ పాదుకాంపూజయామి తర్పయామి నమః
8. షం షః బల ప్రదాభ్యా నమః। షం షం బల ప్రదాంబా శ్రీ పాదు! కాం పూజయామి తర్పయామి నమః

**షష్ఠాష్టకం :**

చారిత్ర క్షేత్రే రజనీ పుర్వాం జాలం ధర పీఠే నింబ వృక్షే అంకుశముద్రాయాం అగ్ని మండలే కులిశ భేదావల్యాం ఐం శాం కిలికిలాంబాయై నమః। ఐం శం కిలికిలి నాధాయ నమః । ఐం శాం ఇంద్రాణ్యై । ఐం శం కపాల భైరవాయ నమః ।

షష్టావరణలోని ఎనిమిది దిక్కుల యందు పూజ.

1. శం శాం శం పాభ్యాం నమః శం శాం శం పాంబా శ్రీ పాదుకాంపూజయామి తర్పయామి నమః
2. శిం శీం చంపావళీభ్యాం నమః। శిం శీం ప్రవాయాంబా శ్రీ పాదుకాంపూజయామి తర్పయామి నమః
3. శుం శూం ప్రవాయాభ్యాం నమః। శుం శూం ప్రవాయాంబా శ్రీ పాదుకాంపూజయామి తర్పయామి నమః
4. శృం శౄం శూలసాది కాభ్యాం నమః । శృం శౄం శూల సాదికాంబా శ్రీ పాదుకాంపూజయామి తర్పయామి నమః
5. శౢం శౣం పిచు వక్త్రాభ్యాం నమః। శౢం శౣం పిచువక్త్రాంబా శ్రీ పాదుకాంపూజయామి తర్పయామి నమః
6. శేం శైం పిశాచాక్షీ భ్యాం నమః । శేం శైం పిశాచాక్షాంబా శ్రీ పాదుకాంపూజయామి తర్పయామి నమః
7. శోం శౌం పిశితా జ్ఞానాభ్యాంస నమః । శోం శౌం పిశితాజ్ఞానాంబా శ్రీ పాదుకాంపూజయామి తర్పయామి నమః
8. శం శః లోలుపాభ్యాం నమః । శం శః లోలుపాంబా శ్రీ పాదుకాంపూజయామి తర్పయామి నమః

**సప్తమాష్టకం :**

ఏకామ్ర ; కే శిల్పినీ పుర్వాం ఉడ్యాణ పీఠే కరంజ వృక్షే లేలిహానముద్రాయాం వ్యాపికా మండలే రక్త వర్ణక్షేత్ర్యాం ఔం వాం కాల రాత్యంబాయై నమః। ఓం వం కాల రాత్రి నాథాయ నమః । ఓం వాం చాముండాయై నమః। ఓం వం భీషణ భైరవాయ నమః

సప్తమా వరణలోని ఎనిమిది దిక్కుల యందు పూజ.

1. వం వాం వామనా సాభ్యాం నమః । వం వాం వామనాసాంబా శ్రీ పాదుకాం పూజయామి తర్పయామి నమః
2. విం వీం వాన రాభ్యాం నమః। విం వీం వానరాంబా శ్రీ పాదుకాంపూజయామి తర్పయామి నమః

3. వుం వూం వాసనాభ్యాం నమః। వుం వూం వాసనాంబా శ్రీ పాదుకాంపూజయామి తర్పయామి నమః

4. వృం వౄం వికటాసాభ్యాం నమః। వృం వౄం వికటాసాంబా శ్రీ పాదుకాంపూజయామి తర్పయామి నమః

5. వౢం వౣం వాయు వేగా భ్యాం నమః। వౢం వౣం వాయు వేగాంబా శ్రీ పాదుకాంపూజయామి తర్పయామి నమః

6. వేం వైం బృహత్క లాభ్యాం నమః। వేం వైం బృహత్కలాంబా శ్రీ పాదుకాంపూజయామి తర్పయామి నమః

7. వోం వౌం వికనా భ్యాం నమః। వోం వౌం వికనాంబా శ్రీ పాదుకాంపూజయామి తర్పయామి నమః

8. వం వః విశ్వరూపిణీ భ్యాం నమః। వం వః విశ్వరూపిణ్యాంబా శ్రీ పాదుకాంపూజయామి తర్పయామి నమః

**అష్టమాష్టకం :**

దేవకోట క్షేత్రే సటీ నాపుర్వాం దేవీకోట పీఠే కదంబ వృక్షే ఖేకి ముద్రాయం శివమండలే లంపటా వల్యాం అః యాం విభీష కాంబాయై నమః। అం యం విభీష నాథాయనమః। అం యాం మహాలక్ష్మ్యై నమః। అం యం సంహార భైరవాయ నమః

అష్టమా వరణలోని ఎనిమిది దిక్కుల యందు పూజ.

1. యం యాం యమ జిహ్వా భ్యాం నమః। యం యాం యమ జిహ్వాంబా శ్రీ పాదుకాం పూజయామి తర్పయామి నమః

2. యిం యీం జయంతీభ్యాం నమః। యిం యీం జయ బా శ్రీ పాదుకాం పూజయామి తర్పయామి నమః న్త్యం

3. యుం యూం దుర్జయాభ్యాం నమః। యుం యూం దుర్జయాంబా శ్రీ పాదుకాం పూజయామి తర్పయామి నమః

4. య్రుం య్రూం యమాంత కాభ్యాం నమః। య్రుం య్రూం యమాంత కాంబా శ్రీ పాదుకాం పూజయామి తర్పయామి నమః

5. య్రం య్రుం ఓడాలాభ్యాం నమః। య్రం య్రుం ఓడాలాంబా శ్రీ పాదుకాం పూజయామి తర్పయామి నమః

6. యేం యైం రేవతీభ్యాం నమః। యేం యైం రేవత్యంబా శ్రీ పాదుకాం పూజయామి తర్పయామి నమః

7. యోం యౌం పూతనాభ్యాం నమః । యోం యౌం పూతనాంబా శ్రీ పాదుకాం పూజయామి తర్పయామి నమః

8. యం యః విజయా భ్యాం నమః। యం యః విజయాంబా శ్రీ పాదుకాం పూజయామి తర్పయామి నమః

పైన చెప్పిన బ్రాహ్మీ మొదలైన ఎనిమిది మంది యోగినులు. వీరిలో ఒకొక్కరికీ వీరి అంశతో ఎనిమిది మంది యోగినులున్నారు. ఈ రకంగా వీరంతా అరవైనాలుగు మంది అవుతారు. వీరే చతుషష్టి యోగినులు జబల్పూర్‌లోనూ, ఒరిస్సాలోని హీరాపూర్‌లోనూ చతు షష్టి యోగినుల స్వరూపాలే. ఈ రకంగా అరవైనాలుగు కోట్ల మంది అవుతారు. వీరే చతుషష్టియోగినులు. జబల్పూర్‌లోనూ, ఒరిస్సాలోని హీరాపూర్‌లోనూ, చతుషష్టియోగినుల ఆలయాలున్నాయి.

వీరిలో ఒక్కొక్కరికీ కోటి మంది పరిచారికలున్నారు. వీరందరూ యోగినుల స్వరూపాలే. ఈ రకంగా అరవై నాలుగు కోట్ల మంది యోగినులు పరమేశ్వరిని సేవిస్తూ, ఆమెను ఆరాధించే సాధకుల కోర్కెలు తీరుస్తూ ఉంటారు.

## గురుపూజ

*అజ్ఞాత్వాతుకులాచారమ యస్త్వా గురు పాదుకామ్ ॥* **202**

*యోఽస్మిన్ శాస్త్రే ప్రవర్త్తేత తం త్వం పీడయ సి ధృ ॥*

ఓ దేవీ। కులార్ణవము, పరశురామ కల్పము మొదలైన గ్రంధాలు వంటకుండా, గురు పాదుకలను అర్చించకుండా గురు ప్రసాదము స్వీకరించకుండా కేవలం పుస్తకాలు చదివి ఈ శాస్త్రాన్ని ఎవరు ఆచరిస్తారో వారికి కష్టాలు, రోగాలు కలిసి రావు. ఇందులో అనుమానము లేదు.

అంటే గురూపదేశం లేకుండా ఈ పూజ చేయరాదు అని భావన. గురువు సాక్షాత్తూ పరమేశ్వర స్వరూపుడు కాబట్టి, గురుపూజ లేకుండా చక్రార్చన చేయరాదు.

## దేవీ ధ్యానము

ఏవం జ్ఞాత్వా వరారోహే కౌళాచార పరస్సదా ॥ 203

అవయోశ్శ బలాకారం మద్యం తత్ర నివేద్య చ ।

త్వత్ప్రధా ప్రసరాకారా స్త్వామేవ పరిభావయేత్ ॥ 204

సాధకుల కోర్కెలు తీర్చు ఓ పరమేశ్వరీ। ఈ రకంగా పూజా సంకేతము తెలుసుకొని, తంత్రాలలో చెప్పిన ప్రకారము నిత్యమూ పూజచేసినట్లైతే కౌళాచార పరుడగును. నిత్యపూజలో లోపము చేయకూడదు.

శివశక్తు లిద్దరినీ ఒకే రూపంగా భావించాలి. మొదటి రెండు మకారాలను ఆవరణ దేవతలకు నివేదించాలి.

## ఉద్వాసన

త్వామిచ్ఛా విగ్రహాం దేవీం గురురూపాం విభావయేత్ ।

త్వన్మయస్య గురోః శేషం నివేద్యాత్మని యోజయేత్ ॥ 205

ఆ పరదేవతను బ్రహ్మ రంధ్రంలో గల గురువుగా భావించాలి. ఆ తరువాత విశేషార్ఘ్య పాత్రలో మిగిలిన జలాన్ని అక్కడే ఉంటే గురువుకు, లేకపోతే బ్రహ్మరంధ్రములోని గురువుకు నివేదించి, మిగిలిన దానిని సాధకుడు తీసుకోవాలి. తరువాత పరదేవతను సాధకుడు తన హృదయాకాశ మందు స్వీకరించాలి. ఇదే ఉద్వాసన

## బలి

యోగినీ నాం మహాదేవి బటుకాయా[illegible] రూపిణే

క్షేత్రాణాం పతయే మహ్యం బలింకుర్వీత హేతునా ॥ 206

మాతృమానమేయ మరీ చికలైన యోగినులకు ఆత్మరూపి, పరమానంద స్వరూపి అయిన వటుకునికి, క్షేత్రపతికి, జీవాత్మకు, సాధడికి రెండవ దానితో కూడిన మొదటి మకారాన్ని బలిగా ఇవ్వాలి.

ఎక్కడైతే మనసుకు సంతుష్టి కలుగుతుందో అక్కడే మనసును ధృడంగా ఉంచాలి. అక్కడే పరానంద స్వరూపము ప్రకాశిస్తుంది. ఎక్కడ మనసు నిలుస్తుందో అదే శాస్త్ర

విహితము. ఎక్కడ మనసు నిలువదో అది శాస్త్రనిషిద్ధము. అని అమృతానందుల వారు చెబుతున్నారు.

పాఠ క్రమముకన్న అర్థ క్రమము బలమైనది. కాబట్టి సాధకుడు తన మనసుకు నచ్చిన అర్థం ప్రకారము బలి సమర్పణ చెయ్యాలి.

## వీర ఆచారము

*నిత్యం పిబన్వమన్ ఖాదన్ స్వేచ్ఛా చార పరస్స్వయం ।*
*అహంతే దంత యోరైక్యం భావయన్ విహరేత్సుఖం ॥* **207**

ప్రథమ ద్వితీయ తృతీయాలు తిని, మధ్యలో కక్కుతూ మకార సేవాతత్పరుడై ఉండాలి. ఈ జగత్తుకూ తనకూ ఐక్యమున్నదనే భావనతోనే సాధకుడుండాలి. ఆ విధంగా పరమానందము పొంది సుఖైక రూపికావాలి. అహంతా భావము జ్ఞాతృ ధర్మము. ఇదంతా జ్ఞేయ ధర్మము. ఈ రెండింటి సామరస్యమే జ్ఞానము. జ్ఞానమే తానని భావించి సుఖంగా విహరించే సాధకుడు పరిపూర్ణ జ్ఞానానందుడవు తున్నాడు.

## గ్రంథోప సంహారము

*ఏతత్తే కథితం సర్వం సంకేత త్రయ ముత్తమమ్ ।*
*గోప నీయం ప్రయత్నేన స్వ గుహ్యా మివ సువ్రతే ॥* **208**

ఓ సువ్రతురాలా । ఈ విధంగా దివ్యమైన స్వాత్మావ భోదకమైన, ఉత్తమమైన, అంతరమును అనుసంధానము చేయు మూడు సంకేతాలనూ నీకు వివరించాను. వీటిని ఇతర సంప్రదాయకుల నుండి కాపాడవలసినది. పతివ్రతలు ప్రాణ పరిత్యాగ పరిస్థితిలో కూడా మాన సంరక్షణ ఏ విధంగా చేసుకుంటారో, అదే విధంగా దీనిని రక్షించ వలసినది.

## అనధికారులు

*చుంబకే జ్ఞానలు బ్ధే చ న ప్రకాశ్యం త్వయానఘే ।*
*అన్యాయే న దాతవ్యం నాస్తికానాం మహేశ్వరి ॥* **209**

శ్రీ విద్యా మంత్రాన్ని జపిస్తూ, దానికి సంబంధించిన అనుష్టాన నిష్ఠలలో నాస్తికుడైన వాడు చుంబకుడనబడును. కావ్య, శాస్త్రములందు పొందిన సాధారణ జ్ఞానము చేత శ్రీ విద్య

పాండిత్యము పొంది గోరిన వాడు ఆచరణ రహితుడు, జ్ఞాన లబ్ధుడు. వీరు ఈ విషయాలు తెలుసుకోటానికి అనధికారులు. ఇతర విషయాలలో యోగ్యత ఉన్నప్పటికీ, గూరుపదేశము దీక్ష, నియమాలు ఉల్లంఘించిన వాడుకూడా అనధికారులే. పరలోకాలు లేవనేవారు కూడా అనధికారులే. వారికి ఈ విషయం చెప్పకూడదు.

## గురు స్మరణ

**ఏవం త్వయాऽహ మాజ్ఞప్తో మదిచ్ఛా రూపయా ప్రభో ।**

గ్రంథాంతంలో భైరవి, భైరవునకు నమస్కరించి అంటోంది. ఓ ప్రభూ । నా ఇచ్ఛారూపమైననీ చేత ఆజ్ఞాపించబడినాను. ఈ జగత్తు మొత్తంలో మనమిద్దరమే ఉన్నాము. కాబట్టే మన యందు గురు శిష్యభావము పరస్పరము కలిగినది. నేను నీకు గురువు నీవు నాకు గురువు. (కొన్ని తంత్ర శాస్త్రాలు శివుడు చెప్పినట్లు, మరికొన్ని శక్తి చెప్పినట్లు ఉన్నాయి. అందుచేతనే శివశక్తులిరువురికీ గురుత్వము చెప్పబడింది. అందుచేత నేను నీకు స్కరిస్తున్నాను.

## సంకేత త్రయ జ్ఞాన ఫలము

***సంకేతం యోవి జానాతి యోగినీనాం భవేత్ప్రియం ॥*** *210*

***సర్వేప్సిత ఫలావాప్తిః సర్వకామ ఫలాశ్రయః ।***
***యతోऽపి దృశ్యతే దేవి కథం విద్వాన్న చింతయేత్ ॥*** **211**

చక్ర సంకేతము, మంత్ర సంకేతము, పూజా సంకేతము అను ఈ మూడు ఎవడు ర్తిగా తెలుసుకుంటాడో, వాడు యోగినల దయకు పాత్రుడవుతాడు. సంకేతత్రయజ్ఞానము లన సర్వా భీష్టాలూ నెరవేరతాయి. సర్వ కామ్యాలూ తీరతాయి. ఈ విషయాలు అన్నీ లిసిన వాడే జ్ఞానానందుడు. చరాచర జగత్తు అంతటినీ తనయందే చూడగలుగుతాడు. గత్తులోని ఏ వస్తువూ తన కన్న వేరైనది కాదని భావిస్తాడు. ఇదే ఉపాసనా శాస్త్రసారము.

---

**యోగినీ హృదయము అను అద్వైత సిద్ధాంత ప్రతిపాదిత శ్రీ విద్యా గ్రంథానికి హారితస గోత్రీకుడు, శ్రీ క్రోవి కృష్ణమూర్తి శ్రీమతి సత్య పర్వత వర్ధనమ్మగారల జ్యేష్ఠపుత్రుడు అయిన క్రోవి పార్థసారథి సులభ శైలిలో సర్వజనా మోదము పొందునట్లుగా వ్రాసిన శ్రీ విద్యా హృదయము అను తెలుగు వ్యాఖ్యానము సమాప్తము.**